విరహపాండురతాజ్యోత్స్నవిలసనంబు
నతనుతాపాతపస్ఫూర్తి యలముకొనఁగ
రేయిపగలిదియని యేర్పరింపరామి
ముదితనేత్రాంబుజము లరమోడ్పుఁగాంచె.

—అ డి ద ము సూ ర క వి.

# స్వాగతము

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

తోరపుబత్తికల్మియెడఁతో, హాసియించెడుచూపుచాలుతో
సారగుణార్ద్రి, యాంధ్రజనసన్నుత మా "గృహలక్ష్మి" స్వాగత
శ్రీరమణీయగీతమురచించెద నీకొరకింకనామె నాం
గీరసహాయనంబ! కరుణింపుము, నింపుము జ్ఞానసంపదల్




## పెట్టుమందులు

పెట్టుమందులు. ఈశబ్దము శ్రవణగోచరమగుటతోడనే ఎన్నియో చక్కనిసంసారములను కలుషితముచేసిన విషాదసంఘటనములు చదువరుల స్మృతిపథమునకుదట్టుచున్నవి. పెట్టుమందులు సంసారములందు ప్రసక్తములైనపుడెల్ల దోషము స్త్రీలదేయగుట మేము కూడ ఒప్పుకొందుము. విద్య, వికాసములేకుండుటచే దేశమున పీటపెట్టిన దురాచారములలో ఈపెట్టుమందుల ప్రయోగమొకటియనుట నిస్సంశయము.

సువాసినులును, పూర్వసువాసినులునుగూడ ఈపెట్టుమందుల విషయమున దోషమొనరించుచున్నారు. మగని నిశ్చలప్రేమనుపొందుటకు సువాసినులీపెట్టుమందులనాశ్రయించుచున్నారు. వాత్స్యాయనుని కామశాస్త్రమునందు, వైద్యగ్రంథములందు వశీకరణమునకుగాను కొన్నిమందులు చెప్పబడియున్నవి. ఆమూలికలు అట్టిఫలమునిచ్చునవియే యని అంగీకరింతము. కాని వానిప్రయోగము మిక్కిలి అనుభవముతో కూడియుండవలయును. వస్తువిజ్ఞానముగల అనుభవజ్ఞునిచేతిలో అమృతముగ పనిచేయుమూలికయే వస్తువిజ్ఞానము, అనుభవములేనివానిచేతిలో విషమగుచున్నది. పెట్టుమందులను ప్రయోగించు స్త్రీలు సాధారణముగా తమపరిచితిలోనుండు ఏ ఎల్లమ్మనో పుల్లమ్మనో ఆశ్రయింతురు. మగని నిశ్చలప్రేమ పొందవలయునను కాంక్షాతీవ్రతలో పెట్టుమందులు వికటించినచో గలుగగల అరిష్టములకు వారు అంధులగుచున్నారు. శాస్త్రానుభవములేక ప్రయోగించిన ఈమందులు శరీరమున కెక్కుటతోడనే వారు ఆరోగ్యమునుగోల్పోయి శుష్కించినశరీరములతో, వెలిబారిన ముఖములతో, పండబారిన చర్మముతో నడపీనుగులగుచున్నారు. అర్థింపబడినప్రేమ లేదు సరిగదా అసలు ప్రాణికేమోసమువచ్చు పరిస్థితులు ఏర్పడుచున్నవి. ఇక అజన్మాంతము ఆతడు సుస్థితిపొందలేడు. పొందినను తనకు మందుపెట్టినమగువను నిండుహృదయముతో ప్రేమింపజాలడు. కావున ఈపద్ధతివలన మగని నిశ్చలప్రేమనుపొందుట సంశయాస్పదమును,

ప్రమాదయుతమును. తనకు లాలనఎఱిగిన మృదుహస్తములున్నవి; చీకటిని విరియించు చిఱునవ్వుగలదు; శ్రమనుగుర్తింప సేవాభిలాష ఉన్నది; దేవీస్వరూపమును తేజరిల్లఁజేయు దివ్యగుణముకలదు—కాగా ఇక స్త్రీ మగనిని వశీకరించుకొనుటకు పెట్టుమందుల నాశ్రయించుట పెడబుద్ధి. దైవదత్తములగు చక్కని వశీకరణసాధనములకు తాను స్థానమైయుండి ప్రమాదకరములు, ఫలవిషయమున సంశయింపదగినవియునగు కృత్రిమసాధనముల నవలంబించి స్త్రీ తాను నలుగురినోళ్లలోఁబడుచున్నది. తనఅర్థప్రాణమగు భర్త ఆరోగ్యమును చెఱచి వానిని జీవచ్ఛవముగా చేయుచున్నది.

పూర్వసువాసినులు ఈపెట్టుమందుల విషయమున సువాసినులకంటెను అత్యాచారము లొనర్చుచున్నారనవలసివచ్చినందుకు విచారించుచున్నాము. సువాసినులు ఏదో ప్రత్యక్షఫలమునుగోరి తమ మగలకు మందులుపెట్టుచున్నారు. పూర్వసువాసినులు—వారికి ఈజన్మకు ఇహలోకసుఖములు ఎట్లును లేవుగాన— ఉత్తరజన్మలోనైన ఉండుటకు గాను మందులనుపెట్టి ప్రాయముననున్న మగవారిప్రాణములను తీయుచున్నారు. ఈఆచారము కొన్నికొన్ని ప్రాంతములందు సుదృఢముగానున్నది. మాయెఱిగినంతవఱకు తెలుగు ప్రాంతములందు బళ్లారిజిల్లాలో కొన్నితావుల ఈఆచారముగలదు. అచ్చట పొరుగింట పచ్చిమంచినీళ్లు త్రాగుటకుగూడ సందేహింపవలసియుండును. ఇక భోజనముమాట చెప్ప నేల? ప్రపంచమునందు పలుమతములుగలవు. ఏమతముగాని ఈజన్మలో ఒకనిప్రాణము తీయుటవలన మఱుజన్మలో ఆహత్యచేసినవ్యక్తికి సుఖముకలుగునని చెప్పుటలేదు. జీవహింస పాపములకెల్ల పాపమని అన్నిమతములును చెప్పుచున్నవి. అట్టి పాపకార్యము చేయుట వలన ప్రతిఫలముగా ఉత్తరజన్మసుఖముగలుగునని నమ్మువారిని ఉన్మాదులతెగలో మొదటి కులమువారిగా పరిగణింపవలసియున్నది. ఏపాపఫలముననో ఈజన్మమున తాముసుఖమునకు దూరమైనారు. మూఢనమ్మకములను తలకెక్కించుకొని ఇపుడు ఘోరమహాపాతకమునకుఒడి కట్టి జన్మజన్మేపికూడ సుఖమునకు దూరమగు ఈపూర్వసువాసినీగణమును తలంచుకొనినచో విషాదము తలమునకలగుచున్నది. పెట్టుమందుల ప్రయోగమును నిర్మూలించుటకు స్త్రీల యందు విద్య, వికాసము పెంపొందించుటతప్ప గత్యంతరములేదు. విద్యావతులగుస్త్రీలు తమసోదరీమణులయందు విద్య, వికాసమునుకల్గించి ఇట్టిదురాచారములను తొలగించవల యును. పెట్టుమందులవలని ప్రమాదములును, కలుగుపాపమును బాగుగా వెల్లడిచేయవల యును. పూర్వసువాసినీగణమునకు తమనమ్మకమునందలి వైయర్థ్యమును, తమకార్యము నందలి పాపమును—సువాసినీగణమునకు పెట్టుమందులవలని ప్రమాదములను, లాలన-ప్రియ వాదితనము మొదలగు సుగుణములను వశీకరణసామర్థ్యమును బోధించుచో పాతివ్రత్య మునకు పంటపొలమగు భారతదేశమునందలి సంసారముల చరిత్రములను కలుషితమొనర్చు చున్న పెట్టుమందులపేరు వినబడకుండ పోవును. సంఘసంస్కర్తలు శ్రద్ధవహింతురుగాక!

# నీరాజనము

కొంపెల్ల జనార్దనరావుగారు

౧

లేమినేఁగల్ములు తుఱంగలించు, నీకు
నాయెడ వెలుంగు ప్రేమను; ఐనను అనర్హ
తాభిశప్తుఁడ నేను, శిరోధినిష్ఠి
తంబొనర్పఁగఁ దగుదానిఁదన్నివైతు.

౨

ఈప్రమోహాంధ్యముల విదళించివైచు
శిక్షణాచణత్వములు ప్రభాసిల్లు నీ ప్ర
వృత్తిచయమున సహజమై - వెడఁగు బెడఁద
యైననిది యెఱుంగు స్వకీయదీనభూతి.

౩

ఇదిమలీమసమైయైన, పదిలపఱిచి
సాఁకినాఁడను నవసిపోనీక; త్వత్ప్ర
సాదకాంతులు బింబించుసమయముల గ్ర
హింపనోడుదు నునికి, మత్తిల్లిపోయి.

౪

నీపరాఙ్ముఖగతుల గడించుకొందు
నీదుసాముఖ్యగతుల గుణించునేర్పు
పావనవ్రతానుష్ఠానపరత, నీప్ర
మోదబాష్పముపొంగించి పొంగిపోదు!

౫

ఎంతపరిదీనమోయి నాయెడఁదయిపుడు
ఐననెంతపునీతమోయీ! నివాళు
లెత్తుచున్నది, నన్ను దీవించుకొనియు
తనివిసెందెను నీమహత్త్వమునకిట్లు!

# భారతీయయువతి

పురాణం
కుమారరాఘవశాస్త్రిగారు బి. ఏ.

౧

ఆప్రణయమూర్తియెవరు? హిమాచలంబు
శృంగమునఁజేరి లీల యాసీనయయ్యె,
మృత్యువునుగూడగెలిచెడి ప్రేమమనసు
తనకనుమలుపులందు వ్యక్తమగుచుండ.

౨

అతిమధురమామెకంఠంబు, ఆలపింప
మొదలిడియెజోలపాట, త్రిమూర్తులే ప
రున్న చిన్నియూయెల యూపుచున్నదామె
సాటిలేని మహాతపశ్శాలిగనుక.

౩

సమయమబ్బినా చిరుతహస్తమునకత్తి
బట్టికదనరంగముజొచ్చి పగరమూక
చించి, మాతృదేశంబురక్షించుకొనును,
వెనుకచూపుజూడని వీరవనితయామె.
తరుణిరూపుగైకొన్న సౌందర్యమధువుఁ
గ్రోలఁగలుగుప్రేమోపాసకుండెవండొ;
తనదునాయుస్సునాబాలు ధారబోసి
యైనఁగాపాడు నిట్టియర్థాంగితనువు.

౪

అన్ని దేశాల, స్త్రీజాతి కంత కీను
శీలదేసుమ్ము ఆదర్శజీవితమ్ము,
పెట్టినదిపేరుపతిభక్తి కిట్టియామె
యెవ్వరోకాదు, మనభారతీయయువతి.

## కీ. శే. చోరగుడి సీతమ్మగారు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

శ్రీమతి సీతమ్మగారి కాపురస్థలము గుంటూరుజిల్లాకుజెందిన బాపట్లగ్రామము. శ్రీ సీతమ్మగారితండ్రిగారగు కీ. శే. వెలగపూడి దక్షిణామూర్తిపంతులుగారును, భర్తగారగు కీ. శే. చోరగుడి వెంకటాద్రిపంతులుగారును బాపట్లయందు చిరకాలము సుప్రసిద్ధులగు న్యాయవాదులుగానుండి ప్రతిదేశహితైకకార్యమునందును విశేషముగాపాల్గొనుచు మంచి పేరు కీర్తులుగడించినవారుగానుండిరి. శ్రీసీతమ్మగారు 1876 సం॥ మే 27-వ తేదీని జన్మించిరి. 1916 సం॥ మార్చి 31-వ తారీఖున మరణించిరి. ఆమెజీవితకాలము నలుబదిసంవత్సరములు. సీతమ్మగారు గొప్పవిదుషీమణి, కవయిత్రి. ఆకాలమున స్త్రీలమాసపత్రికలుగానున్న సావిత్రి, హిందూసుందరిపత్రికలును; ఆమెతండ్రిగారిచే నడుపబడుచుండెడి విద్యానందప్రకాశినియను మాసపత్రికయు ఆమె గద్యపద్యవ్యాసములను, సమస్యాపూరణములను పాటలను తరుచు ప్రచురించుచుండెను. శ్రీసీతమ్మగారిచే వ్రాయబడిన ప్రభావతీప్రద్యుమ్నమనెడి వచనకావ్యము 'విద్యానందప్రకాశిని'యే ప్రచురించెను. శ్రీసీతమ్మగారొక స్త్రీ సమాజమును స్థాపించి మరణించువఱకు నిర్వహించుచుండిరి. బాపట్ల కతిసమీపముననున్న ఇమ్మడిసెట్టివారిపాలెమనుపల్లెయందామెస్థాపించిన రాత్రిపాఠశాల యిప్పటికిని పనిచేయుచున్నది. 1913-వ సంవత్సరములో ఆంధ్రమహాసభ ప్రప్రథమమునజరుపబడినప్పుడు దానితోబాటు మహిళాసభను శ్రీకొటికలపూడి సీతమ్మగారిఅధ్యక్షతక్రింద శ్రీసీతమ్మగారే జరిపించిరి. 1915-వ సం॥ ఆగస్టు 5-వ తేదీని శ్రీసీతమ్మగారు యుక్తవయస్కులగు కుటుంబినులును, బాలవితంతువులును చదువుకొనునిమిత్తమై బాపట్ల త్రిపురసుందరీసమాజయువతీ విద్యాలయమనుపేర నొకవిద్యాలయమునుస్థాపించెను. దానిని శారదానికేతనమువంటి యుత్తమసంస్థగాజేయ కుతూహలపడుచుండెను. కాని యీవిద్యాలయముస్థాపించిన ముహూర్తమెట్టిదోకాని విద్యాలయముస్థాపించిన ఎనిమిదిమాసములకే శ్రీసీతమ్మగారు ఆకస్మికముగా కాలముచేసిరి. నాటితో ఆమెసంస్థలకుగూడ అయువు ముగిసినట్లైనది. స్త్రీసమాజము వెంటనే ఆగిపోయినది. కాని విద్యాలయముమాత్రము కొనఊపిరితో కొన్నాళ్లుకొట్టుకాడి దానిని నిర్వహింపగలసమర్థతగలస్త్రీ దొరకనందునను, పురుషులుదానిని నిర్వహించుటకు సమ్మతింపజాలమని దొరతనమువారు ఉత్తరువుచేసినందునను ఆగిపోయినది. సీతమ్మగారి కొక్కడేకొమారుడుగలడు. శ్రీసీతమ్మగారు గొప్పవిదుషీమణియేగాక గొప్ప సేవావ్రత. స్త్రీల విద్యాభివృద్ధివిషయమునను, దీనులగు బాలవితంతుసముద్ధరణయందును శ్రీమతి సీతమ్మగారికిగల ఆసక్తి నిరుపమానము. తనయింటనుండ నిచ్చగించెడివారికి భోజనాదివసతులు తనయింటనే సమకూర్చియు, అటులకానివారికి ధనరూపముగా సహాయమొనర్చియు బాలవితంతువులగు విద్యార్థినులకును ఉపాధ్యాయినులకును సీతమ్మగారు పెక్కువిధముల సహాయమొనర్చుచుండెడివారు. ఇట్టి స్త్రీజనబాంధవియైన శ్రీసీతమ్మగారు కాలము

చేసి పదునాలువత్సరములైనది. నేటికి బాపట్లయందలి స్త్రీలు మరల స్త్రీహితైషిణీమండలి యనునామముతో స్త్రీసమాజమును స్థాపించి అందు 8-2-32 తేదీని గ్రంథాలయమును నెలకొల్పి దానికి 'సీతాపుస్తకసదన' మను నామధేయమిడి శ్రీసీతమ్మగారియెడల తమకుగల భక్తిగౌరవములను వెల్లడించిరి. విదుషీమణియైన శ్రీసీతమ్మగారి కిట్టిసత్కార్యముగావించుటచే మండలిధన్యతనుబడసిన దనుటకు సందియములేదుగదా! శ్రీమతి చోరగుడి సీతమ్మగారిపేర 'సీతాపుస్తకసదనమ్' అనుగ్రంథాలయమును నెలకొల్పుసందర్భమున నేనీక్రిందిపద్యములను ఉపహారముగనిచ్చితిని.

ఆంధ్రజననీగాత్రసీమను
నలరు విదుషీరత్నమాలను
జారిపోయినదొక్కరత్నము
జాతిదుర్దశచే.
పెరటిచెట్టని మనము ఆమెకు
ప్రీతిగౌరవ మీయకున్నను
అలముకొన్నవి ఆమెకీర్తులు
ఆంధ్రదేశమునన్.
తెలుగుకైతలో ఆమెనామము
దివ్యకాంతుల తేజరిలగ
తెనుగుదేశము ఆమెపాండితి
తెలుసుకొన్నాదీ.
జానపదులకు రాత్రిబడిని
ప్రౌఢస్త్రీలకు పాఠశాలను
స్త్రీల కోశసమాజమునునిలిపి
సేవచేసిందీ.
పెరటనాటిన చిన్నమొలకలు
పెరిగిపెద్దవి కాకమునుపే
దాటిపోయినదామె మనపురి
దౌర్భాగ్యమునన్.
మధురమంజులమందహాసము
అధరసీమను చెలగుచుండగ
సరసవాక్కుల నామె నెల్లర
సరసజేర్చేదీ.

అగభీరత యానుశాంతం
బాచమత్కృతి యాయుదారత
అవనోవైదగ్ధ్య మరయము
ఔర! యెచ్చోటన్.
ఆమెపోయిన యాక్షణంబున
నడగిపోయిన వామెసంస్థలు
చేరదీసి రక్షణముసేయ
చేడెలెవ్వరులేకన్.
సంస్థలెంతప్రగాఢదీక్షతో
స్థావరములేర్పఱపదగునో
సాధ్వీసీతమ్మజీవితమె
సాటిచెప్పేనూ.
ఒరులకుపకృతి సేయుచుండుటె
యుత్తమవ్రతమంచు దలచి నిజ
జీవితంబును సమర్పించినట్టి
జనని సీతమ్మా.
ఆసుసాధ్వియె బ్రదికియుండిన
ఆమెసంస్థలె నిలిచియుండిన
మనపురీసౌభాగ్యమెటువలె
మహితమయ్యెడిదో!
ఆమెపై దృష్టి విస్తరించుట
కామెకోరికల నలువైచుట
కామెకీయకపోయెగా విధి
ఆయువధికంబూ.

సతులయందువిద్యాతమముగెడప
సమర్థమగునా దీపకళిక
చమురుమిగిలీ యుండగానే
చప్పున మలిగిపోయిందీ.
నిన్నమొన్న మనమధ్య నామె
యున్నయట్టులనుపించుమదికి
పదియునాలువర్షంబులపుడే
పరుగుదీసినవీ.
అకట! ఇన్నీయేండ్లుచనినను
నాసతీమణి సత్కరించెను
భాగ్యమేలనో గలుగదాయెను నీ
భావపురమునకున్.
అపరశారద యాసతీమణి
సర్వరీతిని బూజసేయగ
పుస్తకంబులకంటె మేలగు
బువ్వులుండునే.
స్త్రీహితైషిణి సీతమాంబను
స్త్రీహితైషిణిమండలినినేడు
గౌరవించెదము నిండుభక్తిని
గ్రంథసుమమాలన్.
జ్ఞానసౌరభవాసితంబుల
జ్ఞానకలుషవిదారితంబులు
దివ్యములుగద యీసుమము లా
దేవినర్చింపన్.
సాధ్వీసీతమపేర మనమిట
స్థాపించినగ్రంథసదనం బ
వని స్థిరముగ వెలయుగావుత
వాణిసత్కృపచే.

## అనుభవింపకఁదీఱునా?

శ్రీ చిలుకలపల్లి సాక్షిగోపాలస్వామి గారు

రజకుఁడాడిన నుడుల్
రామచంద్రుఁడునమ్మి
నడివి పాల్సేసె న
న్నంచుమదిలోగుందఁ
బూర్వకర్మముఁదప్పునా?
లక్ష్మణా! అనుభవింపకఁదీఱునా?
క్షితిలోనఁదనరారు
జీవకోట్లకునెల్ల
ధాతవ్రాసినవ్రాలు
తప్పదెందునుగాన
అనుభవింపకఁదీఱునా?
లక్ష్మణా! పూర్వకర్మముదప్పునా?
అంత గుణవంతుఁడో
నంతబలశాలియో
నంతధీశాలియో
రామమూర్తికేఁదప్పెనా?
లక్ష్మణా! వనవాసమునుబొందఁడా?
అటవిలో నాజీవ
మంతరింపఁగ నుదుట
ధాతవ్రాసినవ్రాత
దరమె దుడుపఁగ మనకు;
అనుభవింపకఁదీఱునా?
లక్ష్మణా! పూర్వకర్మము దప్పునా?
జీవితేశ్వరుఁడైన
శ్రీరామమూర్తితో
వందనములనిచెప్పుమా!
అటుపైని కర్మఫలమనిఁ దెల్పుమా!
జాగుసేయకనీవు
చనుము యింటికివేడ్క
రామాజ్ఞతలదాల్పఁగా!

* * *

లక్ష్మణా! అనుభవింపకదీఱునా?

# సీత, కైక

శ్రీ బుర్రా వేంకటానంద రాఘవరావుగారు బి. ఏ.

జనకమహారాజు యజ్ఞమునిమిత్తము భూమి దున్నుచుండగా నాగటిసాలులో దొరికినబాలిక. నాగటిసాలునకు సీతయనిపేరు. అందుదొరికినది గనుక ఆమెకు సీతయనుపేరు పెట్టి జనకుడు పెంచుకొనుచుండెను. పదివేలమంది బలాఢ్యులు కదల్పలేనివిల్లు విఱచిన వానికి అమెనిచ్చి వివాహముచేతునని ప్రకటించెను. రాము డవలీలగా నావిల్లువిఱచినందున జనకుడు మిగులప్రీతుడై దశరథునకు గబురంపి పిలిపించెను. వివాహవేదికపై వసిష్ఠమహాముని యాథావిధిగా నగ్నిహోత్రము వేల్చుచుండగా

"ఇయం సీతా మమసుతా సహధర్మ చరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా,
పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతాసదా".

అనిచెప్పి జనకుడు సర్వాభరణభూషితయగు సీతను మంత్రపూతజలముతో రామునకుఇచ్చి పెండ్లిచేసెను. అనంతరము వా రయోధ్యకువెళ్లిరి. సీతారాముల దాంపత్యము, వారియన్యోన్యప్రేమ దినదినము వృద్ధియగుచుండెను.

"ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి,
గుణాద్రూప గుణాచ్చాపి ప్రీతిర్భూయో వ్యవర్ధత".

వారిప్రేమ పరిపక్వమయిన యనంతరము రామపట్టాభిషేకమునకు భంగమును, రామున కరణ్యవాసమును తటస్థమయ్యెను. అపుడు రాముడు సీత నయోధ్యలోనుండు మనగా "నీడవలె మీవెంటనుండుమనియే మాతండ్రిగారియాజ్ఞ. నేను మీ సహధర్మచారిణిని. మీసాన్నిధ్యమే నాకుస్వర్గము. మీకు దూరముగానుండుటయన్న నాకుఘోరనరకము. తక్కినవాటితో నాకు నిమిత్తములేదు. మీవెంటవచ్చుటకు మీరు ఒప్పుకొనినయెడల చావు తప్ప నాకు వేరొకగతిలేదు" అనిసీత దృఢనిశ్చయముతో పలికెను. సరేయని రాము డామె వచ్చుట కంగీకరించెను. దండకారణ్యములో వారి దాంపత్యప్రేమ మరియు వికాసమునొందుచుండుటవలన వనవాసము వారికంతకష్టముగా తోచలేదు. ఇట్లు మహానురాగపాశబద్ధులయిన సీతారాముల ప్రేమైకజీవనమునకు బంగారులేడిమూలమున గొప్పకష్టమువచ్చెను. రాముని బాణముతగిలి మాయలేడి 'హా! లక్ష్మణా' యని యఱచిచచ్చెను. అది రాముని స్వరమనుకొని బెగిలి సీత రామునిసహాయము నిమిత్తము వెళ్లుమని లక్ష్మణునికోరెను. అవసరములేదని లక్ష్మణు డుపేక్షింప సీత మందబుద్ధియై యనుమానపడి మహాభక్తుడగు మఱిదిని నిష్కారణముగాదూషించి యవాచ్యములగు పరుషములాడెను. విషముకంటెను కార్చిచ్చుకంటెను దారుణములగు సీతమాటలకు లక్ష్మణుడు మిగులనొచ్చుకొని మిగులదుఃఖించి మరియచట నిలువనేరక దూరముగాబోయెను. రావణుడును సీతను చెఱగొనిపోయెను. సుమారొకసంవత్సర మామెలంకలో నశోకవనమున చెఱలోనుండెను. ఆకాలములో నామె నెట్లయిన వశముచేసుకోవలెనని రావణుడు సర్వవిధముల ప్రయత్నించిచూచెను. దేవేం

ద్రుడు నష్టదిక్పాలకులు మనబంట్లు; ముల్లోకములకురాణివై మహావైభవమనుభవింపుచు నేలుకొమ్మని యాశలుబెట్టెను. రాముడుచచ్చెనని శిరస్సుచూపించి మరి యతనికొఱకేడ్వ వద్దనెను రాక్షసస్త్రీలనుబెట్టి బెదరించెను. చంపివైచెదననెను. ఏమన్నను రామస్మరణము తప్ప మరియొకటిలేక సీత చెలినుండెను. హనుమంతుడు తనవీపుపై నెక్కరమ్మన్నను "పర పురుషుల తనువంటని పరమపతివ్రతను" రాననెను. రాముడు రావణునిచంపినతరువాత సీత రెండుజాములగ్నిహోత్రములో చెక్కుచెదర్చక పగడములరాసిలో బంగారుబొమ్మవలె నిలువబడి ముల్లోకములుజేపట్ట పరీక్షయిచ్చి పైకివచ్చెను. గంధపుచెక్క సానపై నరుగదీసిన కొలది సువాసనప్రకటించునట్లు, మీటినకొలది వీణె మధురగీతములబాడి హాయిమనిపించు నట్లు, కాల్చినకొలది బంగారము వన్నెకెక్కునట్లు కష్టపరంపరచేత సీత పాతివ్రత్యప్రభా వము లోకమునకు విశేషించి విశదమయినది. ఏకపత్నీవ్రతమునకు శ్రీరాముడును, పాతి వ్రత్యమునకు సీతయు, దాంపత్యసౌభాగ్యవర్ధనమైన ప్రేమమహిమకు సీతారాములును లోకములో సాటిలేనివారుగానున్నారు.

"నీవు తలపగిలిచచ్చినను సరే కాని నీవెందుకునవ్వినావో ముందు చెప్పుమ"ని భర్తను పీకిపిండిపెట్టిన యిల్లాలగు కేకయరాజుభార్యకు కుమార్తె కైక. లోకులదూషణభూషణ తిరస్కారములతో నామెకు ప్రయోజనమేమియులేదు. కార్పణ్యవిషయములో తల్లికంటె నేడాకులెక్కువచదివి, మగనికి కీలెఱిగి వాతబెట్టి దాసోహమనిపించి కోతివలెనాడించి పంతము చెల్లించుకొనితీరినది. ఇట్టివారులేనిపక్షమున లోకము చప్పగానుండును. కైకయు, రావణు డునులేనిపక్షమున రాముని ప్రభావమును, సీతపాతివ్రత్యమును లోకములో ప్రకటనయగుట కవకాశమేలేదు. అనగా రామాయణములేదు.

## కైక

కోటగిరి వీరబసవకవిగారు

"ఏమనిచెప్పవచ్చు! తనకెన్నడుహానిదలంపనట్టి శ్రీ
రామునికానకంపె" ననిరచ్చలకీడ్చిరి నిన్నుగాని నీ
వామహితాత్ము కానలకుపంపిన సత్ఫలమేగదా సమ
స్తామరవైరినాశనము. సంస్తవనీయవు కేకయాత్మజా!

దశరథుని సత్యరక్షణ; ధరణిజాత
మహితరపతివ్రతాత్వయగాధమహిమ;
భరతసౌమిత్రు లనుజన్మభక్తి; నీవు
కారణముగాగ విఖ్యాతిగాంచెగాదె?

తెలియనివారు నిన్నొకటదిట్టిన దిట్టగనిమ్ము, దానిచే
కలుగునెనీకు లోపము? జగన్నుతవర్తనయా ధరాత్మజన్
గలుపితశీలయంచనిన కట్టిడిలోకుల వాయిమూయగా
దలచె పరోపకారకరణప్రతిభాసితబుద్ధి! కైకరో!

# అద్దములో

శ్రీమతి పాకలరత్నమాలగారు

రాణీకి నాలుగుసంవత్సరాలు. వచ్చీరానిమాటలతో తలిదండ్రులని ఆనందంలో ముంచేస్తుంటుంది.

ఆనాడు రాణీపుట్టినదినం. గొప్పవేడుకతో జరిపారు. రాణీనిశృంగారించి కుర్చీలో కూర్చోబెట్టిందిఅమ్మ. చూడవచ్చిన పేరంటాండ్రు 'పెళ్ళికూతురులాగా వున్నది రాణి'అన్నారు. ఆమాటవిని కుర్చీలోంచి లేచి పారిపోయింది రాణి. తరువాత క్లబ్బునుంచి రాణినాన్నగారువచ్చారు. వచ్చీరావటంతోనే ఎత్తుకోమని తనచిన్ని చేతులందిచ్చింది. రాణీనెత్తుకుని గదిలోకి తీసుకెళ్ళి 'ఇవ్వాళరాణీ చిన్న పెండ్లికూతురులాగుందికదూ? అన్నాడు భార్యతో.

నాన్నదగ్గిరనుంచిదిగి పందిరిమంచముమీద కూర్చున్నది రాణి. 'చూశారా, పెండ్లికూతురన్నారని కోపమొచ్చి దిగిపోయింది. ఇందాకా పేరంటాండ్రు అన్నప్పుడుకూడా ఇల్లాగే పారిపోయిం'దని చెబుతోంది రాణీఅమ్మ.

రాణీమంచంమీద కూచుని గది పరీక్షచేస్తోంది. గదిగుమ్మాలకువేసిన పూసలతెరలనీ, బీరువాలోనున్న బొమ్మలనీ, గోడలకు తగిలించివున్న చిత్రపటాలనీ చూస్తూండగా రాణీదృష్టి ఎదురుగావున్న నిలువుటద్దంమీద పడింది. చప్పట్లు చరుస్తూ మంచంపైన గంతులువేస్తూ 'నాన్నా!నాన్నా! నాకు యిద్దరు నాన్నలు అన్నది. నాన్ననిర్ఘాంతపోయాడు. పట్టరానికోపంవస్తోంది. అమ్మ చిత్రప్రతిమలాగానుంచుని గడగడలాడుతోంది. ఎవ్వరూమాటలాడలేదు. కాని రాణీమాత్రం అలానవ్వుతూనేవుంది. ఆచిన్నిహృదయంలో ఎట్టిమాలిన్యమునూలేదు. ఆనందసాగరంలో వోలలాడుతోందిరాణి.

నాన్న కలగబారినహృదయాన్ని చిక్కబట్టి మెల్లిగా రాణీదగ్గిరకువచ్చి రాణీ ముఖచంద్రబింబాన్ని తదేకధ్యానంలోచూస్తూ 'అమ్మా! నీకు యిద్దరు నాన్నలేరీ?' అన్నాడు గద్గదికమైన కంఠస్వరముతో.

జవాబుకొఱకు నిరీక్షిస్తున్నాది అమ్మ.

రాణీ ఎప్పటివలె నవ్వుతూ నాన్ననిదగ్గిరకులాగి 'ఇదిగో, నువ్వొకనాన్న, అదిగో, ఇంకోనాన్న అద్దంలో'అన్నాది.

అమ్మ ఒక్కనిముషములో రాణీనుచెక్కిళ్ళపై ముద్దులవర్షం కురిపించేసింది. నాన్న రాణీనెత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు. క్షణముక్రింద భయకంపితురాలైన అమ్మా, కోపమూర్తిఅయిన నాన్నాకూడా ఇప్పుడు రాణీనిముద్దులాడుచూ మహానందంతో ఆనిలువుటద్దంలో కనబడుచున్నారు.

# భద్రాచల క్షేత్రము

తాత కృష్ణమూర్తిగారు, బి. ఏ; యల్. టి.

ఈకోవిల, యీఉత్సవాలు లేకపోతే భద్రాచలంలో నరుడన్నవాడు కనిపించడనుకుంటా! దండకారణ్యం యిది! కోయలు, పెద్దపులులు, పాములు నివసించే మన్యస్థలం. గుట్టలు, పుట్టలు, అడవులు, వాగులు-యెటుచూసినా యివే! పాడి, పంట-పండ్లు, కాయ-పువ్వులు, చెరువులు, తోటలు-యేవీలేవు. శీతోష్ణస్థితి చేత చెప్పనక్కరలేదు. ఉపద్రవమైనయెండలు. ఎడతెరపిలేనివర్షాలు. ఏరుతువు కారుతువు మొఱ్ఱో అనిపిస్తుంది. కారణాంతరాలచేత రామలక్ష్మణులీకారణ్యంలో తిరగవలసివచ్చిందట-ఆమహాయిల్లాలు, సీతతో పాటు. ఏంతినిబ్రతికేవారో పాపం? దుంప, ధూళి అయినా దొరకనిప్రదేశం. జంతుమాంసం, యిప్పపువ్వు, కొండజొన్న తిని కాలక్షేపంచేసేవారుకాబోలు-వాగునీళ్ళు, తాటికల్లు, గొఱ్ఱెపాలుతాగుతూ!

భద్రుడిభక్తికీ, ఆతిథ్యానికీ సంతోషించి, రాముడీకొండమీద వెలిసినట్లుచెప్తారు. కాబట్టే యీవూరుకు భద్రాచలంఅనేపేరు వచ్చిందట. దరిమిలాని, రామదాసుధర్మమాఅని యీకోవిల లేచింది. క్రమంగా ఊరు, కోవిల అభివృద్ధిచెందాయి. ఇప్పుడీగ్రామం జనసంఖ్య మూడువేలు. ఉద్యోగస్థులు, వైష్ణవులు, గవర్నమెంటుబంగళాలు, పెంకుటిళ్ళు, పబ్లిక్ నూతులు, రోడ్డుదీపాలు, సబ్ కలక్టరుకచేరి, పోలీసు డెప్యూటీ సూపరింటెండెంట్ బంగళా, ఆసుపత్రి, హైస్కూలు, రెండుమూడుసత్రములు, నాటకశాల, ఇప్పసారా డిస్టిలరీ, క్లబ్బు, కాఫీదుకాణాలు, షాపులు-అనేకవిధాలగా ఊరు అభివృద్ధిపొందింది. వర్తకం, వ్యవసాయం, నాగరికత మెల్లమెల్లగావ్యాపిస్తున్నాయి. పండు, కాయ ఊళ్ళోలేకపోయినా, స్టీమర్లమీద విరివిగావస్తున్నాయి. పెరుగు, పాలు-గొఱ్ఱెవో, మేకవో, యెద్దువో-యేవో సమృద్ధిగాదొరుకుతున్నాయి.

రాజమహేంద్రానికి వందమైళ్ళదూరంలో గోదావరితీరాన్ని తూర్పుకనుమలమధ్య ఉన్నదీక్షేత్రం. చిన్నఊరు. జమీందారీస్థలం. చిత్రంయేమిటంటే, తాలూకాయావత్తూ బ్రిటిష్అయినప్పటికీ, కోవిలమాత్రం నైజామువారిది. దానిఖర్చువెచ్చాలు, మంచిచెడ్డలుఅన్నీ నైజాంవారివే. సాలుకు యిరవైవేలుఖర్చట. హిందూమహమ్మదీయులసఖ్యతకు నిజంగా ఈకోవిల ప్రబలమైననిదర్శనం. మధ్యగా ప్రవహిస్తూవున్న గోదావరినదికి తూర్పుతీరాన్ని భద్రాచలం, పశ్చిమతీరాన్ని నైజాంరాజ్యం. ఒకప్పుడు భద్రాచలంతాలూకా నైజాంరాజ్యంలోనిదేనట. సుమారు నాలుగువందలయేళ్ళక్రిందట గోపన్నఅనే గోలుకొండవ్యాపారి నైజాం వారిఉద్యోగంలో తహసీల్దారీచేసినట్లు, అధికార్లనుమోసగించి ఆరులక్షలరూపాయలుతస్కరించి యీకోవిల కట్టినట్లు, దేవుడికి నగలు, భోగాలు, అన్నిసదుపాయాలు ఏర్పాటుచేసినట్లు, పిదప తానీషావారిచేత కట్టుబడి శిక్షింపబడినట్లు, దేవుడప్పుడు రాజుగారికి కలలోకనబడి రామదాసును కాపాడినట్లు, నాడుమొదలు తానీషాసంతతివారే యీకోవిలను పోషిస్తున్నట్లు కథ.

భద్రాచలదేవాలయం చాలాప్రఖ్యాతిగాంచినకోవిల. దూరదేశాలనుండికూడా యాత్రీకులు వస్తూవుంటారు. ప్రతియేటా ముక్కోటిఏకాదశికి, శ్రీరామనవమికి పెద్దఉత్సవాలుజరుగుతాయిక్కడ. ముఖ్యంగా చైత్రమాసంలోజరిగే కళ్యాణోత్సవం దేశదేశాలకు వినికిడి.

నైజాంరెయిలిప్పుడు కొత్తగూడెంవరకూఉన్నది. కొత్తగూడెంస్టేషనుపేరే "భద్రాచలంరోడ్డు." తెలియనివాళ్ళు అదే భద్రాచలంఅనుకుంటారు. భద్రాచలానికీ అస్టేషనుకూ సుమారు పాతికమైళ్ళదూరం. యాత్రీకులిప్పుడు రెయిలుమీదరావచ్చు బెజవాడమీదుగా. లేదా, రాజమండ్రినుండి పడవమీదనో, లాంచిమీదనోరావచ్చు. ఏదారినివస్తేసదుపాయమని అందరూఅడగడం సహజమే. శరీరదార్ఢ్యంకలవాళ్ళకీ, ఆయుర్దాయంబలంగాఉన్నవాళ్ళకీ ఉత్సవంరోజులలో రెండుదారులూఒకటే. ఈవూరుచేరేలోపునే భద్రాద్రి

రాముడు ప్రత్యక్షమౌతాడు—ముఖ్యంగా ముసలివాళ్ళకు, విధవవాళ్ళకును. బెజవాడలో రెయిలెక్కి డోర్నకల్ జంక్షనులో దిగి మరో రెయిలెక్కి కొత్తగూడెం రావాలి. అంటే నీరు, నిప్పు, నీడ, చెట్టు యే సౌకర్యం లేని స్టేషనులో. రెయిలుదిగగానే సాయీరుజవాన్లు ప్రత్యక్షం. సామాన్లు తనిఖీ చేస్తారు. కొత్తబట్టలు, కొత్త వస్తువులు యేవైనా పెట్టెలలో ఉంటే వాటికి కస్టమ్సుడ్యూటీ చెల్లించాలి—రూపాయివిలువైన వస్తువుకు అణా చొప్పున. పెట్లో యేమీ ఉన్నా, లేకపోయినా యీ హడావిడిమాత్రం తప్పదు—తప్పించుకునే విధం తెలియని వాళ్ళకు. కొత్తగూడెం గ్రామానికీ, రెయిలుస్టేషనుకూ నాలుగు మైళ్ళదూరం. ఊళ్ళోకి పోదామనుకుంటేను తిన్నగా భద్రాచలమే చేరుకుందామంటేను మోటారుబస్సే గతి. ఆవకాయలో పిండికూరినట్లు వాటిలో ప్రయాణీకుల్ని కూరుతారు బస్సువాళ్ళు. మనిషిమీద మనిషి. సామాన్లు, సాయిబులు, వెధవముండలు, చంటి పిల్లలు, తగవులాటలు, యేడుపులు, పాటలు—గోల! ఆడ, మొగ, అన్న వివక్షణ పాటించే లాభం లేదు. మోటార్లో చోటు దొరకడమే పదివేలు.

ఇప్పుడిప్పుడు సాఫైన మోటారురోడ్డొకటి చాలామట్టుకు తయారైంది. మొన్న మొన్నటిదాకా సరియైన రోడ్డే లేదు. అంతా అడవిదారి. రాళ్ళు, రప్పలు, ముళ్ళకంపలు, యెత్తుపల్లాలు—ప్రయాణం చాలా వొడుదుడుకుగా ఉండేది. మోటార్లు అనుగడుక్కీ ఆగిపోవడం, విరిగిపోవడం, బోల్తాపడడం—నానాఅవస్థగానూ ఉండేది. ఊపిరాడక, మోటారు కుదుపుకు చంటిపిల్లలు చచ్చిపోవడంకూడా కద్దు. దారిలో 'కిన్నెరసాని' అనే వాగొకటి దాటవలసివస్తుంది. ఎండకాలం ఆవాగులో నీళ్ళుండవు. ఇంచుమించొక ఫర్లాంగున్నర వెడల్పున భగభగమండే యిసక. ఆయిసకలో మోటారు కదలదు. ప్రయాణీకులు దిగి మోటారు తొయ్యాలి. కింద కాళ్ళు కాలడం, మీద నెత్తిమండడం, దాహం, చెమట యెంతతోసినా మోటారు నాలుగడుగులు కదిలి మళ్ళీ ఆగిపోవడం—ఇట్లా ఒకగంట అవస్థపడి వాగుదాటాలి. అప్పుడు మళ్ళీ బస్సులో చోటుకోసం దెబ్బలాడుకొని యేమూలో యిరికి, భగవంతుణ్ణి ధ్యానిస్తూ కూర్చోవాలి. ఈ ప్రయాణంలో సర్వసాధారణంగా చక్రాల్లో గాలిపోవడమో, యేదైనా విరిగిపోవడమో యేదో ఒక మరమ్మత్తు వస్తూనేవుంటుంది బస్సుకి. రండికీ మొండికీ ఓర్చే శరీరాలైతేగాని యీ ప్రయాణానికి తాళలేవు. ఎలాగైతేనేమి 'బూరుగుంపాడు' చేరుకుంటుంది బస్సు—అంటే భద్రాచలానికి రెండుమూడు మైళ్ళదూరంలో గోదావరికి పడమటివొడ్డునవుండే నైజాం గ్రామంలో. కాని బస్సు అక్కడే ఆగిపోదు. ప్రయాణీకుల సదుపాయార్థం నదీతీరందాకా వచ్చి తాటిచెట్ల మధ్య భద్రాచలానికి యెదురువొడ్డున ఆగుతుంది. తెల్లని యెత్తయిన కోవిలగోపురాలు, చింతచెట్లు, పెంకుటిళ్ళు, తాటాకుపాకలు—భద్రాచలం ఊరు యెదురుగా కనిపిస్తూవుంటుంది. అందరూ బస్సుదిగి కూలీల నెత్తిని సామాను పెట్టి, గట్టుదిగి యిసకలో రెండుఫర్లాంగులు నడిచి, కాలిరేవున నదిదాటి మళ్ళీ యిసకలో రెండు ఫర్లాంగులు నడిచి వొడ్డు చేరాలి.

గట్టెక్కగానే రేవువొడ్డున రెండు చింతచెట్లు, ఒక చిన్న ఆంజనేయాలయం, బైరాగుల మంటపం, సత్రం కనిపిస్తాయి. ఉత్సవంరోజులలో అయితే ఊరెంతో కలకలలాడుతూ ఉంటుంది. తిండికీ, దాహానికీ యేమైనా దొరుకుతుంది.

రాజమండ్రీనుండి పడవలమీద ప్రయాణంకూడా కష్టంగానే ఉంటుంది. మోటారులాంచీమీద మామూలురోజులలో మూడురోజుల ప్రయాణం. వరదరోజులలో అయితే అధమం నాలుగురోజులవుతుంది. ఎండకాలంలో నదిలో నీరు తక్కువగావుంటుంది కనుక స్టీమర్లు నడవవు. నడచినా ఐదారురోజుల ప్రయాణం. నీట్లో పెద్దపెద్ద రాళ్ళు. మధ్యమధ్య నీరుచాలక యిసకలో లాంచి తగులుకోవడం. సాయంత్రంపూట తరుచుగా సుడిగాలి. అనేక ప్రమాదాలు. చైత్రమాసంలో శ్రీరామనవమికని బయలుదేరే పడవల అవస్థ మరీ

అన్యాయంగానుంటుంది. పదిమందికిసరిపోయేపడవలో యాభైమంది యెక్కుతారు. నదివొడ్డున యెండలో వంటలు, తిళ్ళు; రాత్రి యిసకతిన్నెలమీద పడక; అవసరమైనప్పుడల్లా నీట్లోదిగి పడవతోస్తూవుండడం-వారం రోజులిట్లా అవస్థపడాలి. అయితే యాత్రాభిలాషగలభక్తులకు యీకష్టాలేవీ కనపడవు.

ఐదారేళ్ళనుండి యీస్టీమర్ల సౌకర్యం లభిస్తూవుంది యాత్రికులకు. అందుచేత పూర్వంవలెగాక యిప్పటి బెజవాడపాడుగునా వస్తూవుంటారుజనం.

పెద్దవాళ్ళు పెళ్ళికిమట్టుకు స్టీమర్లున్నా లేకపోయినా వేలకొలదీవస్తారుజనం. ఒకవారం పదిరోజులూ ఊరు మహా అలికిడిగానుంటుంది. పోయ్యేవాళ్ళకు, వచ్చేవాళ్ళకు, ఉద్యోగస్తులకు, పూజార్లకు అందరకీ పండగే! అద్దెలకివ్వడానికని చాలామందియిళ్ళకు సుద్దో సున్నమో పూసి ముగ్గులుపెట్టి సిద్ధంచేస్తారు. వర్తకులు రాజమండ్రినుండి కొత్తసరుకు విరివిగా తెప్పిస్తారు. ఈపదిరోజులు అమ్మకం బహువిపులంగా జరుగుతుందనేనమ్మకంకొద్దీ. రాజమండ్రివర్తకులుకొందరు పడవలమీద సామాన్లువేసుకొని వారం పదిరోజులుముందుగానేవచ్చి కూచుంటారు. బజారు కిటకిటలాడుతూవుంటుంది దుకాణాలతో. ఇత్తడిసామాన్లు, మాయవెండి సామాన్లు, పూసలదుకాణాలు, కుంకంకొట్లు, ఖిల్లీదుకాణాలు, కాఫీహోటేళ్ళు, సోడాషాపులు, లక్కపిడతలు, గాజుబొమ్మలు, ఆటవస్తువులు మొదలైన చిల్లరసామానుదుకాణాలు, ఫాన్సీగుడ్స్‌షాపులు-అన్నిరకాలదుకాణాలు బజారుకు రెండువైపులపేర్చబడివుంటాయి. నాటకసంఘాలు, భాగోతులు, గారడీవాళ్ళు, వీటివాళ్ళు, బిచ్చగాళ్ళు, దొంగలు యెక్కడెక్కడినుండో వచ్చిపడతారు యాత్రికులను, ఊరివాళ్ళను దోచుకుందుకు.

గవర్నమెంటువారు యేటా యీకళ్యాణోత్సవానికి కొంతడబ్బుఖర్చుపెట్టి వచ్చేజనానికి కొంతసదుపాయంచేస్తారు. జనంకోసం గోదావరివొడ్డున తాటాకుపాకలువేస్తారు. నదికి వెళ్ళేవాళ్ళకాళ్ళుకాలకుండా వొడ్డునుండి నీటివరకు పొడుగుగా పందిరివేస్తారు. బయలుప్రదేశాలలో చిన్నచిన్న మరుగుదొడ్లుకడతారు. నదివొడ్డున యిసకలో కొళాయిలు వేస్తారు. ఆరోగ్యశాఖవారు నూతులలోను, గోతులలోను మందులు కలుపుతారు రోగాలురాకుండా. పోలీసులు, వాలంటీర్లు, బాయిస్కౌట్లు, ఉద్యోగస్తులందరూ యేదో పబ్లిక్‌డ్యూటీమీద యిటూఅటూతిరుగుతువుంటారు. కోవెలలో నైజాంపోలీసు, బ్రిటిషుపోలీసు, వాలంటీర్లు మొదలైనవాళ్ళు జనాన్ని ఒకరినొకరు తోసుకోనివ్వకుండా కాపాడుతూవుంటారు.

ప్రతియింట్లోను కొత్తజనం-చుట్టాలో, స్నేహితులో, అద్దెకుదిగినవాళ్ళో యెవళ్ళోఒకరు. ఊరంతా ధూళి, దుమ్ము, దుర్వాసన. పాకీవాళ్ళు, హెల్తుఉద్యోగస్తులు యెప్పుడుచూచినా పనిచేస్తున్నట్టే కనబడతారు. భజనలు, కేకలు, తగవులాటలు-ఊరంతా కోలాహలం. పగలు పనితో పడు. రాత్రి నిద్రపట్టదు. ఎండ, పొగ, జనసమ్మర్దంకొద్దీవేడి, చికాకు-ప్రాణం బేజారెత్తిపోతుంది.

ప్రతియేటా యిదేముచ్చట. దేవుడిపెళ్ళి దగ్గిరకివొస్తుందీఅంటే యేవో దిగులుగావుంటుంది మనసులో. ఎంతమందిచుట్టాలొచ్చిమీదపడతారో అని బెంగ! కలరా, ప్లేగు, మసూచి, యేరోగాలుపుట్టుకొస్తాయో అనిభయం! "కలరాఇంజక్షను మీయింట్లో అందరికీ చేయించారా అండీ? ముందుగానే జాగ్రత్తపడితే మంచిది. కీడెంచి మేలెంచాలంటారు మనవాళ్ళు" అని సలహాయిస్తూవుంటారు మిత్రులు. "హైదరాబాదులో ప్లేగు చాలాభయంకరంగావున్నదట. అక్కడినుండివచ్చినవాళ్ళు చెప్తున్నారు" అని మరికొందరు. "ఊళ్ళో యెక్కడో మసూచికం కేసువున్నదట-విన్నారా?"

ఎన్నిటికని బెంగపడడం? ఏదిజరగవలసివుంటే అలాజరుగుతుంది. ఇంతజనంమీద యేరోగం పుట్టినా ఉద్రుతంగానే పరిణమిస్తుంది. మూడేళ్ళక్రిందట కలరావొచ్చినప్పుడు ఊరంతా గగ్గోలుపుట్టింది. వచ్చినజనం చెల్లాచెదరై వెళ్ళిపోయారు. కేవలంభయంకొద్దీ చాలామంది చచ్చిపోయినారు. ప్రయాణీకులు

# శ్రీరామనవమి: భద్రాచల దృశ్యములు



బజారువీధి



స్నానాల రేవు



పడవల రేవు

# శ్రీరామనవమి: భద్రాచల దృశ్యములు



శ్రీరామ దేవాలయము



ఆలయమునకు వెనుకవైపున



కల్యాణమంటపము

తోవలో కొందరో మరణించారట—పడవలలోను, రెయిళ్ళలోను. సగంసగం ప్రాణం ఉంటూవుండగానే కలరారోగుల్ని వొడ్డునపారేసి పడవలు వెళ్ళిపోయేవట. దహనకర్మలుచేసేవాళ్ళు లేక గోదావరిలో తేలిన శవాలకు లెక్కలేదు.

తీర్థానికివచ్చినజనానికి సరియైన వైద్యసహాయంలభించదు. అందుకుతోడు వాళ్ళుతినేతిండికూడా కలరావచ్చేటందుకు అనుగుణ్యంగానే ఉంటుంది. ఏచెట్టుక్రిందనో, గోదావరితీరాన్నో ఉడికీవుడకని మెతుకులు పచ్చిపులుసుతో తినడం. ఎండలోతిరిగి అడ్డమైననీళ్ళు త్రాగడం. కోవెలప్రసాదమనిచెప్పి కొబ్బరికాయలు, అరటిపళ్ళు, పులిహోర, పొంగలి అన్నీ తినడం. రోగంవస్తే కాళ్ళు, చేతులు చల్లబడేవరకూ యెవరికీ చెప్పకపోవడం.

ఇటీవల హెల్త్‌డిపార్టుమెంటువాళ్ళు కొంచెంమేలుకొని చిన్నతమాషాచేస్తున్నారు. "భద్రాచలంలో ఉపద్రవమైన కలరాగాఉన్నది. తీర్థానికివెళ్ళదలచేజనం బ్రతుకుమీదఆశలేకుంటే వెళ్ళవచ్చును" అని వార్తాపత్రికలలో ప్రకటిస్తున్నారు; చుట్టుపక్కలగ్రామాలలో దండోరావేయిస్తున్నారు. ఏదోవిధంగా యాత్రీకులనుహడలుకొట్టి రానివ్వకుండా కొంతవరకు కాపాడుతున్నారు. అప్పటికీ ప్రతీయేటా పదిహేను వేలజనానికితక్కువకాకుండా వస్తూవుంటారు. నాలుగేళ్ళక్రిందట సామ్రాజ్యపట్టాభిషేకోత్సవానికని నిజంగా యెంతమందివచ్చారో హద్దూపద్దూలేదు. 'అరవై వేలమంది' అనికొందరు, 'లక్షపిల్లర' అనికొందరు అంచనా వేశారు. ఎక్కడచూసినా కొత్తజనమే. రాత్రిపూట రోడ్లమీదనే పడుకొనేవారుకొందరు వేరే బసదొరకక. ఆనాలుగురోజులకీ యెంతచిన్నగదికైనా యిరవైముప్పైరూపాయల అద్దెకుతక్కువ ఉండేదికాదు. ఊళ్ళో వర్తకులవద్ద పప్పు, బియ్యం చెల్లిపోయి కరువువస్తుందేమోఅని భయంవేసేది. ఏయిల్లుచూసినా మూడోతరగతి రెయిలుపెట్టెలవలె కిటకిటలాడుతూఉండేది. ఆలయంలో అడుగుపెట్టడానికే చోటుండేదికాదు. ఆరోజు దేవుడిదర్శనంచెయ్యగలిగినవాళ్ళు నిజంగా యుద్ధానికిపనికివచ్చే వీరులన్నమాట.

ఇప్పుడైదారేళ్ళనుండి, శ్రీరామకల్యాణం ఆలయప్రాకారంలో జరగడంలేదు; కోవెలకువెనుకవైపువ దగ్గిరగావున్న ఒకగుట్టమీద కొత్తగాకట్టించబడిన కళ్యాణమంటపంలో జరుగుతూవుంది. నలుగురికీ కనబడేటట్లు తిలంబ్రాలవేడుకజరగాలని ప్రజలఅభిప్రాయం. సీతారామానుజాచార్యులనే ఒకముసలాయన క్రమంగా చందాలుపోగుచేసి యీమంటపంకట్టించడం ప్రారంభించినాడు. బయలుస్థలంలోఉండే ఆగుట్టమీద క్రమంగా ఒక్కొక్కస్తంభమే లేచింది. పాతికేసి రూపాయలకుతక్కువకాకుండా చందాలిచ్చిన రామభక్తులపేర్లన్నీ ఆస్తంభాలమీద వ్రాయించబడినవి. అయితే 'యీమంటపంకట్టడానికి యెంతడబ్బుకావాలి? ఎన్ని స్తంభాలుండాలి? ఏవిధంగాకట్టాలి?' అన్నఆలోచన ఆచార్యులుగారు పెట్టుకోలేదు. చందాలు వసూలైనకొద్దీ కొత్తస్తంభాలు లేస్తూనేఉండాలి. ఈపనికి ఆది, అంతం అనేవిలేవు. కావలసినంత గుట్టఉన్నది. ఎక్కడ యెంతపొడుగు స్తంభం యేవిధంగాకట్టించినా ఆక్షేపణఉండదు. పిండికొద్దీరొట్టె. స్తంభం సగంకట్టి విడిచేసినా యెవరూ యేమీఅనలేరు. డబ్బో? డబ్బుచాలడంలేదు! ఇంతకూ యిది రామకార్యం. భక్తుల యథాశక్తికొలదీ మంటపం తయారవుతుంది. 'ఇన్ని స్తంభాలేమిటి? అవి యింతలావుగా దగ్గిరదగ్గిరగా వంకరటింకరగా ఉన్నాయేమిటి?' అనిఅడగడానికి యెవడికి మగుదూరున్నది? రెండేళ్ళక్రిందట యేలూరువైశ్యులెవరో యీనిర్మాణవైఖరిచూసి యీ స్తంభాలన్నీ పడగొట్టి మంచి అందమైనమంటపం చేతిడబ్బుపెట్టి కట్టిస్తామని వాగ్దానముచేశారట. వారుకట్టించినా మానినా ప్రస్తుతం యీ స్తంభాలైనా కూలద్రోసేపుణ్యాత్ములెవరూలేరాయెనేఅని యెందరో విచారిస్తున్నారు.

గుట్టమీద సదును చెయ్యకుండానే కట్టించినారీ స్తంభాలు. వాటిమీద పెదుళ్ళుపరచి నావలుకప్పేశారు శ్రీరామనవమినాటికి. పట్టపగలు చీకటిగాఉంటుంది ఆలోపల! ఆస్తంభాలమధ్య ఒకవివరను

ఓచిన్న మంటపం—దానిమీదికి వేంచేయింపిస్తారుస్వామిని. స్వామిచుట్టూ పూజార్లు, ఉద్యోగస్థులు, పోలీసులు మూగిఉంటారు. మంటపానికిచుట్టూ యీ స్తంభాలమధ్య కిటకిటలాడుతూ జనం. వెలుపల యెండలో నెత్తిమాడుతూ వేలకొద్దీజనం. గుట్టమీద, రాళ్ళమీద, చెట్లమీద, యెదురుగావున్న కోవిలమెట్లమీద యెక్కడచూసినాజనం. అందరికీ పాపం కళ్యాణంవేడుకచూదామన్న కుతూహలమే—ఎవరికీ యేమీ కనపడదు! యాత్రకోసమనివచ్చేజనుల ఉత్సాహభంగం, వాళ్ళుపడే శ్రమదమాలుఅన్నీ చూస్తే జాలివేస్తుంది. మిట్టమధ్యాహ్నం పన్నెండుగంటలకిజరుగుతుంది కళ్యాణం—సాధారణంగా. ఎండ మండిపోతూఉంటుంది. జనులు ఒకరినొకరు తోసుకుంటూ, కుమ్ముకుంటూ, తిట్టుకుంటూ, సకలబాధలూపడతారు తలంబ్రాలుపడడం చూదామనేముచ్చటచాత. చప్పట్లు, కేకలు, పూజార్లమంత్రాలు, బాజాలు, పోలీసుబెత్తందెబ్బలు, తోపులాటలు—ఇదీ కళ్యాణమహోత్సవం!

"ఎన్నికష్టాలుపెట్టక, దేవుడు సులువుగా దర్శనమిస్తాడా మరి? భక్తుల్నిపరీక్షచెయ్యడం భగవంతుడికి విలాసం. పాపవిముక్తిఅయి, ఎప్పుడారాముడిదయవస్తుందో అప్పుడేకాని, యీలోపునమనం వెయ్యివిధాల తలక్రిందైతపస్సుచేసినాకాని, దర్శనంలభిస్తుందా?" అని తడిలేనిగొంతుకలతో ఒకరినొకరోదార్చుకుంటూ, వేదాంతాలు మాట్లాడుతూ, ఉత్సవంలో వొళ్లంతా పచ్చడయేటట్లు పోట్లుతిని, సగంచచ్చి, ఉపవాసంబడలికతో కాళ్లీడుచుకుంటూ, యిళ్లకుమరలుతూవున్న వృద్ధవిధవల్ని—పాలకోసం దెయ్యంపట్టినట్లు యేడుస్తూవున్న చంటిపిల్లల్ని రెండేసిచరిచి విధిలేక భుజాల్నివేసుకొని, దేవుడిదర్శనమైనా తిన్నగాచేయించలేకపోయిన మొగుళ్ల అప్రయోజకత్వానికి చిన్నబుచ్చుకుంటూ, ఉత్సవంలోనిలుచున్న ఆనాలుగునిముషాలలోనే ముచ్చెమటలుపోసుకొని, ముసిలిరూపుమొహాలతో నడుములువంచినడిచే ముత్తైదువుల్ని,—ప్రొద్దున్న పొందికగా గంటసేపు దిద్దిపెట్టుకున్న పంగనామాలు యెండలో చెమటకుకరిగిపోయి, ఏనుగుకరిరాలవంటి మొయ్యలేనికళేబరాల్ని ఆయాసంతో ఈడ్చుకుంటూ, యెవరినో యెందుకో బొంగురుగొంతుకలతో బండబూతులుతిడుతూ, నడవలేక నడవలేకనడుస్తూవున్న వైశ్యకుబేరుల్ని—చూస్తూ రోడ్డుమీద నిల్చుంటే, ఉత్సవవిశేషాలు తెలియరావడమేకాక, మనసులో యెందుకో జాలి, నవ్వు, కోపంఅంకురిస్తాయి.

కళ్యాణోత్సవంముగిసిన ఉత్తరక్షణమే తిరుగుప్రయాణానికి మూటలు సర్దుకుంటారు చాలామంది—యాత్రలుపుతీరి. మొహం మొత్తుతుందికాబోలు! ఇంతా రానేవచ్చి, నాలుగూ చూడకుండా తొందరపడి వెళ్లిపోవడమెందుకని, కొందరుమాత్రం రథోత్సవంజరిగేదాకా ఆగుతారు; లేదా బస్సుమీదో, బండిమీదో పర్ణశాలదాకావెళ్లి శోకరాముణ్ణిదర్శించివస్తారు: లేదా దగ్గరలోఉన్న ఉష్ణగుండాలకుపోయి, అక్కడవేడినీళ్ళ చిత్రంచూసి, వస్తారు. ఎక్కడికివెళ్ళినా, యేదిచూసినా, మొదట బయలుదేరేటప్పుడుఉండేభక్తి, ఉత్సాహం కొంతవరకు క్షీణిస్తాయి. ఎందుకోఆసంతృప్తికలుగుతుంది. ఏవోసందేహాలుపుడతాయి. ఈ యాత్రికులమొహాలు చూస్తే యేదో పరాభవంపొందిన వాళ్ళవాళ్ళ మొహాలవలె కనిపిస్తాయి. ఆముదంతాగడానికి అసహ్యించుకుంటూ, తాగేముందే డోకుకుంటూ, గ్లాసుచేత్తోపట్టుకొని సాహసించడానికి సిద్ధపడేధీరుల మొహాలుంటాయే—ఆమోస్తరుగా!

భద్రాచలయాత్రంటే, మొదట వెర్రివెర్రిఅభిప్రాయాలుంటాయి, చాలామందికి. మహావిపరీతమైన కథలు, కబుర్లు, వింటూఉంటారు—ఊహించుకుంటూఉంటారు. తీరాఅనుభవంచాత పరీక్షిస్తే, ఒకటీరుజువుకిరాదు. వినికిడికబుర్లకీ, నిజానికీ యెంతోతేడాకనిపిస్తుంది. పడవప్రయాణం బహుచవకనీ, "పాపికొండలమధ్య చైత్రమాసంలోకూడా నడిగుండాలుంటాయనీ, భద్రాదిరామాలయం తిరుపతిలోవలె యేదో కొండమీద యెత్తుగా ఉంటుందనీ, శ్రీరామకళ్యాణానికి యేటా హైదరాబాదునవాబువారు యేనుగుల

మీదనో, ఒంటెలమీదనో దోసెడు మంచిముత్యాలు పంపిస్తారనీ, జగన్నాథంలోవలె పూజార్లిక్కడ దేవుడి ప్రసాదాలు విక్రయిస్తారనీ, ఇక్కడివాళ్లందరూ రామభక్తులేకాబట్టి చాలాయోగ్యవర్తనులనీ, ఊరునిండా కోతులున్నాయనీ—ఇలాటి పిచ్చిపిచ్చిఊహలు చాలా ఉంటాయి అనేకమందికి.

ఉన్నతపదవులమీద యిక్కడికివచ్చే ఉద్యోగస్థులకీ, దొర్లకీ, యీఊరునుగూర్చి యింకావిచిత్రమైన అభిప్రాయాలుంటాయి, ప్రథమంలో. మంచిషికారీస్థలమనీ; ఉదయమే తుపాకిచేతపట్టుకొని బయల్దేరితే, ప్రొద్దెక్కేలోపున పెద్దపులినికొట్టవచ్చుననీ; అడవినిండా వెలగ, ములగ, నేరడి, మామిడి, నిమ్మ, దానిమ్మ, మొదలైన ఫలవృక్షాలుంటాయనీ; మలేరియాప్రదేశంగనక ఆపళ్లు, కాయలు ఎవరూముట్టుకోరనీ; ఈ ఊళ్లో అడుగుపెడితేచాలు కొత్తవాళ్ళకు కుదుపుతో చలిజ్వరం వస్తుందనీ; ఇక్కడిదోమలు ఈగలకంటె పెద్దగాఉంటాయనీ; ఊరునిండా మురికినీళ్ళచెరువులే అనీ; గోదావరీతీరంగనక కూరగాయలపాదులు, అరటితోటలు, కొబ్బరిచెట్లు, చెఱుకుగడ్డలు, అనేకంఉంటాయనీ; అనాగరికప్రదేశం కాబట్టి అన్నిదినుసులూ కారుచవకనీ, అనుకుంటారు.

న్యాయంఆలోచిస్తే, మొత్తంమ్మీద యీఊరు వాసయోగ్యమైనదికాదని చెప్పవలసివస్తుంది. ఏకాన్నీ స్థలం! ఆరోగ్యంచెడుతుంది. బద్ధకంపెరుగుతుంది. పనిచేసేవాడుకూడాచెయ్యడు, చెయ్యలేడు, చేసినా ప్రయోజనంఉండదు. ద్వీపాంతరవాసంవలె ఉంటుందిక్కడ. టపాసౌకర్యం, ప్రయాణసౌకర్యం, తక్కువ. ఇప్పసారా, వంటచెరుకు, గొఱ్ఱెపాలుతప్ప, మిగతా అన్నిదినుసులుప్రియమే. ప్రతివస్తువు రాజమండ్రినుండి వస్తేనేకాని, దిక్కులేదుమరి. దినదినగండంబ్రతుకు. తిండికియిబ్బంది. ఇళ్ళకుయిబ్బంది. తేళ్ళభయం, పాములభయం వేరే చెప్పనక్కరలేదు. గోదావరి వరదరోజులలోను, కళ్యాణోత్సవంరోజులలోను, ఊరుకు ఎప్పుడైనాముప్పే! అప్పుడప్పుడు పెద్దపులులు ఊళ్లోకే వస్తూఉంటాయి, పశువులనుయెత్తుకొనిపోవడానికి. ఈఊరి పశువులనుచూస్తే, యేడుపొస్తుంది. బక్కపేగులు, యీడుపుకాళ్ళు, యెండిపోయినపొదుగులు! పదిగొడ్లనుపిండితేగాని శేరుపాలురావు. ఆవొచ్చినపాలలోనైనా విటమిన్సుఉండవు. ఊరల్లాతిరిగి, కాగితాలు, ఎంగిలాకులు, వావిలాకులు, అడ్డమైనాగడ్డితిని, గోదావరిలోనీళ్ళుదాగి, యీదురోమనియిళ్ళకొస్తాయి, అవి. కుడితి, తవుడు, పొట్టు, తెలకపిండి, పరిగడ్డి, పచ్చగడ్డి, మొదలైనవి రుచికైనా యెన్నడూయెరగవు. యజమాని జొన్నకర్రలురెండువేస్తే, వాటికిపండుగ! ఎండకాలంలో మేతకు అసలుయేమీదొరకదు కాబట్టి, పశువులను అడవికితోలేస్తారు గొల్లలు. వర్షాలుపడి, మళ్ళీగరికఆకు మొలిచినపిమ్మట తోలుకొస్తారు—తిండికోసం తిరగడానికిశక్తిలేక చచ్చినవిచావగా, పెద్దపులులుయెత్తుకొనిపోయినవిపోగా మిగిలినవాటిని!

గోదావరీతీరాన్ని ఉన్నదన్నమాటేగాని, యీఊరుకు నీటివసతియేమీలేదు. చెరువులేనేలేవు. కొండప్రదేశంగనుక నూతులు సులువుగాపడవు. తుపాకిమందువేసి రాళ్ళుబ్రద్దలుకొడితేగాని, నుయ్యితవ్వడానికే సాధ్యంకాదు. ప్రతీయింటికీ యీఊళ్ళో బావిఉంటుందని అనుకోకూడదు. ఎప్పటికైనా కొళాయిలు ఏర్పాటైతేతప్ప యీఊరుకు నీటిసౌఖ్యంఉండదు.

ఏపరిస్థితులెట్లాఉన్నాకాని, మంచి అందమైనఊరు, ప్రకృతిశోభ తిలకించగలవాళ్ళకు! వావిలిడొంకలు, జిన్నిమొక్కలు, యేనుగురంగురాళ్ళు, యెత్తైయినగుట్టలు, పాములపుట్టలు, పవిత్రమైన గౌతమీనది, తెల్లని సన్నసైనయిసుకతిన్నెలు, పేరుపొందినకోవెల, నాగరికతావాసంలేని అమాయకులగు కోయలు, మ్యునిసిపల్ కంపులేని స్వచ్ఛమైనగాలి, విశాలమైనసాగులేనిపొలాలు; దొంగలభయంలేని నిశ్శబ్దమైనరాత్రులు, రెయిలుపొగ రోడ్డుధూళిలేని నిర్మలమైన నీలిమాకాశం, ప్రేమసూత్రాలు, దైవభక్తిబోధించే తళతళలాడు నక్షత్రాలు—బలేరమ్యమైనప్రదేశం! సీతారామవనవిహారస్థలమిది!—మహాఋషుల తపోవాటిక!—పుణ్యభూమి!

# పుష్పాడికణము

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

అరుణకిరణము లస్తాద్రిపై కొరుగుచున్నాయి; ప్రకృతికాంత చీకటిచీరె చెరగులను సరిజేసుకొనుచున్నది. మెల్లగా మల్లె నవ్వినది.

మహారాజింకను సభను ముగింపలేదు; అమాత్యు లేదియో వ్రాయుచున్నారు. ఎల్లెడ నిశ్శబ్దము.

ఇంతలో సభయం దొకమూలనుండి "మహారాజా! నేడే బందీగా తేబడిన యువతి, మాకు మహారాణిగానుండదగిన సౌందర్యవతి,...నేను సుదినము" అని సర్దారు సంతసమున బల్కెను. రాజావైపునకు తలత్రిప్పెను—పలుచని జలదము లోపలి నెలవలె మేలిముసుగుమాటున మెరసిపోవుచున్న దామెల్లతుకమైచాయ. సభయందలజడి.

వేలకొలది కనులు రాజువైపునకే చూచుచున్నవి.—"ఆమెయే నాకు తల్లియైనచో నేనెంతఅందగాడనై యుందునో" అని మహారాజు పల్కెను.

* * * *

తెరచాటున నిలచియున్న సుదతులయం దొకరిజడనుండి జారిపడినది జాజిపువ్వు,—అది వినవచ్చెను.

* * * *

"ఆమెను ఆమె గృహముకడ జాగ్రత్తగావిడచి రండు, మాఱుమాటలేక ఇట్లుపట్టి తెచ్చినందులకు క్షమాపణకోరుడు." అని మహారాజాజ్ఞాపించెను. సర్దారు తిలవంచెను.

* * * *

కుసుమమున కెన్ని యాకులు క్రమ్ముకొనియున్నను కమ్మవాసనలు నల్గడల ప్రసరించుచునే యుండును: పాశ్చాత్యచరిత్రకారు లేరీతి వ్రాసినను శివాజీమహారాజున కగౌరవము చేకూరదు. ఆమహామహుని జీవితకుసుమమునకు శాశ్వత సౌరభమును గూర్చు పుష్పాడికణములలో నిదియొకటి.

## స్త్రీప్రతాపము

వెలువోలు సీతారామయ్య చౌదరిగారు

౧

"ప్రేయసీ! ఇదంతయు అదృష్టదేవతయొక్క ఆట. లక్ష్మీ అతిచపలురాలు, ఆమె యెప్పుడూ ఒకేపద్ధతిగా ఉండదు. నిన్న మహారాజు — నేడుబిచ్చగాడు."

"నాథా! నేను క్షత్రియపుత్రికను, అదృష్టమును లెక్కించేదానను కాను. వీరపురుషుడు తనపౌరుషము చేతనే అదృష్టమును సృష్టించుతాడు."

"విశ్వేశ్వరునికి వ్యతిరేకంగానా! మనుష్యబలం ఎంత?

"కర్మక్షేత్రంలో ధైర్యంగానిల్వబడడమే వాని కర్తవ్యం."

"రణరంగంలో పరాజయం కలిగితే"

"అక్కడే ప్రాణంవదలుతాడు. ప్రవాహములో పడి అలలు ఎక్కడకుతీసుకొనివెళ్లి వదలితే అక్కడ బయలుపడేత్రృణంవంటివాడా వీరపురుషుడు?"

"రాజ్యాన్ని పోగొట్టుకొని చివరకు నీచమైన నౌకరీచేయవలసివచ్చింది. ఇదంతా విధాతృలీల."

"ఇది అల్పబుద్ధిలో ఆడిన జూదపుఆట"

"ప్రేయసీ! ఈరీతిగా మాట్లాడుతావేల! నీకేమి కష్టంఇక్కడ! ఎటువంటి సుందరమైనవనప్రదేశం, తియ్యటి సెలయేటినీళ్లు, మంచిపళ్లు, పచ్చికబయళ్లు!"

"పరాధీనతలో ఒకక్షణంఉండటంకూడా అసహ్యమే. పిరికివాడు ఇటువంటియుక్తులతో సంతోషపెట్టాలనిచూస్తాడు."

"ప్రేయసీ! పతితో ఈవిధంగా కఠోరవాక్యాలు పలుకడం ఉచితంకాదు."

"నిజమే, క్షత్రియునకు యుద్ధంలో వెన్నుచూపడంఉచితమైనపనేనా! పురుషుడు స్త్రీకిధర్తఅయినప్పటినుంచీ ఎప్పుడూ స్త్రీయొక్క కర్తవ్యాన్ని ఉపదేశించుతూవుంటాడేగాని ఆయనకర్తవ్యాన్ని ఆలోచించడంమాత్రం శూన్యం. నీవు పిరికిపందవై రణరంగంనుండిపారిపోయి నా యెదుటకు రాకుంటా, యుద్ధంలో ప్రాణాలేఅర్పించియుంటే నీధర్మపత్ని ఎంతఆనందంలో చితిని అధిరోహించేదో చూచేవాడవు."

"ప్రేయసీ!సమయానికి వేచియుండటమేయుక్తి."

"పిరికివాడే అట్టియుక్తులుబోధిస్తాడు. నిజమైనశూరుడు జయమో, మృత్యువో, రెంటిలో దేన్నో ఒకదాన్నిమాత్రమే స్వీకరిస్తాడు. కాని నాకుపుత్రిక జన్మించింది. భగవానుడు పుత్రున్నిప్రసాదించలేదే అని చింతవేస్తుంది."

"ఆపుత్రుడుకూడా యుద్ధంలోపారిపోతే"

"సింహం ఎప్పుడూ వక్కనుకనదు"

* * * *

"అబ్బా, నేనుస్త్రీనైపుట్టితినని ధిక్కారము. నేను పుత్రుడనై యేలజన్మించలేదు? కాని స్త్రీ అబలయగుటకు కారణమేమిటి? ఆమెకుకాళ్లుచేతులు లేవా, తలలేదా, హృదయంలేదా? శక్తి, తేజస్సు, బలము—ఇవన్నీ శిక్షణవలనా, అభ్యాసంవలనా సిద్ధించుతయి. చూస్తా! కోమలములైన బాహువులను కఠినమైన భుజదండములుగాచేస్తా, ఈముంజేతులలో అప్రతిహతమైన ఖడ్గాన్నిధరిస్తా, తల్లీ! నీవుచింత పొందబోకు; నేను తండ్రిగారిరాజ్యాన్ని శత్రువుల నుండి లాగుకొనినప్పుడే నాపేరు తార, నేను రాజపుత్రిబాలికను; పుత్రునిపనినే చేస్తానేను".

౨

"ప్రేయసీ! తారాకుమారి ఎక్కడకువెళ్లింది?"

"వేటకువెళ్లింది."

"మంచిపనిచేశావు. బాలుడాయేమిటి? అడ్డగించలాదాన్ని"

"నీవేఅడ్డగించి చూడపోయావు"

"ఆమె వివాహయోగ్యురాలుకూడాఅయిందే"

"అవిచారంకూడా తమరేచేయండి"

(తారాప్రవేశము)

"తండ్రిగారూ! మీరీపులిపిల్లలనుచూచారా!"

"అరే, అరే, దీన్ని ఇక్కడకు ఎవరుతెచ్చారు?"

"పొదలో దూరి నేనే తెచ్చా, పాపం దీనితల్లి నాబల్లెపుపోటు చేత చచ్చిపోయింది."

"బలే, నీవుపులినిచంపి పిల్లను తెచ్చా?"

"తండ్రిగారూ, ఎంతఅందమైనపిల్లో చూడండి!"

"తారాకుమారీ! నీయీపని ప్రశంసాపాత్ర అయిందికాదు. నీవురాజపుత్రకన్యకవు. ఈవిధంగా పురుషవేషంవేసుకొని వేటాడటం నీకు ఉచితంకాదు. పెళ్లి లోపలకూర్చో"

"తండ్రిగారూ! పురుషులు పౌరుషవిహీనులై, విధ్యుక్తధర్మాన్ని వదలిపెట్టి, అబలులై, స్త్రీలకు ప్రధానగుణమైన లజ్జనువిడనాడి, శత్రువులపాదతాడనలు సహించుతూ కూర్చొనివప్పుడు నాబోటిస్త్రీలు తప్పకుండా వివశులై యీవేషంధరించవలసివస్తుంది."

"తారా! యీ తర్కం, యీ ప్రగల్భాలూ ఎక్కడనేర్చా!"

"తండ్రిగారూ! పులిపిల్లను చూడగా మీరు! అమ్మగారూ మీరువచ్చిచూడండి."

"కుమారీ! పద, నీపులిని చూద్దాము."

## ౩

(జయమల్లును)

"తారా! నిన్ను నేను ప్రేమించుతున్నా"

"ఇటువంటి కఠినవాక్యాలు నేనువినలేను, వాటిని నేను తిరస్కరించుతా"

"కాదు, తప్పకవినాలి"

"రాజకుమారా! నీవేమైనాఅనుకో, ఇందువిషయమైనన్ను బలవంతపెట్టబోకు"

"అబ్బా! ఎంతటి పాషాణహృదయం నీది, ఎవడిచ్చాడు నీకీరూపం?"

"నిన్ను పురుషునిగా, నన్ను స్త్రీగాను నిర్మించిన మూర్ఖుడగు విధాత"

"తారా! నీవుసరిగా ప్రేమతత్వం గ్రహించలేదు"

"నిజమే, ఆతత్వం నేర్పనేలేదు, అది ధార్మికుల భోగవిద్య. ఇల్లు, వాకిళ్లు, సమస్తరాజ్యమును పోగొట్టుకొనిన దరిద్రునికన్యకకు అది ఉచితంకాదు"

"అయితే నీకోరికయేమిటి?"

"తండ్రిరాజ్యాన్ని తిరిగి సంపాదించేవరకు ఏవిషయానికీ నాహృదయంలో స్థానంఇవ్వను"

"ఎట్లా నెరవేరుతుందిఇది?"

"నేనుఎరుగను. నేనాలోచించేవిషయం ఇదే. ఏకాకినగు స్త్రీని. శస్త్రవిద్య నేర్చాను. కాని పురుషులంతా నిశ్చింతగాకూర్చుంటే నేను ఒంటరిగా చేసేదేమిటి?"

"ఇదేనా వివాహానికి ఆటంకం?"

"ఇదే; ప్రేమ విలాసప్రియులస్వప్నం, సాధకులకు అట్లాకాదు."

"నేను నీమాతృభూమిని ఉద్ధరించితే"

"అప్పుడు నిన్ను పెండ్లాడుతా—నీవు కోరినా సరే కోరకపోయినాసరే"

"నిజమేనా?"

"నిజం. ఈరూపం, యౌవనం, శరీరం, సమస్తం నీచరణాలకు అర్పించుతా"

"వివాహానంతరం ప్రేమిస్తావా!"

"అదినేను చెప్పజాలను, కాని నారూపం, శరీరం సమస్తమూ నిశ్శంకగా అమ్మివేస్తా! అది నీసంపత్తి అవుతుంది."

"అయితే సరే"

"రాజకుమారా! ప్రతిజ్ఞ నెరవేరనంతవరకు నాయెదుటకు రావద్దు."

## ౪

"అర్ధరాత్రి, దొంగమాదిరిగావచ్చాను. నిజంగా ప్రేమగ్రుడ్డిదే, ఆహా! ఏమి ఆయౌవనం, చిందులాడుతున్నదే మలయమారుతంలో; ఆమెసౌందర్యంచూడు. ఆకాశంలో నక్షత్రాలెన్నో వున్నయి, కాని పృథ్విలో ఈమెఒక్కతెమాత్రమే. ఎటువంటిఅందము! అబ్బా, ఏమిలావణ్యము! నిద్రించుతూవుంది. ఎంత విశాలమైన నేత్రాలు. ఆకనుబొమలతీరు, తుమ్మెద

రెక్కలబోలు కెంట్రుకలు, స్వచ్ఛమైనవర్ణమూ, బలిష్టమైన కోమలమైనశరీరం; అదురుచున్న పెదవులు. ఏమిది! కాళ్లు అడ్డగింపబడ్డవి"

"ఎవరు?"

"ప్రేయసీ! చరణదాసుడు"

"రాజకుమారా! ఎక్కడికిప్పుడు?"

"ప్రేయసీ! క్షమించు"

"ఒకక్షణంకూడా నిల్వకుండా వెళ్లిపో"

"తారా! కాదు, నేనుకోరిక నెరవేర్చుకోకుండా వెళ్లను."

"ఛీ, నీచుడా! కుమార్గీ! మేవాడకులకళంకీ! దొంగమాదిరిగా నీవుదాగిదాగి నాశయనగృహములోపలికివచ్చావు. ధిక్కారం, ధిక్కారం."

"తారా! ప్రేమగ్రుడ్డిది"

"తిరిగిచెప్పుతున్నా, వెళ్లిపో"

"లేచిపో"

"ప్రాణంపోతుంది"

"నేను ద్వారంబంధించివుంచా, నిన్నెవరు రక్షిస్తారు?"

"ఓరీ, మూర్ఖుడా! క్షత్రియబాలిక తనమానాన్నే రక్షించుకొంటుంది, ఏమి! వెళ్లుతావా, లేదా?"

"ప్రేయసీ! ఒక్కసారి నాకోరిక నెరవేరనీయి"

"అయితే ఇదిగో" (కత్తితో పొడుచును)

"తారా! ఆగు, మరలకొట్టబోకు, వెళ్లుతున్నా.

"ఓరీ, పాపీ! ఇంకాలేదే" (రెండవదెబ్బ)

"క్షమించు, రిక్తహస్తున్ని, కొట్టబోకు"

"ఓరీ దొంగా! నిలువు అక్కడ—ఇదిగో"

(శిరస్సునరుకును)

౫

"నాదే యీవేటమృగం"

"ఏమిటీ, ఇంతసాహసమానీకు!"

"మహాగర్వించివున్నావే, ఎవరువునీవు!"

"నిర్భయంగా, కోమలంగా, సుందరంగా, ఉన్నావు నీవెవరవు?"

"మొదటిప్రశ్న నాది"

"అయితేవిను, నేను పృథ్వీరాజును"

"మేవాడ రాజపుత్రుడవా!"

"అవును, నీవెవరవు?"

"ఆవిషయందేనికిలే; వేటకువెళ్లుదాంపద"

"అట్లాకాదు, చెప్పాలి"

"నన్నుక్షమించు, రాజపుత్రా!"

"అదేమిమాట, నన్నేక్షమించు, బాలికా"

"ఆపనినీదే"

"మనస్సులో అనుమానంగావుంది, నీవెవరవో ఎరుకపరచాలి."

"సరే, నేనుతారను."

"ఓహో, రాజకుమారీ! మంచికలయికే, యీవేట నాదే, నేనేస్వయంగానిన్ను వేటాడుతున్నా."

"రాజకుమారా! నాప్రతిజ్ఞ రాజపుటానాయందు అంతటా ప్రఖ్యాతమైవుంది. తమరు ఇటువంటి సంభాషణచేయవద్దు"

"కుమారీ! నేడేఆప్రతిజ్ఞ నెరవేరుతుంది"

"నిజమేనా!"

"నేడు మొహరం, ఇంకాపగలు రెండుఝాములు కూడా గడవలేదు, ముసల్మానులందరూ పండుగలో పాల్గొనివుంటారు. నాసైన్యం అయిదువేలమంది రహస్యంగా దాగొనివున్నారు. కేవలం ఒక్కగంట ప్రయాణం, తమాషాచూస్తావాయేమి?"

"పరమానందంతో"

"తండ్రిగారిఆజ్ఞతీసుకోవాలా!"

"అవసరంలేదు"

"అయితే పద"

౬

"రాకుమారీ! సమస్తసైన్యం కోట వెలుపల పల్లంలో దాగొనియుండనియ్యి, మనందుర్గంలోకి వెళ్లుదాము".

"ఒంటరిగానా!"

"భయంవేస్తుందాయేమి?"

"మీరుండగా భయమా!"

"రాజపుత్రీ! నీఅసలివేటజంతు విక్కడేవుంది."

"అయితేపద"

"విజయసింహా!"

"ఏమి, మహారాజా!"

"సంకేతశబ్దం వినగానే దుర్గంలోకి బలాత్కారంగా జొరబడాలి."

"చిత్తం ప్రభూ!"

"రాకుమారి ద్వారందగ్గరవుంటుంది, ఆమెఆజ్ఞను పాలించుతూవుండు"

"చిత్తము"

"రాజపుత్రీ! పద"

౨

"తారాకుమారీ! నీఅశ్వం పొగరుపోతు, దాన్ని కొంచెం జాగ్రత్తగాపట్టుకో, లేకపోతే పురజనులు ఇటేచూడడం మొదలుపెడుతారు, ఇదిశత్రుపురం"

"రాకుమారా! నేడుదీన్ని స్వేచ్ఛగా నడవనీయండి"

"(క్షణకాలమాగి) చూడు ఎంతగుంపో, నేడు అందరూ మత్తెక్కివున్నారు"

"ఆగు, ఆయిద్దరు రౌతులు మననుదూరంనుండి చూస్తూన్నారు, సందేహించకుండావుండేటట్టు వారి దగ్గరిగాపద."

"సోదరా! నేడేమిపండుగ!"

"మీరు పరదేశీయులులాగా కనబడుతున్నారే, నేడు మొహరం."

"ఓహో, అట్లాగా, మేమిప్పుడేవస్తున్నాము, ఇదంతా మేముచూడవచ్చునా!"

"ఇప్పుడే సుల్తానువస్తున్నాడు, అడ్డగించేదెవరు? సంతోషంగాచూడండి."

"నిజమే, సుల్తానుదర్శనం మాకు అనాయాసంగానే లభిస్తుంది, అదుగో సుల్తానువస్తున్నాడు."

"(చెవిలో) రాజపుత్రా! ఇదేయదను."

"తారా, క్షణకాలంఆగు, దగ్గరిగా ఆయింటి మరుగుననుంచో."

"(ఒకబాణంతీసి) ఇదేయిష్టవచ్చినట్లు చేస్తుంది, రాకుమారా! నావేటజంతువును నేనేసంహరిస్తా."

"నీకంటే సాహసించేదెవరు! ముందుగా సుల్తానును బాగుగాగుర్తించాలి."

"వాడేగా, ఆతెల్లగుఱ్ఱంమీద."

"వాడే, పచ్చతలగుడ్డలో వజ్రం మెరుస్తుంటే!"

"(బాణమెక్కుపెట్టి) రాజపుత్రా! వేటమృగం వస్తుందోలేదోచూడు."

"నిర్భయంగా నీవుబాణంవదులు."

(తార బాణంవదులును)

"వాడుచచ్చిపోయాడు, సుల్తాను వక్షస్థలంలో గుండాబాణం చీల్చుకుపోయింది, గుర్రమునుండి క్రిందపడ్డాడు, కోలాహలం జరుగుతూవుంది, చూడు! వారు ఈవైపువస్తున్నారు, రాజపుత్రీ! నీబల్లెము సరిగాపట్టుకో, నాకుదూరంగావుండబోకు, సరిగా ముందుకేనడువు, ద్వారం ఇప్పుడే తెరుచుకొంటుంది"

"రాకుమారా! జాగ్రత్త" (ఒకమ్లేచ్ఛునిబల్లెముతో పొడుచును)

"రాజపుత్రీ! జాగ్రత్త" (ఒకసిపాయినినరుకును)

"రాజపుత్రా! ముందుకుసాగు"

"ఓహో, ద్వారంలోమదించిన యేనుగొకటి నిల్వబడివుంది, సేనఅంతా పరుగెత్తుకొనివస్తూంది"

"మరేమీచింతలేదు" (ముందుకుసాగి ఖడ్గముతో ఏనుగు తొండమునునరుకగా ఘీంకారముసల్పుచు ఏనుగుపరుగెత్తెను. వెంటనే ద్వారంతెరచి—)

"విజయసింహా!"

"రాజకుమారికి జయ్"

(సేన దుర్గంలోప్రవేశించుట, భయంకరమైనయుద్ధం, దుర్గవిజయం.)

౮

"తారాకుమారీ! వీరు మేవాడ రాజపుత్రులగు పృథ్వీరాజు. వీరికి నమస్కరించు, నీతండ్రి రాజ్యాన్ని పునరుద్ధరించారు."

"తండ్రిగారూ! వీరియశస్సు నాకు వినిపించ నక్కరలేదు."

"రాజపుత్రా! ఈమెయే నాపుత్రిక. ఈదరిద్రుని మస్తకమునకు కిరీటము, నాజీవనధార, తార"

"తండ్రిగారూ!"

"పుత్రీ! నీప్రతిజ్ఞ జ్ఞాపకమున్నదా!"

"ఆఁ"

"రాజపుత్రా! నిన్ను నాఅల్లునిగా చేసుకొన్నాను, ఈదరిద్రునిదానం స్వీకరించండి, నేనుకాదు తారనీకు యోగ్యురాలు"

"మహారాజా! నీపుత్రిక స్వీకరించిందా!"

"ఆ, ఆమెఅంగీకరించింది, పుత్రీ! చెయ్యి ముందునకుసాచు, మీరుకూడా ముందుకురండి, పృథ్వీ! మేవాడకూరా! నేను నాపుత్రికను నీకు సమర్పించుకొన్నాను"

"తండ్రీ! మేము తమకు నమస్కరిస్తున్నాము"

"ఇరువురు చిరంజీవులుకండు, సుసంతానముతోను, సుయశస్సుతోను విరాజిల్లండి."

* * * *

"ప్రేయసీ! నీవు నన్నుకొన్నావు, నేను వేరుచోట ఉండజాలను."

"నాథా! పుట్టుకతో నేను ప్రేమపాశంవేర్చుకో లేదు, తమరే నాకీకఠినపాశం వేర్చారు."

"ప్రేయసీ! నేను నీకుగురువును, శిష్యున్ని కూడాను."

"స్వామీ! నేనీవిధంగా నిన్ను ప్రేమింపగలనని ఎన్నడూ భావించలేదు. నీవీరగాథలువిన్నప్పుడు నాకు నీచరణదాసినికావలెనని కోరికఉండేది. అది సంభవిస్తుందని యెప్పుడూ అనుకోలేదు. తమప్రథమ సందర్శనంచేత హృదయం కొట్టుకులాడింది. కఠోర భావాలతో నిండినముఖం, ఎఱ్ఱని నేత్రాలూ, చూచి భయపడిపోయాను. "నేను ప్రతిజ్ఞచే బద్ధురాలనైన స్త్రీని, నాయీశరీరం ప్రతిజ్ఞపైనే విక్రయించాలి" అని నేను భావించాను. ముగ్ధురాలనై నేడు నీచరణములకు మనోవాక్కర్మల దాసినైనాను."

"ప్రాణేశ్వరీ! ఈపృథ్వియొక్క కఠిన మైన ఒడిలో ఈసూత్న మైన, స్థిర మైన మెరుపు, ఈప్రియ మైనవెన్నెల, ఈసజీవసౌరభము, ఈసదేహసంగీతము నాకుప్రాప్తించునని ఎప్పుడూ ఆలోచించనేలేదు."

"ప్రాణేశ్వరా! మీరు పంచప్రాణాలతో నన్ను ప్రేమించుతున్నారు. ఆమాధ్యముచేతనే నేను మెరుపును, సౌరభమును, సంగీతమును అని ఏమేమో అంటున్నారు. నేను కేవలం నీదాసీని, తారను. నాయందు గుణమున్నది, దోషమున్నది, నేను అధమస్త్రీని. స్వామీ! నన్నెల్లప్పుడూ క్షమించండి"

"ప్రేయసీ, నాకుదోషమేమీ కనిపించడంలేదే"

"నాథా! ప్రియుడు దోషాన్ని చూడజాలడు."

"ప్రేయసీ, వెళ్లుదాముపద, మనం పరస్పరం విలీనులమై ప్రపంచాన్ని మరచిపోదాము."

—హిందీనుండి.

## బాలకృష్ణుఁడు

మానేపల్లి లక్ష్మయ్య గారు

సతతము భక్తయోగిమునిసంఘము లైహికముల్ త్యజించి ని
శ్చితమతితో మదంఘ్రులను జింతనచేయుచునుందు; రిందునే
యతిమధువుల్ చెలంగునొ యటంచు ముఖమ్మునఁగాలివ్రేలు గ్రీ
లితమొనరించు బాలుని యలేఖ్యవిలాసుని యాశ్రయించెదన్.

# సౌశీల్యము

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

అలఁడు శివాజిభూపతి మహానియమస్థుఁడు ముఖ్యరాజ్యకా
ర్యతతినిమగ్నుఁడై "తురకరాజకుమారుఁడ"టంచు నందలం
బు తనరహస్యమందిరముపొంతకుఁ దెచ్చెను దారిఁబోవఁగా
అతనివధింపఁగా మనసునం దిసుమంతయు లేదువానికిన్.

దేనికదేవచింపవల దే, అటవ్యక్తి "యెవండొ" "యెవ్వతో"
తానెఱుఁగంగఁజాలఁడుగదా అయినన్ యువరాజభ్రాంతిచే
మానసమందుసంశయము మాని భటాళికినానతిచ్చె—"ఎ
ద్దీనెను దూడఁగట్టుఁడను" నీదృశబుద్ధులు రాజసేవకుల్.

"మీరుమదీయశత్రులగు మ్లేచ్ఛనృపాలకపుత్రులౌదు, రెం
దారయఁబోవుచుండిరొ? రహస్యముగానిటరాజకీయముల్
మీరినమిత్రభావమున మేకొని చెప్పఁగఁబూనితిన్ మహో
దారత నన్యథాయనక దర్శనమిచ్చి యనుగ్రహింపుఁడీ."

ఆమనుఁ గావిలోలనయనాంచల మాతనుయష్టి రమ్యసౌ
దామినిధిక్కరించెడి తథావిధతత్తనుకాంతి యామహా
భూమిపుభ్రాంతిగొల్పినవి "పోలునె సత్ప్రభు లాసువారి నే
దోమిష నిట్లుతెచ్చుటలు దూష్యముసుండ" నె నానతాస్యయై.

పలికినదొక్కవాక్య మది పల్కినవ్యక్తియు నవ్యపుష్పకో
మలసదృశాంగి, అందున క్షమాపతి యంతటివానిచెల్లెలా
కలితవిశేషవిద్యలనుగల్గిన యామృదుభాషివాక్యమే
ములికయినాటిపోయినది భూపతిసద్హృదయాంతరమ్మునన్.

"అఖిలనరపాలమూర్ధవిన్యస్తపాద
పద్ముఁ డౌరంగజేబుకు భగినినేను
అతఁడుపంపఁగ రాజకార్యంబుమీఁద
నరుగుచుండఁగనిట్లాయె" నన్నదామె.

"ఎఱుఁగముతల్లి, తామిటులనేఁగుచు నుండిరటంచు, నిందులో
నరుగుట పాదుపాతనయుఁ డప్పుడునప్పుడు మేము చూచుటల్
జరుగుటచేత నిట్టియపచారముచేసినవారమైతి మో
తరుణి క్షమించిమమ్ము దయఁదార్చు మెఱుంగముదోషమింతయున్.

ఏనిముసమ్మునందయిన నెంతటికార్యము గల్గియున్న నా
యానతిలేక, యేయువిధనైనను బట్టఁగరాదటంచు ను
గ్రానతిగల్గు నిద్దియసుమా మహారాష్ట్రపుభూమి దీనికిన్
నేను శివాజిభూపతిని నిర్జితసర్వప్రతీపభూపుఁడన్.

మఱియుసంతోషమైనది మాకునిశిత
శాస్త్రవైదుష్యమునుగల్గి సరసభాగ్య
శీలవతులై నమిమ్ము దర్శించుకతన
పండినవి పూర్వసుకృతసంపదలునేఁడు.

ఏనుఫలానయంచువచియించినచో నొకమాటతాము, మా
సైనికులొక్కపాదమును సైతముముందుకువేయఁజూతురా?
అనిముసమ్మునందె తమయానతిమూర్ధమునందుఁ దాల్చి యిం
తేని ప్రమాదముంగలుగనీయక నమ్రతమేలుసేయరా?"

# పిల్లలన యేలనంత ప్రేమ?

శ్రీమతి ఎ. హేమలతగారు

౧
బిడ్డ

చెడ్డపనులనే యేవేళసేయునన్ను
చాలగానీవు ప్రేమింతువేలనమ్మ?
చిన్నబాబుగారింటిలో పిన్నిగూడ
పాపనేవేళయును సదిగోపపడదు.
అమ్మలకు పిల్లలన యేలనంతప్రేమ?

౨
తల్లి

సూర్యకిరణములునుగూడ చొరగరాని
విమరకాంతారసీమను వెలయుమేటి
కలువతీవెలనిలువెల్ల గప్పబడిన
చలనమునులేని యొండొక్క కొలనిలోన
యహరహమ్మునుదిరుగు రాయంచవోలె;
నాదుహృత్సీమమధ్యను నానుకొనిన
యంతరాత్మనుకొలనిలో ననవరతము,
నవ్యగుణరాశి! నాచిన్ననాటినుండి-
స్వేచ్ఛవిహరించుచుండె నీచిన్నయాత్మ:
నీదుజనకుని ప్రేమంపు నిండుచూడ్కు-
లనెడిచంద్రికల్ వేవేగ నస్మదీయ
మానససరోవరమునను మనుచునున్న
కుముదసంతతివికసింప గూర్మిజొచ్చె;
అందుచేనీదువిమలమా యాత్మకపుడు
సొబగువిహరింపకొలనిలో చోటులేమి
నంగములతోడపృథ్వి నీయాత్మయపుడు
బిడ్డరూపముధరియించి బుట్టెనాకు
బిడ్డలందరునిట్టులే బుట్టుచుంద్రు
అందుచేతనే, నాముద్దులయ్య పుడమి
నమ్మలకు పిల్లలన్నను అంతప్రేమ.

# చిన్న పాప

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గారు

తలంటిబొట్టుపెట్టి దొండకాయచేతికిచ్చి చావడిలో చదరమీదపక్క వేసి పడుకోపెట్టి పనులుచక్కబెట్టుకోడానికి తల్లి లోపలికివెళ్ళిపోయింది.

ఎనిమిదినెలలచిన్నబిడ్డ. బోర్లపడుకొని ఎఱ్ఱనిదొండకాయని కొరుకుతూ తనలో తను నవ్వుకుంటూ కేకలువేస్తూ కులాసాగా ఆడుకుంటోంది. గోధుం తాచు ఎక్కడనుంచోవచ్చి పాపముందరినుంచి వెళ్లిపోతోంది. పాపదాన్ని చూచి దొండకాయవదలి నడుముదగ్గిర చిన్నవేళ్లతో రెండుచేతులతోను పట్టుకుంది. మధ్యమధ్య బోసిపళ్లనోటితో నడుముమీద కొరుకుతూ ఆడుకుంటోంది. పాముకూడా పాపనిఏమీఅనకుండా పాపతోఆడుకుంది. వెళ్లిపోదామంటే పాప వదలకుండా గట్టిగా అలాగేపట్టుకునిఉంది.

తల్లి ఏదోపనిమీద చావడిలోకివచ్చింది. పాపని పాముతో ఆడు కుంటూంటే చూచింది. నీరైపోయింది. గబగబామాటాటకుండా భర్తను పిలుచుకువచ్చింది. శ్వాసవిడుస్తే పాపనిపాము ఏంచేస్తుందోఅని ఇద్దరూ శ్వాసవిడవకుండా పొంచిచూస్తూన్నారు. ఏమీచేయలేరు పాపం! అలికిడి అయితే ప్రమాదము. ఏమిచేయకుండా ఊరుకోటానికి ప్రాణంఒప్పదు. ఒప్పకఏమిచేదామన్నా వీలులేదు.

పాము పడగ బాగావిప్పి పాపముఖముదగ్గిరపెట్టింది. పాప ఆపడగతో ఆడుకుందామని నడుమువదలి పడగ పట్టుకోబోయింది. చిన్నచేతులు చాచేసరికి పాము తప్పించుకొని దొడ్లోకంచెల్లోకి పారిపోయింది. పాపగొల్లుమంది.

తల్లితండ్రులు గబగబావచ్చి పాపనుముద్దాడేరు సంతోషంతో. పాప మాత్రం ఒక్కపెట్టున ఏడుస్తూనేఉంది. భయపడ్డారు ఇద్దరూను. పాముకరచిందేమోఅనిచూచారు. కాటులేదు. భర్త లోనికిపోయి ఆడుకొనే చిన్నరబ్బరు పామునుతెచ్చి పాపను చదరుమీదపడుకోబెట్టి చేతిలోపెట్టేడు. పాప ఏడుపంతా మింగేసి నవ్వుతూ కేకలువేస్తూ మళ్లీఆడుకోటం ప్రారంభించింది. తల్లి పాపను అప్పుడుముద్దాడి ఎంతోఆనందించి తనపనిమీద వెళ్లిపోయింది. పాపదాంతో కేకలువేస్తూ ఆడుకుంటోంది పాపం!

# రాజహంస

నరహరిశెట్టి వేంకటరత్నముగారు

తళతళ మెరిసిపోవుచున్న ఎత్తయిన గంభీరమైనమంచుకొండలు వరుసలదీరియున్నవి. కొండలనడుమ నుండి సూర్యరశ్మివలెనే ప్రవహించుచున్న తేజోవంతమైన సుస్నిగ్ధజలవాహినివచ్చి సరోవరమున గలియుచున్నది. ఆవిశాలసరోవరమున వివిధవర్ణముల వికసితపద్మములు—నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు. తీరమున అనేకజాతులపూలచెట్లు, తీగలు. వానివెనుక దట్టమైనకారడవి. మంచుకొండలపై సూర్యప్రకాశము దేదీప్యమానమై వెలుగొందుచున్నది. సరోవరము, కమలములు చల్లనిమబ్బునీడలోనున్నవి. లతానికుంజములపై జల్లువాన కురియుచున్నది. కాననమున కారుమబ్బులు, ఉఱుములు, మెఱుపులు, ప్రబలమైనతుపాను, గాఢాంధకారము.

విమలాకాశమున నెలబాలునివలె నిర్మలసరోవరమున రాజహంస మనోహరముగా మధురమందముగా విరులవలపులో చిఱుతరంగములపై దేలియాడుచున్నది. గగనసీమను ప్రకాశించుచున్న ఇంద్రధనువుజూచి ననుగాంచి రాజహంస చిఱునగవుతో నిట్టులన్నది. "ఓమానవుడా! చూచినావా, ఆ మెరిసిపోవుచున్న నక్షత్రాలు, వింతరంగులఇంద్రధనస్సు, ఈవిశాలమైన అనంతమైన సుందరమైన ప్రకృతి: దీనిముందు నీవెంతటివాడవు? ఈమాత్రముననే నీవు క్రిందుమీదు తెలియక ఎగసిపడిపోవుచున్నావే! నినుపోల్చుటకే విశాలసృష్టిలో ఇంకేమియులేదని నీవు విర్రవీగుచున్నావు. ఒక్కసారి కనులు తెరిచి నిన్ను నీవేచూచుకొనుము, ఎట్లుందువో!"

నేను ఆకసమువైపు చూచితిని. ఒకేసారి సూర్యదీప్తి, నక్షత్రములు, ఇంద్రధనుస్సు ప్రకాశించుచున్నవి: తర్వాత నన్ను నేనుగాంచితిని. అప్పుడు నేనొక రేణువురూపముదాల్చితిని. నవ్వుచు: "అవును రాజహంస! మానవుడు ఈ అనంతమైనసృష్టిలో కించన్మాత్రుడే."

రాజహంస:—ఇది తెలిసికోలేక మానవజాతి మాయంతటివారులేరుఅని విర్రవీగుచున్నది. అణువుకంటె అణుమాత్రమైనమానవుడు తనబుద్ధి, ప్రతిభచూచి సిగ్గుపడి నవ్వుకొనుటకుబదులు ఉన్మత్తుడై సంతోషపడుట, గర్వపడుటచూచి నాకు జాలికలుగుచున్నది: స్త్రీనిచూచి, స్త్రీరూపముచూచి మీరుపొందే సంతోషము, వర్ణించేవర్ణనలుచూచితే నవ్వువచ్చును. సృష్టిఅంతట మగజాతియే సౌందర్యమైనదయియుండగా మీరు మానవులు గ్రుడ్డివారైపోయి స్త్రీకి మోకరించి పూజచేయుచున్నారెందులకు? ఈకమలములనంత చూడుము. నీస్త్రీని ఊహించుకొమ్ము. వీనిసౌందర్యము, మనోహరత్వము ముందు స్త్రీయెంతటిదో ఊహించుకొమ్ము. ఒక్క లేతఆకుకున్న లావణ్యమైనా ఉండదే నీస్త్రీకి? మరెందుకు మానవుడు స్త్రీముందు కుంగిపోవుచున్నాడు? ఆమెచూపులో కరిగిపోవుచున్నాడు, ఆమెతాకితే పులకరించిపోవుచున్నాడు? వినుము. నీస్త్రీ కల్పనామయి. వేరేమియుకాదు; కాజాలదు. ఆమె యేరూపముతో పుట్టినదో ఆరూపమును మఱచి మానవుడు క్రొత్తరూపమును సృష్టించుకొనుచున్నాడు. ఆరూపము కొన్నాళ్లకుభగ్నమైపోతే అతడు కూలిపోవుచున్నాడు. ఇదిమరిచిపోయి అంతలోనే నాయంతటివాడులేడుఅని గర్వించుచున్నాడు. ప్రకృతిని జయించ కలుగుచున్నానని వొళ్లుమరచుచున్నాడు. అయ్యో! వెర్రిమానవుడా! నీవేమి మహత్తరకార్యము చేయగలిగినావు?

నేను:—రాజహంసా! అట్లుచెప్పెదవేమి? మానవుడు నీటిని, గాలిని–పంచభూతములను జయించగలిగినాడు. మానవునకవి యిప్పుడు దాస్యముచేయుచున్నవి. అంతకంటె ఇంకేమికావలయును?

రాజహంస:—ఓయి వెర్రివాడా! ఇంతమాత్రమునకు సంతోషించుచున్నావా? నీసంకుచితమైన మనస్సు, హృదయముచూచితే నవ్వువచ్చుచున్నదినుమా! మానవుడు సృష్టిలోనికివచ్చి యెన్నినాళ్ళయినది?

కొన్నివేలు, లక్షలు, కోట్లు సంవత్సరములైనవే. ఇంతకాలమునకు మీరు చేయకలిగినపనులు, చూతుము. కాని, పిచ్చుక సృష్టి ప్రారంభమునుండియే చేయకలుగుచున్నది. గాలిలో, నీటిపై, భూమిమీద ప్రయాణముచేయ కలుగుచున్నానని నీకుగర్వము. పిచ్చుక ఆనాడే యివన్నియు నేర్చుకొన్నదని మరిచిపోయితివి. ఏమేమో పంచ భూతములను జయించినానని గర్వపడుచున్నావేకాని నీకు ఆనందమేది? తృప్తియేది? క్రిమికీటకాదులుకలనైనా యెరుగని రోగములతో, బాధలతో నీవు బాధితుడవగుచున్నావు. ఆబాధలు, రోగములు మాన్పుకొనుటకై నానాకష్టములుపడి పక్షుల, జంతువుల మలమూత్రములుకూడ నీవు భక్షించుచున్నావు. ఎన్ని చేసినను స్వేచ్ఛగా ఆనందవివశయైతిరిగే పక్షికున్న ఆనందము నీకేది? ఉత్సాహము నీకేది? శాంతినీకేది? అనేకబంధనములలో నీవు కట్టుపడిపోయియున్నావు. నీకు స్వేచ్ఛలేదు. నీవు బంధితుడవు.'

నేను:—మానవుడు బంధితుడెట్లగును? ఇదివరకే కొన్నిదేశములు స్వేచ్ఛకైపోరాడి సంపాదించు కొన్నవిదానిని. కొందరింకను ప్రయత్నముచేయుచున్నారు: కొన్నాళ్ళలోనే తెచ్చుకొందురు వారుకూడా.

రాజహంస:—ఓయి వెర్రివాడా! మానవుడు స్వేచ్ఛఅంటేయేమిటో యెరుగడు. అది యిట్టిదిఅనిచెప్పు టకు వలనుపడనిది. మాటలకు దానిని తెలిపేశక్తిలేదు. సృష్టినిగమనించుము శ్రద్ధతో, సూక్ష్మబుద్ధితో. స్వేచ్ఛ అంటే నీకేమిటో కొంతవరకైనా తెలియగలదు. స్వేచ్ఛవిషయములో మీరు పుట్టుకలోనే జంతువులకంటె, పక్షులకంటె తక్కువదశలో సృష్టింపబడినారు. స్వేచ్ఛగాతిరిగే అతేనెటీగను చూడుము. అది ప్రకృతిలో విలీనమైపోయి స్వేచ్ఛగాతిరుగాడుచున్నది. మానవుడో ప్రకృతినతిక్రమించుట స్వేచ్ఛఅని పొరబడు చున్నాడు. ఆరీతిగా అతడు స్వేచ్ఛనుపొందజాలడు. అతడు ప్రకృతిలో విలీనమైనప్పుడే ఆయానందను పొందుకొని అనందించగలడు.'

నేను:—ఆయానందముకొరకే మేము లోతుగాఆలోచించి శాస్త్రములు, నియమములు ఏర్పరచుకొని యున్నాము. శాంతిజీవనముపొందుచున్నాము. జంతువులు పక్షులు-వాటికి నీతినియమములులేవు. మహాపాప భూయిష్ఠమైనది వాటిబ్రతుకు.'

రాజహంస:—ఓయి, అజ్ఞానుడా! మీశాస్త్రములు, కట్టుబాట్లుతీసుకవెళ్లి నడిసముద్రములో పార వేయుము. అప్పుడేనీవు స్వచ్ఛమైన పునర్జన్మయెత్తగలిగెదవు. అంతవరకు నీకు పాతాళమేగతి: నీవు మానవజాతిఅంతా ఒక్కటేఅనిమరిచిపోయి నీలోనీవు అనేకజాతులు, కులాలు, మతాలు, రంగులు తెచ్చు కొన్నావు. అనేక వెర్రిఆచారాలు, అనేక పిచ్చికట్టుబాట్లు, అనేక అర్థములేనిరీతులు ఏర్పరచుకొన్నావు. మీలో ఒకరి జాతి, శాస్త్రము, కట్టుబాటుఅంటే యింకొకరికిఅసహ్యము. ఒకరినిచూచి యింకొకరు సహించలేరు. మానవుని వదలివేసినసృష్టిలో ఈవెర్రితనము, అజ్ఞానము, పాపము ఇంకెచ్చటనులేవు. మేము సృష్టిఅయినవాడు ఎట్లున్నాము! ఈనాడుకూడా అటులనే స్వచ్ఛమైనజీవనముగడుపుచున్నాము. మానవుడో అతడు సృష్టిఅయినప్పటిజీవితము ఇప్పుడు తారుమారైపోయినది. తాను తెలివిగలవాడనను కాని వెర్రిమొర్రి గ్రంథాలు, కట్టుబాట్లు, జాతులు తనలోతానేసృష్టించుకొని తినవాశనమునకు తానే కారకుడైపోయినాడు. శాంతి, ఆనందము, ప్రేమ వీనినిమరిచిపోయి వానిని చేతులారపోగొట్టుకొని యిప్పుడు తానుపొందుచున్నదే శాంతిఅనీ, ఆనందమనీ, ప్రేమఅనీ భ్రమించిపోవుచున్నాడు. వీని నిజరూపము నాతడు కోల్పోయినాడు. ప్రకృతికి అతడు దూరమైపోయినాడు. తనసృష్టి వేరుపరచుకొన్నాడు. అకలుషకూపములోపడి అదియే మహాస్వర్గమని మురియుచున్నాడు. సృష్టిఅయినవాడెట్టు లానందమూర్తులమైయున్నామో నేడును అటులనే మార్పులేకయున్న మేము ఆకూపకలుషనివాసులను దుఃఖమూర్తులనుచూచి జాలిపడుచున్నాము. అకల్మష మైన, ఆనందమయమైన, శాంతిమయమైన, ప్రేమమయమైన సృష్టిజీవనము మాలో మూర్తీభవించియున్నది.

నిజమైన స్వేచ్ఛకు భంగముకలిగించనినియమములు, శాస్త్రములు మారక్తములో ప్రకాశించుచున్నవి. మాజీవనములో వికసించుచున్నవి. వెర్రిశాస్త్రములు, అర్థములేనికట్టుబాట్లు మేమిక సృష్టించుకోవలసినఅవసరము లేదు. ప్రకృతియే మేము, మేమే ప్రకృతిఅయియున్నప్పుడు—అంతట ఆనందము, శాంతి, ప్రేమ. మీవలె మాకు దుఃఖము, అశాంతి, ఈర్ష్య లేవు. మీరు ప్రకృతికిదూరమైపోవుటలోనే పతితులైపోయినారు. అంత కనుమించి మీశాస్త్రములు, కట్టుబాట్లు సృష్టించుకొనుటతో మరింత పతితులైపోయినారు. మీకుఇంతలో ముక్తిలేదు. ఇక పాపపుణ్యములందువా! మీలోఒకనికి పాపమైనది మరొకనికి పుణ్యమగుచున్నది; ఒకనికి అవినీతియైనదియే ఒకనికి నీతియగుచున్నది. ఇకెట్లు పాపపుణ్యములకు, ధర్మాధర్మములకు, నీతి అవినీతులకు నీవు అర్థముచెప్పగలవు? ఈపాపపుణ్యభేదము నీవు సృష్టినతిక్రమించి సృష్టించుకొన్నావు. వేరొకడు ఇంకొక రీతిగా ధర్మాధర్మవిచక్షణచేసుకొనుచున్నాడు. ఇది నీతి, అది అవినీతిఅని నిర్ధారణగా మానవునకుచెప్పే శక్తి లేదు. మాకో రెంటిభేదమేలేదు: మాకు పాపములేదు, పుణ్యములేదు. ఈరెంటికిని అతీతులమే మేము. ఇకెట్లులు మాది పాపభూయిష్ఠమైనజీవనమనగలవు? ఓహో! నీదృష్టిలో దేవుడుకూడా పాపియేఅగుచున్నాడుగా! అదియే నీసంపూర్ణపతనమునకు కారణమైనది. నీవు రాయినిపూజించితే పుణ్యమువచ్చుననీ, పామును పూజించితే స్వర్గమువచ్చుననీ మురిసేవాడవు. నామాట నీకేమిబోధపడగలదు? పరమేశ్వరుని ప్రతిబింబమైన ఈమహానంతసృష్టి కనులయెదుట అద్వితీయమైనతేజస్సుతో, సౌందర్యముతో, జీవకళతో ప్రకాశించుచుండగాచూచి ఆనందించి ఆరాధనచేయజాలక నీవు రాయిని అప్పనుపూజించుటలో తృప్తిపడుటచూడగా నవ్వువచ్చును. మరియు నీవు ఎదుటనున్న ప్రకృతిసంతానమును ప్రకృతినిచూచి ఆనందించలేక వానిజీవములేని బొమ్మలు నీగృహములోపెట్టుకొని మురియుచున్నావు. సంకుచితుడవు. ఇంకను సంకుచితుడవైపోయెదవు కొన్నాళ్ళకు. జంతువులను, పక్షులనుచంపి వానితో నీవు, నీస్త్రీ అలంకరించుకొనుచున్నారు. అలంకరించుకొని యింతటిసుందరు లింకెవరునులేరని గర్వపడుచున్నారు. ఓయి వెర్రిమానవుడా! ఒక్కఆకు, ఒక్కపువ్వుతీసికొని వానితో నీసౌందర్యము, నీస్త్రీ మనోహరత్వముపోల్చి చూచుకొనుము: నీవు, నీయలంకారములు వానితోపోల్చుటకైనా అర్హతలేకుండాపోవుచున్నారే! ఇంకను గర్వించెదవెందుకు?

నేను:—రాజహంస! గర్వమునకేమి లెమ్ము. నిజమగునాకాడా మాకు విలువలేనిధనసంపత్తి, స్వచ్ఛమైనకీర్తిసంపత్తి ఉన్నమాట! మీకో అవియేవి?'

రాజహంస:—వినుము! ఆదిలో మానవుడు శాంతప్రేమానందమూర్తిగా రూపమునందినాడు, ఇతర జంతుసంతానమువలెనే. కాని అతడు ధనమనీ, కీర్తిఅనీ వీనిసంపాదనకొసముపాటుపడి వీనినిపొంది తన్ను—అంటే తనఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ—కోల్పోయినాడు. అంతటిలో అతనినిజరూపము మారిపోయినది. అతడు కల్పితరూపముపొందినాడు. ధనము, కీర్తి ఎందుకొరకుకావలెనని మానవుడు ప్రయత్నించుచున్నాడు? ఆనందము—సౌఖ్యముకొరకేగదా! కాని యేధనకీర్తులమూలముగా అతడు ఆనందసౌఖ్యములను పొందదలచుచున్నాడో వానిమూలముగానే ఆయానందసౌఖ్యముల నాతడు గోల్పోయి పతితుడై తన్నుతాను కోల్పోవుచున్నాడు. తనుపుట్టి యిన్నాళ్ళయినను తనతప్పు తాను తెలిసికోలేకున్నాడు. మానవుని ప్రపంచమంతయు గెలువనిమ్ము కాని తన్నుతానుకోల్పోయిన ఆప్రపంచముతో అతనికి ప్రయోజనమేమున్నది? ధనకీర్తులసంపాదనములో అతనికి తీరికలేదు. తృప్తిలేదు. అందుచేతనే అతడు తనప్రకృతిసిద్ధమైన ఆనందమును, ఉత్సాహమును, శాంతిని, ప్రేమను కోల్పోవుచున్నాడు. వీనిగూర్చి ఆలోచించుటకైనా అతనికి సమయము చిక్కదు. వీనికొరకు అతడు తనసౌఖ్యముకూడా పోగొట్టుకొనుచున్నాడు. యుద్ధములుచేసి మనుష్యజాతిని నాశనముచేయుటకుకూడా అతడు వెనుకాడుటలేదు. పతితుడైపోయినాడు. పతితత్వమునుండి పావనత్వము

పొందవలెనంటే అందరకుసరిసమానముగా ధనముండవలెనని మరియొకడనుచున్నాడు. ఆప్రయత్నములో అతడు కొంత సౌఖ్యము నాశనము చేసుకొనుచున్నాడు. సరిసమానముగాపంచుకొనినను ప్రకృతిసంతానములో ఉన్నఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ వారిలో కనిపించుటలేదు. మేమా: మాకు ధనముతో, కీర్తితో అవసరములేదు. వీటికి మేము అతీతులమైయున్నాము. అందుచేతనే మేముకూడ మానవునివలె క్రుంగిపోవక మమ్ములను మేము కోల్పోవక ఆనందమూర్తులమైయున్నాము. మీవలె మేము వానికోసము యుద్ధములుచేసి సరిసమానముగాపంచుకోవలెనని బాధపడము. వానిపై కోరిక ఉన్నచో మానవునివలెనే మాకును పతితత్వము కలిగియుండెడిది. ఒక్కవిషయము చూడుము: మీలో కోటీశ్వరుడుండనిమ్ము. కాని అతనికి ఒకచిలుకకున్న ఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ యేవి? అది స్వేచ్ఛగా, మనోరంజకముగా తిని తిరిగి గానము చేయును. అవి అతనికేవి?

నేను:—ఏమైనను ఇహపరసాధన మెరిగినవారము మేము.

రాజహంస:—వెర్రివాడా! పెద్ద పెద్దమాటలు మాటాడుచున్నావు. ఇహము, పరము—పుట్టికెగరలేనిది స్వర్గానికెగిరిందని: ఈలోకము, ఈజీవనము తెలిసికోలేని నీవు ఇచ్చట ఆనందము, సౌఖ్యముపొందనినీవు పరలోకములో నేమిచేయకలిగెదవనేది వెర్రిభ్రమ. ఇప్పుడు ఆనందమున్నదా లేదాఅనేది అంత ప్రాముఖ్యమైనవిషయముకాదు. పరలోకానందముకోసము ఇప్పుడు కష్టమనుభవించుతామనేది అంతకంటే నమ్మతగినమాటకాదు. ఇక్కడ ఇప్పుడే ఆనందించవలె: అప్పుడేనీవు సఫలుడవు, ధన్యుడవుకాగలవు.

నేను:—రాజహంస! మానవుడు దైవమును తెలిసికొనిన విజ్ఞానికాదామరి!

రాజహంస:—ఏమి? మానవుడా! నీవు దైవమును తెలిసికొన్నావుగా! ఆకాశముఎదుట కనిపించుచునే యున్నది. అది అనంతము. దానివైశాల్యము తెలిసికొనుట నీచేతకాదు. అటులనే దైవము. అయినను—ఇరుగు పొరుగువానిని ప్రేమించలేనినీవు, ఇరుగుపొరుగువానిని తెలిసికోలేనినీవు దైవమునుకూడా తెలిసికొనగలవా? అందుకు నీశక్తిచాలదు. అతడు ఆనందమూర్తి. ఆనందమునుండియే ఈసృష్టి వెల్వడుచున్నది. ఆనందముచేతనే పోషింపబడుచున్నది. అంతట ఆనందతేజస్సు. ఎటుజూచినను ఆనందామృతమే. ఈఆనందమునుగ్రోలుటయే నీపని. అప్పుడు నీకు అతనిని తెలిసికోవలెనను పిపాసలేదు. విమలనీరమున సంచారము చేయుమత్స్యమునకు దాహమెక్కడిది?............ఉత్సాహము—ఆనందము—శాంతి—ప్రేమ............ఆనందించుము—అమృతము............మానవుడెందుకో బ్రతుకుచున్నాడు............ఎందుకో మరణించుచున్నాడు...

* * * *

ఫెళఫెళార్భటులు. మేఘములు గట్టిగా ఉరిమినవి.

# గోష్పదక్షేత్రలక్ష్మి

శ్రీమతి వేదుల కాత్యాయనీ దేవిగారు

ఒకచోట దినకరుం డొదిగియుండగను వే
  రొకచో నిశకరుండు హాయలునింప,
నొకమూల నీలాదియుగ్మాలవర్ణాల
  సంజ వ్యంజనముగా సంజుకొనగ,
నిరుగెలంకుల మేటిపరభృతరావముల్,
  పెరదిశపై రులసొరులొల్క,
నొకసీమ సికతాల చకచకల్ తాల్కొయ,
  నొకచెంత మేలూర్పు లూగుచుండ,
ప్రకృతిసౌభాగ్యమియ్యెడపరచి, ధాత
పూసినొయ్యెడ, మఱికొంతపోసె నొక్క
చో, నికొక్కెడప్రోవుగా జూపినాఁడె,
ప్రకృతిసౌభాగ్యముండె నీనికటమందె.



డాక్టరు మొసలికంటి సుందరీబాయమ్మగారు

* * *

వీరు పుణ్యక్షేత్రమగు పూరీనగరమందు యాత్రికుల స్త్రీవైద్యశాలయందు వైద్యురాలుగ నియమింపబడిరి. విశాఖపట్టణపు వైద్యకళాశాలలో విద్యనభ్యసించి, ఆంధ్రవిశ్వవిద్యాలయమున వైద్యపరీక్షయందు పట్టముపొందిన ప్రథమాంధ్రబ్రహ్మణయువతి. ఈమె గొప్ప కరణకమ్మవేపారికుటుంబమున జన్మించినది. వేదవేదాంతసారసంవేదులని విఖ్యాతివడసిన నాభిరామమూర్తిపంతులుగారు వీరిమాతామహులు. వీరిజనకులు పిన్నవయస్సునందే కాలధర్మమునొందిరి. వీరిజనని "హిందూసుందరి" పత్రికకు పత్రికాసంపాదకురాలుగ సుమారు పన్నెండు వత్సరములుండిరి. ఇట్టి డాక్టరుపదవికి ఉత్తరజిల్లాలోని స్త్రీలెవ్వరును ఇదివరలో నియమింపబడియుండలేదు. వీరి వైద్యనైపుణ్యము, దయాశీలత ఆంధ్రస్త్రీప్రపంచమునకు కీర్తిని తెచ్చునుగాక!

* * *



శ్రీమతి యర్రా లక్ష్మీకాంతమ్మగారు

పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెంతాలూకా పెంటపాడు కాపురస్థులు శిరిగినీడి సుబ్బరాయుడునాయునుగారి కీమె ప్రథమపుత్రిక. ఈమెకు ఒకసోదరి, ఒకసోదరుడునుకలరు. ఈమె తండ్రిగారు చాలకాలము జిల్లాబోర్డులోను, తాలూకాబోర్డులోను మెంబరుగాను పెంటపాడుయూనియనుబోర్డుప్రెసిడెంటుగాను ఉన్నారు. భూస్వాములు. ఈమెయు ఈమెసోదరియు ఆంధ్రములో మంచిసాహిత్యము సంపాదించినారు. ఆంగ్లములో సామాన్యభాషాపరిజ్ఞానముకలదు. ఈలక్ష్మీకాంతమ్మగారు భీమవరముతాలూకా ఉప్పలూరుకాపురస్థులు యర్రా తిరుమలరావుగారిభార్య. వయస్సు 19 సంవత్సరములు. భర్త మంచి భూస్వామి. వీరికి ఆంధ్రములోను, ఆంగ్లములోను మంచిభాషాపరిజ్ఞానముకలదు. వీరుకూడ పెంటపాడుయూనియన్‌బోర్డుకు కొంతకాలము ప్రెసిడెంటుగాఉన్నారు. ఈమెతండ్రిగారు కొమార్తెలకు యుక్తవయస్సువచ్చినతరువాతను వరునియొక్క నియామకములో కొమార్తెలయొక్క సమ్మతినితీసుకొని ఏకర్త్రాతి యింటివద్దనే వివాహామునుచేసియున్నారు. అల్లుళ్ల యిద్దరున్ను ధనవంతులైనను కట్నములు ఇవ్వకూడదనేప్రతిజ్ఞను తండ్రిగారు పాలించినారు. ఈలక్ష్మీకాంతమ్మగారికి నర్సాపురములో నిర్వహింపబడుచున్న ఆంధ్రస్త్రీలపోటీపరీక్షలో మొదటితరగతిలో జయమునుపొందినందుకు ఆసంఘమువారు బంగారుపతకమును బహుమానమిచ్చిరి.

# బలి

ఆదిరాజు అమృతేశ్వరరావుగారు

ఆసంవత్సరంబొత్తిగా వర్షములులేవు. పంటలు పండలేదు. ప్రజలు తిండిలేక మాడిపోతున్నారు. ఇంతలోనే వేసంకాలంవచ్చింది. చెరువుల్లోను, నదుల్లోను నీరు యిగిరిపోయింది. చేపలు చచ్చి బయటపడుతున్నాయి. జనులు ఆకలికిఆగలేక చస్తున్నారు. ఎక్కడచూచినా పీనుగులే. ఎక్కడకువెళ్ళినా దుర్వాసనే. వెంటనే కలరా, మశూచి ప్రారంభించింది బ్రతికున్నవాళ్ళను చంపేందుకు. దేశమంతా నానాబీభత్సంగా వుంది. జనులంతా హడిలిపోతున్నారు. ఆరోజుల్లో గణాచారులన్న, మతగురువులన్నా మహాసమ్మకము. మతగురువుచెప్పిందే మందు. ఆయనమాట శాసనం. రాజుకూడా ఆయనకు ఎదురుచెప్పటకు వీలులేదు. గణాచారులు కుక్కగొడుగులవలె బయలుదేరారు. చావగామిగిలిన మేటపోతులిన్నీ, మెనుబోతులిన్నీ చంపేందుకు. దేవాలయాల్లో ప్రార్థనలు, భజనలు చేస్తున్నారు. ముడుపులుకట్టారు. మొక్కులుమొక్కారు. జాతర్లుచేసారు. బలులిచ్చారు. ఎంతచేసినా, ఏమిచేసినాతగ్గలేదు. ఒకరోజున ఒక పుకారుపుట్టింది. ఏమంటే రాత్రి పూజారికల్లో భగవంతుడు కనబడి రాజుగారి కెక్కువ యిష్టమైనవార్ని బలిస్తే దేశంలో శాంతియేర్పడుతుందని చెప్పాట్ట. జనంఅంతా గుంపులు గుంపులుగాపోగై య్యారు. ఎక్కడచూచిన ఇదేమాట. రాజుగారికిష్టమైనదేంటో కనుక్కుందామని పదిమందినివెంటేసుకుని బయల్దేరాడు మతగురువు. వీరువెళ్ళేసరికి రాజు యింట్లోలేడు. వేటకువెళ్ళాడు. కొడుకుని వళ్ళోపెట్టుకొని ఆడిస్తోందిరాణి. ఈయిద్దరిలో యెవరోఒకరు రాజుగారికిప్రియులని నిశ్చయించారు. రాణిదగ్గరకువెళ్ళి మీలో రాజుగారికెవరు యెక్కువ ప్రేమపాత్రులు అని అడిగారు. ఇద్దరము సమానులమే అని రాణిచెప్పింది. కొంతసేపాలోచించి కొడుకేరాణికంటె రాజుగారికిష్టుడని మతగురువు నిశ్చయించి ముద్దుకుర్రని లాక్కునివెళ్ళాడు. పసుపుబట్టలుకట్టారు. వేపదండలువేసారు. ఊరంతాఊరేగించి బలిపీఠానికి తీసికువెళ్ళారు. ఇంతలోనే రాజుగారింటికివచ్చారు. రాణి యెదురుగావచ్చి "నేనా, బిడ్డా మీకెక్కువయిష్టులు?" అనిఅడిగింది. రాజు ఇద్దరు సమానులేఅని చెప్పాడు. వెంటనే రాణి రివ్వునపరుగెత్తింది. రాజు కిదేమిటో తెలియక ఆశ్చర్యపడుతూ నిలబడ్డాడు. అక్కడ కుఱ్ఱవానిని బలిపీఠముమీదనిలిపారు. నిమీలిత నేత్రుడై జోడించిన చేతులతో నిలబడ్డాడు. పూజారి మంత్రోచ్చారణ చేస్తూ కత్తిని కుఱ్ఱవానిపైకి విసిరాడు. ఇంతలోనే "నేనే రాజుగారికి ప్రియమైనదాన్ని" అని కేక వేయుచు రివ్వునవచ్చి బలిపీఠాన్నున్నకుఱ్ఱవానిని క్రిందికిత్రోసి నిలబడింది ఒకవ్యక్తి. తలతెగి అవతలపడింది. ఆతెగినతలయెవరిదీ? మనరాణిదే! అందరు ఆశ్చర్యపడ్డారు. దేశంకోసం, ప్రజలకోసం, కన్నబిడ్డకోసం తనప్రాణాల్ని అర్పించిన ఈవీరమాతని ఏమని పొగడగలం?

—Victor.

## బిస్సాతీ

## తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు

ఉద్యానముదగ్గర శైలమాలికకింద సస్యసమృద్ధిగల చిన్నగ్రామమున్నది. వసంతఋతువులో చల్లగాలి దాన్నిస్పృశించి, అక్కడికుటీరాలనిండా పుష్పసౌరభాలు నింపుతుంది. సరోవరపు హిమశీతలప్రవాహము తన బాహుపాశాలతో ఆగ్రామాన్ని గట్టిగాబంధించుకొనిఉన్నది. ఆరమణీయప్రదేశాన నిరంతరమూ మధురధ్వని వినబడుతూఉంటుంది. దానిలోపల బుల్ బుల్ పక్షులకలనాదము మూర్ఛనకల్పిస్తుంది.

దానిమ్మపూల అరుణకాంతి సంధ్యారాగములో మరింత ఉజ్జ్వలముగాఉన్నది. షీరీన్ దానిమ్మచెట్ల కింది శిలాఖండముమీదకూర్చుని ఎదటి గులాబీపొద చూస్తున్నది. అందులో బుల్ బుల్ పక్షులు పాడుతున్నవి. అవి గాలితోపాటు గుంజనము చేస్తూ తమ కలవరముతో దిక్కులునింపివేస్తున్నవి.

షీరీన్ చప్పున తన మేలిముసుగు తొలగించింది. ప్రకృతిప్రసన్నమై హసించింది. ఆమె గులాబీపంక్తి నడుమ రాణీలాగ శోభాయమానముగాఉన్నది. మకరందము నోటినిండాఉండడముచేత రెండునల్లతుమ్మెదలు గులాబీలోనుంచి బయటికిరాలేకపోయినవి. తుమ్మెదలరెక్కలు ఆడడములేదు. ముళ్ళపొదలని లక్ష్యపెట్టక బుల్ బుల్ వాటిలో జొరబడడమూ, ఎగిరిపోవడమూ ఆమె తన్మయత్వముతో చూస్తున్నది. ఆమె సఖి జలేఖారావడముచేత ఆమెభావన విచ్ఛిన్నమయింది. మేలిముసుగుతొలగిస్తూ జలేఖా "షీరన్, నీచేతులమీదవాలిఉండే బుల్ బుల్ ఈరోజుల్లో కనబడడంలేదే" అన్నది.

షీరన్ నిట్టూర్పువిడిచి "నిండుశీతాకాలంలో తన జట్టుతో మైదానంవైపువెళ్ళిపోయింది. వసంతుడు వచ్చినా అది తిరిగిరాలేదు" అన్నది.

"ఇవన్నీ హిందూస్థానంలోకి చాలా దూరం పోతవి. నిజమేనా? షీరీన్?"

"అవును ప్యారీ! నిరాఘాటంగాతిరగడం వీటికి చాలారుచిస్తుంది. ఈజాతికి స్వాతంత్ర్యం చాలా యిష్టం."

"ఉంగరాలుతిరిగే ముంగురులల్లో దాన్ని ఎందుకు నీవు బంధించలేదు?"

"నాపాశము సళ్ళిపోతూఉంటుంది."

"మంచిది. బుల్ బుల్ తిరిగివస్తుందిలే. విచారించకు. ఇంటికిపోతున్నాను."

షీరీన్ శిరఃకంపము చేసింది.

జలేఖా వెళ్ళిపోయింది.

* * *

ఆపర్వతప్రదేశాన గగనమార్గమున సంధ్య తనరంగుపట్టు వ్యాపింపచేస్తూఉండగా, విహంగాలు బారులు దీర్చి కలరవాలతో ఎగురుతూ పొదరిళ్ళవైపు మరలుతూఉండగా, కోమలములైన వాటిరెక్కలవల్ల వాయువు తరంగాయితమవుతూఉండగా, గులాబీ పువ్వు గాఢసౌరభము వెదజల్లుతూ పచ్చనిపట్టులో తలదాచుకొనగోరుతూఉండగా, షీరీన్ కుమారి ఆశాన్వితదృష్టి నీలిమావృతమైన కనురెప్పలలో అంతర్హితముకాసాగింది. ఆమె మేలుకొనిఉండేకలలు కన జొచ్చింది.

హిందూస్థానములో సంపన్నమైననగరములో ఒక యువకుడు వీపుమీద మూటవేసికొని ఒకగల్లీలో తిరుగుతున్నాడు. ఆహారములేక బడలికచేత అతని ముఖము వెలవెలబోతున్నది. అలిసిపోయి అతను ఎవరిగుమ్మములోనో కూర్చున్నాడు. కొద్దిగా సరుకు అమ్మి ఆరోజుఖర్చులకు పైసాసంపాదించవలెనన్నే ఆదుర్దా, జాలిగొలిపే అతనిమాటల్లో జాలువారుతున్నది. కాని ఆయింటియజమాని "అరువుఇవ్వడానికి వీలులేకపోతే మూటయెత్తుకోవచ్చు. తెలిసిందా?" అన్నాడు.

"అరువివ్వలేను."

"అయితే నాకేమీఅక్కరలేదు."

షీరీన్ ఈవిధముగాభావించి ఉలికిపడ్డది. సరుకులుతీసుకొని బిసాతీవెంట ఖైబరుకనుమలో ఆమె మానసికసంచారముచేస్తున్నది.

హిందూస్థానములో ప్రతిగృహస్థుదగ్గరా అవసరము లేకపోయినా ఆయువకుని సరుకులన్నీకొనడానికి తగినడబ్బు ఉంచుదామనుకొన్నది. అమాయికురాలు షీరీన్ నిస్సహాయ. ఆమెతండ్రి కఠినుడైన కొండ సరదారు. ఆమె తలవంచుకొని ఏదోఆలోచిస్తున్నది.

సంధ్యావేళ దాటింది. పక్షులకలరవాలు అగిపోయినవి. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసలతోపాటు వాయుగమనముకూడా మందగించింది. ఆమె రాతికి చేరబడ్డది.

దాసీవచ్చి ఆమెనుఓదార్చి "బేగంసాహెబా, పిలుస్తున్నారు. పదండి. గోరింటాకువచ్చింది" అని చెప్పింది.

* * *

కొన్నినెలలుగడచినవి. ధనవంతుడైన ఒకానొక సరదారుకు షీరీనునిచ్చి వివాహముచేశారు. నెలయేటి ఒడ్డునవున్న ఆమెతోటలో రాత్రిగడిచిపోయింది. వసంతవాయువు ఒక్కొక్కతాకుతో వందలకొద్ది పూలు రాల్చుతున్నది. మకరందము కురుస్తున్నది. బుల్ బుల్ పక్షులు వాయుకాఠిన్యానికి క్రందనము చేస్తున్నవి. షీరీన్ అన్నింటినీ సహిస్తున్నది. సరదారు ముఖాన ఉత్సాహము వెల్లివిరుస్తున్నది. మొత్తము మీద ప్రభాతము రమణీయముగానేఉన్నది.

దుర్బలుడైన పొడుగాటియువకుడొకడు వీపుమీద మూటవేసుకొని ఎదటికివచ్చికూర్చున్నాడు. షీరీన్ అతన్నిచూచింది. అతను ఎవరివైపూచూడలేదు. మూటవిప్పి సరుకులనుగురించి చెపుతున్నాడు.

తనప్రియురాలికి బహుమానముచెయ్యడానికి సరదారు గాజుగిన్నెలూ, కాశ్మీరదేశవస్తువులూ కొన్నాడు.

షీరీన్ మాట్లాడలేదు. ఆవిడహృదయములో ఆందోళనపుట్టింది. సరదారు వస్తువులఖరీదు అడిగాడు.

"నేను కానుకలిస్తాను, అమ్మకంచెయ్యను. ఈ పరదేశకాశ్మీరవస్తువులు ప్రత్యేకం ఏర్చితెచ్చాను. వీటికి వెలలేదు. మనస్సుకునచ్చినవి. అమ్మేవికావు" అని యువకుడుచెప్పాడు.

"అయితే నాకక్కరలేదు. తీసుకుపో. మూటెత్తుకో" అని సర్దారు తీక్ష్ణముగాఅన్నాడు.

"మంచిది. తీసుకుపోతాను. అలిసిపోయివచ్చాను. కొంచెము విశ్రాంతితీసుకోనివ్వండి. కాస్త కాళ్ళూ చేతులూ కడుక్కుంటాను" అని యువకుడు నీరునిండుతున్న కళ్ళుత్రిప్పుకొని లేచాడు.

అతను నెలయేటివైపువెళ్ళిఉంటాడని సరదారనుకొన్నాడు. బిసాతీ ఎంతసేపటికీతిరిగి రాలేదు. అగాధమైనదుఃఖముఅనుభవిస్తూ గుండెలమీద చెయ్యివేసుకొని షీరీన్ గులాబీపొదలవైపుచూస్తున్నది. కన్నీళ్ళవల్ల ఆమెకు ఏమీ కనబడడము లేదు. సరదారు ప్రేమతో ఆవిడభుజముమీద చెయ్యివేసి "ఏమిటి చూస్తున్నావు?" అనిఅడిగాడు.

"పెంపుడుబుల్ బుల్ ఒకటి చలికాలంలో హిందూస్థానంవైపువెళ్ళి ఈఉదయమే తిరిగివచ్చి కనబడ్డది. అది నాదగ్గరకివచ్చినప్పుడు దాన్ని పట్టుకొందామనుకొంటే కొండగుహవైపు ఎగిరిపోయింది!"

ఆమె గద్గదస్వరముతో అన్నది. అయితే మాటలు చాలా నిబ్బరముగాపలికింది. సరదారునవ్వి "బుల్ బుల్ కోసం పూలపొదల్లో చూస్తున్నావా? వింతగా ఉంది!" అన్నాడు.

బిసాతీ తనసామాన్లువిడిచిపెట్టివెళ్ళాడు, తిరిగి రాలేదు. షీరీన్ మూటదింపించిందికాని ఖరీదుఇవ్వలేదు.

—శ్రీజయశంకరప్రసాదు హిందీకథకుఅనువాదము.

## నా గులాబి

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

లలితతావకపత్రాంచలములనుండి
హారినీహారవారిబాష్పాంబుధార
సొంపునెంతయు ముచ్చిలి పెంపులేక
జాతి నాగుండె లల్లన జాలివైచె.
కానియేమందునో పూవుకల్కి! నీవు
కంటకావృతవేను నీ కంటకముల
వేరుచేయఁగఁ జాలను వేచుమింక
కొంతకాలము సమయము కుదురువరకు.

దవ్వులనుండి యాత్మపరితాపము నొకక్షణమ్ము మాన్ప నీ
నవ్వుమొగంబుఁ గాంచుచు మనంబునకూరటఁ గూర్తునన్న నో
పువ్వులరాణి! బాష్పకణపూరము కన్నుల నిండిపోవ, నే
నవ్విధి నిన్ను గాంచుటేక నెక్కడికోర్కెలు తీరుటక్కటా!
తావుల రూపునన్ జనులఁ దన్పెడి నిన్నొక తూపుగాఁ గొనన్
బూవిలుకాఁడు కోరియును ముండ్లకు భీతి జనింప, నేవిరో
పూవుల నేరిసిగ్గుపడి మోమును జూపఁగలేక రూపునే
వేవిడువన్ బురాణకథ వేలుగలోకమునందు నేర్పడెన్.

గాసపులుబోఁక మొక్క లల్లాడ ముండ్లు
గ్రుచ్చుకొని నీకు వెతలను గూర్చుచెంచ
హావిధీ! యేమనందు నాయాత్మనొక్క
ములికిచొచ్చుచు నెంతయుఁ గలఁచివైచు.

జలదమా! సుంత నాచెలువంపురోజాకుసుమముపైఁ గురువకమరలుమమ్మ!
భృంగమా! నాచిన్నిపూలరాణిని ముట్టుకొనక యించుక తప్పుకొఁగదమ్మ!
మారుతమ్మా! నాదుమానికంపునిధిని నల్లలాడింపక యరుగుమమ్మ!
ఆతపమ్మా! నాదు ననుఁగుపూవును వాడఁజేయక యల్లనఁ జెలఁగుమమ్మ!

వేఁడుచున్నాను వినుఁడు మీపాడువర్ష
ధారలకుఁ, బడఘాటికి, ఘాటి, కుష్ణ
తకు నొకప్పుడు నించుక తాళలేదు
ముద్దుగుల్కెడి నాచిన్నిపూవుకన్నె.

# తోటమాలీ!

శ్రీ రాయశర్మగారు

ఓరా! నేటియువప్రపంచవనవృక్షాగ్రమ్ము నందాక తా
మై రంగిల్లుచు వన్నెచిన్నెలుగ, శ్యామావల్లరీవ్యూహముల్
బారుల్ తీరిచి ప్రాకుచుండగ, వనీపఖ్యాతసంసారులా
వారల్ వాటినిస్వేచ్ఛగా బ్రతుకుచున్ వర్ధిల్లనీ రేమకో!

ఈకాంతారము తామె యేల్కొనుటచే, నీవల్లికాశ్రేణికిన్
ప్రాకాడేతరి స్వైరవృత్తిపనికే రాదాయె! ప్రారబ్ధమే
మో కానీ! వనపాలకుల్ లతను ప్రేమోపఘ్నమున్ సేరగా
నీకన్ వంకలద్రిప్పుచుండుదురు తామేప్రాజ్ఞులన్నట్లుగా!

ప్రాయపువల్లరుల్ వలపుబాహుల లేగొనసౌరుస్వర్ణశం
పాయుతకాంతులీన, మనసారకవుంగిట జేర్పనెంచుచున్
డాయుచు వృక్షరాజముల, నంతటిలో తమపుట్టిమున్గిన
ట్లీయమురాంగ్రుఁజూచి, మొటులేని మరల్తురు దానిలేఁగొనల్.

ఆలతికావతంసముల కంత స్వతంత్రములేదా! లేదుపో!
పాలకులౌవనీపులు కృపామతిహీనులరై నతక్క న
ట్లాలలితప్రశస్తలతలన్ తమయిచ్ఛకువచ్చినట్టి వృ
క్షాలకుప్రాకనీకయరికట్టుచు నర్హతనెట్లుపొందిరో!

పాదలయి కోరకించుచు, శుభోదయమొందియయేని పోలుగా
ని,దయయనేదిలేక, యిటునేర్చియునేరక వల్లికావళిన్
పకనున వృక్షరాజములపైన యథేచ్ఛను బ్రాకనీక, యా
పదలోనగూర్చి వీరువనపాలనమేడ్చిన లాభముండునే?

పాపము! పూర్వకర్మపరిపాకమునన్ లతయేదియైన సం
తాపముగూర్చు వృక్షపతిదాపున సేఁగినాయెనేని, యెం
తో,పరితప్తమాగదె? ఊరకనే లతికాస్వయంవరం
బాపుటచేతబాపుకొనునైతివె? యేమియునేని పాలకా?

—మధుకణములనుండి.

# హిందూ వితంతువు

శ్రీమతి పరిమి సీతామణి గారు

"నేను స్వభాషాపత్రికలయందు వితంతువులు భర్తలకొఱకై ప్రకటించు ప్రకటనలను జూచితిని" అని ఒకదినమున నొకఆచారవతియగు బ్రాహ్మణయువతి నాతోననెను. "వారిలో కొందరు తాముసౌందర్యవతులమని చెప్పికొనుచు, సౌందర్యవంతులగు కొందరు యువకులను వారివారిచిత్రములను పంపుమని యడుగుచున్నారు; మరికొందరు తమకాబోవు వరులు కట్నముగా కొంతసొమ్ము తమకిచ్చునటుల షరతు లేర్పరచుకొనుచున్నారు. అయ్యయో! హిందూదేశ మెంతటిస్థితికివచ్చుచున్నది? మేము ధర్మమునకుదూరమై మతి మాలినవారమగుచున్నారము; ఈరోజులలో మాకు మంచికిచెడ్డకు భేదము తెలియుటలేదు." అని ఆమెమొరపెట్టెను.

ప్రస్తుతకాలపు యువతులనుగూర్చియు వారినడతలనుగూర్చియు ఆమెమొరపెట్టి వెడలినతరువాత "హరియందలి పగచేతనేగదా ఈమెయిట్లనుచున్నది"యని నాలోనేసంచుక నవ్వుకొంటిని. వితంతువులు పునర్వివాహమాడ నభిలషించుచున్నారు. కాని వారుకూడ కట్నములను విధించుచున్నారు. పతులనుకొనుటకు మారుగా తమ్ముకొనగలిగినవారినేగాని యితరులను వివాహమాడ నొప్పుకొనుటలేదు. భర్తలకొరకై పత్రికలయందు ప్రకటించుట చాలనిషిద్ధమగుపద్ధతి. తమ్ము వివాహమాడతలచినవారిని కొంతకట్నముగా నిప్పటి వితంతువులడుగుటఁజూచి "యిదియు నొకమంచియుద్దేశమే" యని నేననుకొంటిని. పూర్వ కాలమున సహగమనమొనర్చి భర్తలననుసరించిన యువతులకును ప్రస్తుతకాలపు యువతుల కును ఎంతభేదమున్నది?.

"పూర్వకాలపు వితంతువులుపడెడికష్టములు ఇప్పటి వితంతువులకులేవని" ఆనా ఆచారవతులగు బ్రాహ్మణమిత్రములనవచ్చును. కాని వారికష్టములు ఇప్పటివారికికూడ ఉన్నవి. హిందూదేశము నాగరికస్థితికివచ్చినను పునర్వివాహమాడ నభిలషించువితంతు వులు చాలతక్కువ; పునర్వివాహితులైనవారు అంతకంటెను చాలతక్కువ. అయ్యో! హిందూదేశము భయంకరమైనస్థితిలో కాలముగడుపుచున్న లావణ్యవతులగువితంతువులతో నాటలాడుచున్నది. ప్రస్తుతము శారదాబిల్లు కష్టతరముగా తోచినను భావికాలమున వితంతువులసంఖ్యను చాలావరకు తగ్గించును. హిందూదేశమున స్త్రీలకళాశాలలో ప్రతి దొక్కతరగతియు వితంతువులతో నిండియుండును. ఒకదినమున నొకమహాశయుడు ఇంటర్ మీడియట్ తరగతిలోనికేగి "ఇందలి వితంతువులు లేచినిలువు"డనగా ఆరుగురులేచి నిలువ బడిరి. ఇందరువితంతువులజీవితము నిష్ప్రయోజనమగుట బహువిచారకరమగు నంశముకదా?

"ఎనిమిదిసంవత్సరముల బాలికనై యుండగా నాకువివాహమాయెను. నేనునాభర్త నొక్కసారిచూచియుంటిని. నాతొమ్మిదవయేట వితంతువునయితిని." అని ఒకదినమున నొక బాలిక నాతోననెను.

"వితంతువులేని గృహములేదు."

తరువాత కొలదిదినములకు నేనొకపత్రికలో హిందూవితంతువునుగురించి వ్రాసిన వ్యాసమును చదువుట తటస్థించినది. అందిట్లుండెను. "విచారముతో కాలముగడపెడి వితంతువులేని బ్రాహ్మణగృహము హిందూదేశములో లేదు. బాల్యమున వితంతువులైన వారు చెప్పతరముగాని దుఃఖముతో కాలముగడుపుచుందురు.

హిందూవితంతువుకు అన్యాయము జరుపబడినదనుటలో సందేహములేదు; కాని వారియంతటవారు కల్పించుకొనినవికూడ కొన్నిగలవు. వారికొరకై యేర్పరుపబడినకొన్ని దురాచారములకు వారెదురుతిరగక కర్మమనియు పూర్వజన్మపాపముచే నిట్టిగతికలిగినదనియు సహించి యూరకుందురు. వారు తమగతికేల యెదురుతిరుగరాదు? వారిపూర్వజన్మపాపముచే వచ్చినఆగతిని వారెట్లు జయించగలరు? హిందూవితంతువు స్థిరచిత్తముగలది. ఆమె అనవసరముగా ఇతరులతో జోక్యములేకుండ తనపనియేదో తానుచేసికొనును. ఆమెయేదియైన శుభకార్యములయందు కనపడినచో అపశకునమనిభావింతురు. ఆమెనీడ యెవరిమీదనైనను ముఖ్యముగా వధువుపై బడినచో చాలచెడ్డదని ఆచారవంతుల యభిప్రాయము. ఈ అభిప్రాయము హిందూక్రిస్టియనులయందుకూడ నున్నది. వారెప్పుడును వధువును శృంగారించుటకై వితంతువునునియమింపరు.

వితంతువు వివాహమాడుట ఇతరులకిష్టము లేకుండుటయేకాక ముఖ్యముగా ఆమెకే యిష్టముండదు. ఏలననగా భర్తను నిర్మలహృదయముతోను భక్తివిశ్వాసములతోను కొలుచుచుండుట యామెకు సహజమైయున్నది. మరియు వారొకనికి వివాహితలైన యెడల అతడు జీవించియున్నను మరణించినను తమకాతనితోడిదియగతియని యెంచెదరు. అదియునుగాక ఆమె తనభర్తను నిష్కళంకముగా ప్రేమించియున్నయెడల అతనియందలి ప్రేమచే జీవితకాలమంతయు వితంతువుగనుండిపోవును. తాను పునర్వివాహమొనరించుకొనినచో తనకుటుంబ మపఖ్యాతిపాలుచేసినదాననగుదునను భయముచే లజ్జావతియగు హిందూవితంతువు తనదుఃఖమయజీవితమును మౌనముగా గడపివైచును. పైనుదహరించిన కొన్నికొన్ని కారణములచే ఎక్కడనో కొందరుతప్ప చాలామందివితంతువులు పునర్వివాహితలగుటయరుదు.

భర్తనుగోల్పోయినయువతి గృహకృత్యములుచేయుదాసిగా చూడబడును. ఆమె సాధారణముగా స్వేచ్ఛగలిగియుండదు. తనజీవితము నొరులసహాయములేకుండ గడపుటకు శక్తియున్ననేగాని లేకున్ననామె యితరులకుబానిసయైయుండును. ప్రస్తుతకాలమున—పూర్వకాలపునిబంధనలు మారిపోవుచున్న ఈకాలమున—యువతియగువితంతువు యింటనిల్చుటకన్న చదువుకొనుటమేలనియెంచి చదువుకొనుచున్నది. మహాభారతమునం దీదిగువ నుదాహరించినవిషయములుగలవు.

“ముల్లోకములయందును స్వేచ్ఛగలస్త్రీయుండదు. బాల్యమున దండ్రియు, యౌవనమునఁ భర్తయు, వృద్ధాప్యమున కుమారుడును ఆమె సంరక్షకులై యుందురు. ఆమె జీవితము నం దెప్పుడును స్వేచ్ఛానువర్తినియయియుండదు.” నేటికాలపుస్త్రీలనుగురించి ఈ మాటలనుచెప్పవచ్చునా? లేదు. హిందూదేశపువితంతువుకూడ నిప్పు డీమాటల నొప్పుకొనదు. స్వేచ్ఛగానుండవలెనను నభిలాష యధికమైనకొలది ఆమె పునర్వివాహమాడుటకు కూడనొప్పుకొనదు.

వితంతువుయొక్క దుస్తులు సామాన్యములును అనాకర్షకములునై యుండును. భర్త చనిపోయిన పదునొకండవదినము నామెకు మూండనమొనర్పబడును. అతిక్రూరములగు శాస్త్రములు వితంతువులు శిరోజములనుంచుకొనగూడదని శాసించుచున్నవి. బాలికయగు వితంతువు తనశిరోజములనుంచుకొన నభిలషించినను ఆమె పెద్దదైనవెనుక వాటిని తీసివేయునప్పుడు చాలదుఃఖపడవలసివచ్చును. ఈశిరోజములను తీసివేయునాచారము బ్రాహ్మణులయందు తరుచుగనున్నది. కాని వారిలోకూడ కొందరు శిరోజములనుంచుకొనువారున్నారు. వితంతువు తనవేణియందు పుష్పములనుదురుమరాదు. భూషణములైనను ఎక్కడనో ఒక్కరుదప్ప ఎవ్వరునుధరించరు. ఆమె బొట్టుకూడ పెట్టుకొనరాదు. సామాన్యములగునిట్టి దుస్తులవలన వితంతువులు పడుచువారైనను విచారకరముగా వృద్ధులవలె కన్పట్టుచుందురు. నేను ఒకసారి “ఆర్ట్ ఎగ్జిభిషన్”నకేగి యొక హిందూవితంతువుయొక్క చిత్రమునుచూచుట తటస్థించినది. ఆమె తినబోడితలను తెల్లనిచీరతో కప్పుకొనియుండెను. నే నాచిత్రము నెన్నటికిని మరచిపోజాలను. ఏలననగా? ఆమెనయనములనుండి వెల్వడు విచారకరములగు చూడ్కులు నాహృదయమున బాగుగానాటుకొనెను. నాకు హిందూ వితంతువులయెడ చాలభక్తిగలదు. వారు పరిశుద్ధులనిపిలువబడు మిషనెరీలకంటెను పవిత్రహృదయులని తెలిసికొంటిని.

అదృష్టవశమున వితంతువు బిడ్డలుగలదియై (ముఖ్యముగా కుమారుడు) యుండినచో ఆమె చాలయదృష్టవతియని చెప్పవచ్చును. కుమారుడున్నంతకాల మామెకు లోటన్నమాటయుండదు. వృద్ధురాలైనను ఆమె తనయునియింటికి పరిపాలకురాలై యుండును. ఆమెకుమారునిగృహమే ఆమెగృహము. ఇతరదేశములకన్న హిందూదేశమునకుగల గొప్పసుగుణమిదియే. ఇతరదేశములందీయాచారములేదు. హిందూదేశస్థులు పెద్దలను మర్యాదచేయు నట్లితరదేశస్థులుచేయరు. ఇతరదేశస్థులకన్న హిందూదేశస్థులు తల్లినెక్కువ మర్యాదచేయుదురు. కొడు కెంత యున్నతపదవియందున్నను, యెంతపెద్దవాడైనను తల్లిమాటయే యాతనికి వేదాక్షరము. మనసునందామెయునిన ఇష్టములేకున్నను పైకిమాత్ర మామెపాదములకెరగి యామెనుపూజించుటకు సిద్ధముగానుండును. పుత్రులుగలవితంతువు నిజమైన యదృష్టవతియై కుమారుడు వివాహితుడైనను లేకున్నను నాతని

యింటికి అధికారిణియైయుండును. కాని యీపద్ధతియం దొకలోపమున్నది. అదియేదియనగా కఠినురాలును, నిరంకుశాధికారప్రభ్వియును, యువతులస్వభావమును తిరస్కరించునదియునగు మునలిఅత్తగారిచేతిలో క్రొత్తకోడలు చాలాకష్టపడవలసివచ్చును. కాని అత్తగారు కొన్ని కొన్నిసమయములయందు నవ్వుచు ఉత్సాహభరితహృదయముతోనుండుచోట కోడలికి ఈపద్ధతివలన కొంతనయమే.

కాని బిడ్డలులేకయే వితంతువులయ్యెడి పడుచువారిగతియేమి? వారిలో ఆచారవంతులగు కుటుంబమునకుచెందినవారు సహగమనముచేసినవారితో సమానులై ప్రపంచము నుండి బహిష్కరింపబడినవారివలె నుందురు. రానురాను ఆచారములు తక్కువయై పోవుచుండుటచే ఇప్పటికాలమున యౌవనవతులగు గొప్పయింటివితంతువులు చదువుకొన నభిలషించి డాక్టరులుగాను, నర్సులుగాను, ఉపాధ్యాయినులుగానుఉండి తమంతటతామే పొట్టపోషించుకొనుచున్నారు. కాని బీదవారో? వారు వంటకత్తెలుగను నీచమైనపనులు చేయు సేవకురాండ్రుగను, పెరుగు, పాలు, మిఠాయిమొదలగునవి విక్రయించువారుగను అగుట మనముచూచుచున్నాము.

ఇక నేబదియేండ్లకు హిందూదేశపువితంతువులు ప్రాతనిబంధనలువదలి క్రొత్తనాగరి వచ్చుటతోపాటు వారుకూడ పునర్వివాహమాడుటకు భయపడరని మనమునిశ్చయింప వచ్చును. ఒకయువతి తాజేయుచున్నది ధర్మమని తానుతలంచినప్పుడు దానిని నిరోధించుశాసనములచే హద్దుపెట్టరాదు. అది యుభయపక్షములవారికిని కీడుగల్గించును. వితంతువునకు చనిపోయినభర్తపై ప్రేమలేక వేరొకనిప్రేమించినయెడల వానిని పెండ్లిచేసుకొనగాఁడదా? పునర్వివాహమునకు శాస్త్రములుకూడ అనుమతియిచ్చుచున్నవి. పరాశరస్మృతియిట్లు చెప్పుచున్నది: "భర్తతప్పిపోయినను, మరణించినను, సన్యసించినను, నపుంసకుడయినను, ఈయైదిటియం దేదిసంభవించినను స్త్రీలకు పునర్వివాహాధికార మివ్వవచ్చును."

మృతుడగుభర్తయందు భక్తివిశ్వాసములుగలిగి పునర్వివాహమనిన నేవగించుయువతిని పునర్వివాహమునకై ప్రోత్సహించుట చాలదోషము. పశ్చిమదేశపుకాంత భర్తచని పోయినచో వితంతువుగానుండుట చాలఅరుదు. ఆమెత్వరలో పునర్వివాహమొనర్చుకొనును. కాని భారతరమణియొక్కప్రేమ నిష్కళంకమగుటచే ఆమెయెన్నటికిని పునర్వివాహమను మాట తలపెట్టదు. ఏలననగా మనదేశపుస్త్రీలు స్వార్థత్యాగమునకును, భక్తి, ప్రేమ సహానుభవములకును చాలప్రసిద్ధికెక్కియున్నారు. ఒకవేళ వితంతువు బిడ్డలతల్లియైనచో సవతితండ్రివలన నీతనిబిడ్డలకు గలుగబోవు నపాయమునుదలచి వివాహముమాట కలనైన దలంచదు.

—Times of India.

—శ్రీమతి పద్మినీ సత్యనాథన్ గారి వ్యాసమున కనువాదము.

# తిమ్మజగపతిరాజ! ధీరగుణభోజ!

కవికొండల వేంకటరావుగారు

ఇది వ్రాయడంలో పాఠకునకు వెంటనే చెప్పేస్తున్నా, స్థలం, స్థలపరిసరప్రాంతం; తిన్నగావెళ్లి ఎంత సేపుకావాలంటే అంత సేపూ ఆసీనుడై యాకలించవచ్చు. పాఠకుఁడు ప్రయాసపడనక్కఱలేదు. ప్రయత్నించనక్కఱలేదు. ఆగు. పాఠకా? ఆగు! వెల్లడిచేయుటంత సులభముగాదు. ఆగు పాఠకా! ఆగు.

నాయకుఁడు తేటతెల్లము. గిలకలపద్యంచదివినరోజులనుండి "పరగ పద్దెనిమిదిపరగణాలేలు తిమ్మజగపతిరాజ! ధీరగుణభోజ!" అని. కాని స్థల మగమ్యం. ఆపద్యంజదువుతూ బగ్గుండాపువ్వులా గిలకలతో కొడుతూవుంటే ఎదుట పచ్చబెల్లాలమీదదృష్టితప్ప మఱొకటుండేదికాదు. ఆగిలకలుచ్చుకొని కొండ వాగులు, చెఱువులు దాటేవాళ్ళం:—పొరుగూళ్ళనువుండే బంధుగులిళ్ళకు పంతుళ్ళుతీసికొనివెడుతూవుంటే- ఆవూళ్ళల్లో వొక్కటన్నా పద్దెనిమిదిపరగణాలకుసంబంధించిన వూరుందాఅంటే ఒక్కటీలేదు. ఒక్క మనిషీ తిమ్మజగపతిరాజూ పేరుగలాడులేడు. అయినప్పటికీ "పరగపద్దెనిమిదిపరగణాలేలు తిమ్మజగపతిరాజ! ధీరగుణభోజ!" అనిచదివి "జయాభిజయీభవ దిగ్విజయీభవ"తో ముగించి పువ్వులు బగ్గుండచల్లేపెయ్యడమే.

ఆసందర్భం ఎప్పటికేలాగు బోధపడిందో అదే యీగద్యప్రసంగము—రా! నాతోకూడా, రా! పాఠకా! రా!

ఓరోజున నాకు ముప్పైయ్యో ఏడువచ్చినాక ఓమార్గంగా ఓపల్లెటూరు వెళ్ళవలసివచ్చింది. అదివఱకూ వెళ్ళేవాణ్ణి ఆయూరుతఱుచుగా. కాని అప్పుడువెళ్ళింది వెల్లడిమార్గం. ఇప్పుడువెళ్ళింది రెండోకంటికితెలియకుండావెళ్ళిన మాఱుమూలతెన్ను. ఆదారిబట్టింది కొంత విశ్రాంతికోసం, కొంత వింతకోసం.

ఋతువు గ్రీష్మఋతువు. గ్రీష్మఋతువుఅయినా అకాలవర్షాలు మూడునాలుగువర్షాలుపడి భూమంతా పచ్చరాళ్ళతోఁ గసుర్పొడిచినట్టు పచ్చిక మొలిచివుంది. ఆపచ్చికచూడగా నాకో అచ్చెఱువుకలిగింది. "ఆకాశాన్నుంచి వానచినుకులు విడివిడిగా వేనవేలుపడడంఎందుకు? ఏనుగుతొండంతోలాగు ఏకధారగా పడకూడదా?" అని. అయితేం వెంటనేతట్టింది "భూమిమీద ఆవిలించుకొని ఆశకొద్దీ భూమిపగుళ్ళల్లోవేచి యుండే పచ్చికబీజాలు వేలకువేలు విడివిడిగావున్నప్పుడు అన్నింటికీ అన్నిచినుకులూగురిసి అన్నింటినీ తనియించి అన్నింటినీ ఫలోన్ముఖములుగాఁజేసి అన్నింటికీ ముక్తిగూరుద్దామనేపూహకొద్దీ అన్ని చిన్నిచిన్ని చినుకులు విడివిడిగాపడుతూవుంటాయి" అని ఆవెంటనేతట్టింది. ఆహా! భువిపై నాసించుకొనియున్న ప్రతీ వ్యక్తివిత్తనంవిషయమై భగవంతునికెంతదయ! ఎంతవిచింతనము!...............క్రొత్తగాగురిసిన ఆవానలకు గాడ్పులధూళివాడిపోయి మొక్కలు పసందుగావున్నాయి. మార్గం గరువుమార్గం. గరువు అడ్డుపడి వెళ్ళాలి. అలావెడుతూవుంటే గబుక్కున నాకోతట్టు మట్టిగోడలు మట్టిబురుజులు వాటిమీద మొలకలు మొఱడులు అన్నీకనిపించాయి. వెంటనే అనుకున్నాను "ఇక్కడో స్థలం పాడుపడింది. కన్నీళ్ళుగార్చఁ దగింది వుందిగదా" అని.

నాహృదయం అలాగే ఆపాడుపడినకోటయొక్క సంస్మృతిభారంతో గాల్చేడ్చుకుంటూ కొంతసేపటికి అనగా రాత్రికి నేవెళ్ళవలసినగ్రామం జేరుకుంది. ఆగ్రామంలో చూడాలనుకున్న చుట్టాలింటికివెళ్ళి, ఇచ్చిన నీళ్ళతో కాళ్ళుకడుక్కుని, వేసినపీటమీదకూర్చొని, అడిగినప్రశ్నకు కుశలంజెప్పేయింతలో చీకటిపడింది. నరే పెద్దవాళ్ళంతా అడవాళ్ళు ఆపనిమీద ఆపనిమీదవుండిపోగా నేను కుఱ్ఱవాళ్ళతో చనువుగా మాటలాడుతూ అరుగుమీద ఆసీనుడనైనాను. ఆపిల్లకాయలలో ఒకచిన్నమ్మాయి. ఎనిమిదితొమ్మిదేళ్ళుంటాయి. అది ఉత్తపెంకెపిల్ల. పెంకెపిల్లయినా నన్ను "అన్నయ్యా!" అనిపిలవడం అలవాటుచేత నాకాపిల్లపెంకెతనం పెంకెతనంగాతోచక ముద్దుగానేవుండేదప్పుడూ!—

"ఏదన్నా ఓచిన్నపాటపాడమ్మా!" అన్నాను. అంటే "గిలకలపద్యంపాడనా?" అంది. "పాడ" న్నాను. ఆనేసరికి "పరగపద్దెనిమిదిపరగణాలేలు తిమ్మజగపతిరాజ! ధీరగుణభోజ!" అనిపాడింది. నాకు స్మృతిఅపారమైపోయి "ఎవరమ్మా! తిమ్మజగపతిరాజా? ఎవరమ్మా! ధీరగుణభోజుఁడు?" అని ఆప్యాయంగా అడిగాను. అడిగితే ఆఅమ్మాయి "నివ్వే! నివ్వే! జయాభిజయధవ! దిగ్విజయధవ! పప్పుబెల్లాలెట్టు మఱి, పప్పుబెల్లాలెట్టు మఱి" అంది.

"నీవే, నీవే" అని చెల్లెలంటూంటే నాహృదయం ద్రవీభూతమైపోతూంది. జేబులోవున్న అటుకులు బెడిపప్పుపొట్లంతీసి ఆపిల్ల చేతికిస్తూ "నాకు మఱి పద్దెనిమిదిపరగణాలున్నాయా? రాజుకుండేకోటవుందా?" అని ప్రశ్నించాను. "లేకపోతే నేనిస్తాను నాపద్దెనిమిదిపరికిణీలు, నేను పేకతోఁగట్టినకోటా" అంది. నా కూఱికే కళ్ళమ్మటనీళ్ళు కాఱిపోతున్నాయి.

"నాచిట్టితల్లీ!" అని ఒకేమాటు దాన్ని దగ్గఱగాతీసుకోని చిన్నపిల్లలు గిలకలుపట్టేసరదాలో, కాలంభస్మీపటలంచేసినటువంటి చరిత్రాంశములు తట్టనిచ్చుకోరనుకున్నాను. అంతలో నావొళ్ళోకూర్చుని వున్నపిల్ల చటుక్కున లోపలికివెళ్ళి తిరిగివచ్చి "అన్నయ్యా! నాన్నే నేనుకోటకట్టిన పేకముక్కలన్నీ కోటపడగొట్టి మాయంచేసి ముక్కలన్నీ బొత్తుపెట్టుకుని పెట్లోపెట్టుకు తాళంవేసు కెక్కడికోవెళ్ళిపోయి నాడు. నాపరికిణీలన్నీయిమ్మంటే అమ్మేఁ నీకెక్కడున్నాయి యింకాపరికిణీలు? అన్నీ చిరిగిపోయినాయి! అన్నీ చిరిగిపోయినాయి! అంది. ఉంచే! దాచుంచే!" అంది.

"నాన్నషోకుచేస్తాడా? అమ్మ అబద్ధమాడుతుందా? వట్టిమాట. వట్టిమాట!" అంటూ ఏదో పరధ్యాన రూపకమైన శాంతిమోచనములో నిమగ్నుడనైపోయినాను నేను. హృదయం దృఢిమదాల్చింది. కనులు చిరునవ్వునవ్వేయి.

"ఇక్కడోస్థలం పాడుపడింది. కన్నీళ్ళుకార్చదగిందివుంది" అని అనుకున్నది. ఎక్కడో?

## వసంతోదయము

శ్రీమతి మండపాక సూర్యకాంతమ్మగారు

క్రొవ్విరులతేనె గుబగుబ్రగోలుచుండి
నిర్భరానందడోలల నూగులాడి
ఝుమ్మఝుమ్మనుఝంకృతుల్ ఝుమ్మరనగ
అళులఝంకృతిధ్వానంబు లతిశయించె
పంచమంబగుస్వరములు పలుపుకొనుచు
కోయికోయనికోయిలల్ గూయజొచ్చె
చెన్నుమీరంగ పుష్పాడిచీరగట్టి
చిగురుచెంగావిరయికను దగధరించి
శాఖహ సంబులందందు జూపికొనుచు
పల్లకినికేలధరియించు వాణిపగిది
కేలుదోయినిపీణెను గీలుగొలిపి
రాజహంసలరుతములు రాణనొప్ప
కలకలధ్వని కరతాళగతులనొప్ప
చెలువుకిరవగు చెంగల్వకోలనికెలన
కనులకింపగు పచ్చికకంబళమున
కవలుకవలుగ దిరుగు పికాళితోడ
గములుగములుగపారు కీరములతోడ
మలయమారుతమందందు మలసియాడ
ఉపవనేందిర నవవసంతోదయమున
చిగురువిలుకానిచెంతను జేర్చుకొనుచు
ప్రకృతిసంతయు సమ్మోహపడగజేసి
కమ్మపుష్పాడివాసనల్ ఘుమ్మురనగ
ముందువచ్చెడిపండగల్ బుద్ధిఁగనక
సదమలంబగు సౌందర్యమదముచేత
నాట్యమాడుచుండె నానందవశత.

## రుద్రాంబ

దేవగుప్తాపు వేంకటరమణమూర్తి పంతులుగారు

కాకతీయక్షమాకాంతుఁడౌ గణపతి
దేవుండుగన్నట్టి దేవివీవు!
సోమాంశవృద్ధికై సోమదేవిగర్భ
సంజాతవై నట్టి జానవీవు!
వీరభద్రాఖ్యవీరుఁడౌ భూమీశు
నర్మిలిగై కొన్న నాతివీవు!
అతిజాణలౌ ముమ్మడమ్మరుయ్యాంబలన్
ముదితలఁగన్నట్టి ముగ్ధవీవు!
అబలవై పుట్టి యాంధ్రవీరాహవమున
ఖడ్గమునుబట్టి శత్రులగదిమి రుద్రు
నపరరుద్రావతారమై యలరినట్టి
సాధ్వి! రుద్రాంబ! నీవుసచ్చరితవమ్మ!
అల్లారుముద్దుగా నాంధ్రవాఙ్మయశిల్ప
కళలుద్ధరించిన కలికివీవు!
అవనియందున ముప్పదారువత్సరములు
రాజ్యమేలిన మహారాజ్ఞివీవు!
రుద్రాంశచే నీమె రూఢిగాజనియించె
నన్నసన్నుతిగన్న యబలవీవు!
ఏకవీరాదేవి నేకచిత్తముతోడ
గొల్చుచునున్నట్టి కొమ్మవీవు!
నీపయింగుట్రలంబన్ను నీచులను బ్ర
తాపదేవ, పాండ్యేశుల తారుమారు
చేసిచెండాడి విజయంబుఁజెందినట్టి
సాధ్వి! రుద్రాంబ! నీవుసచ్చరితవమ్మ!

పడతి! నీదగుశౌర్యపటిమ దెల్పఁగజాలు
యుద్ధరంగంబున కురుకటొకటి!
మగువ! నీసుచరిత్రమహిమ దెల్పఁగజాలు
ఘనుడు విద్యానాథుగ్రంథమొకటి!
కాంత! నీవైదుష్యఘనత దెల్పఁగజాలు
చతురులౌ కవులప్రసంగమొకటి!
రమణి! నీదానధర్మముల దెల్పఁగజాలు
నతులోన్న తాలయవితతియొకటి!
వనిత! నీవై భవంబింతవరకుగూడ
కోటగిరి, అల్కపురి, నల్లగొండశాస
నములుగీర్తించుచుండు త్వన్నామకీర్తి
సాధ్వి! రుద్రాంబ! నీవుసచ్చరితవమ్మ!
పరరాజులొకటియై బడవచ్చిరనిజెప్ప
యూహించి తలయపుడూపియూపి
చావగామిగిలిన సైన్యాధిపతులకు
గరమునధైర్యమ్ము గరపిగరపి
ఖడ్గమ్ముదాలిచి గమకించియాహవ
సీమనువైరుల జెండిజెండి
దారుణాహవమందు దమినొందు వారునై
అరిసైన్యమంతయు నడలియడలి
అమ్మరో! మముగావుమయనుచు చేతు
లెత్త; దారుణసంగ్రామమెత్తివైచి
వైరులర్పించునట్టి కప్పములుగొన్న
సాధ్వి! రుద్రాంబ! నీవుసచ్చరితవమ్మ!

## వన్యవృత్తి

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

మ. సమయున్ మానసశత్రువర్గము మనస్స్థైర్యంబు చేకూరు, బం
ధములున్ రూపఱు, "నోంనమోభగవతే నారాయణా" యేతి మం
త్ర ముపాస్యంబగు, మానిచంద్రములతో సల్లాపమున్ సల్పు భా
గ్యముసిద్ధించును, వన్యవర్తనమె ధన్యంబౌఁబరీక్షింపఁగా॥

# అమెరికాదేశపుస్త్రీలు

కానూరు బాలా మల్లిఖార్జునశర్మగారు

పాఠకులారా! ఒక దేశముయొక్క ఔన్నత్యమునకుగాని, సౌభాగ్యమునకుగాని స్త్రీయే కారకురాలగుచున్నది. అట్టిస్త్రీకి రూపురేఖావిలాసములకుతోడు విద్యాధిక్యతకూడయున్నచో నిక చెప్పవలసిన దేమున్నది? బంగారమునకు సువాసనయబ్బినట్లే. ఇట్టితరి మనము మనస్త్రీలకెంతవరకు విద్య నేర్పుచున్నామో వారిపై యెట్టిఅధికారముల చలాయించుచున్నామో మనకందరకు తెలిసినవిషయమే. ఇందేమియు సంశయము లేదు. కాని మనము ఇతరులతో ముచ్చటించునపుడు "మేము పూర్వము చాలా ఔన్నత్యదశయందుండెడి వారము. నాగరికతయొక్క పుట్టుకకు మేమే కారకులము" అని యేమేమో చెప్పుచున్నాము. ఇట్టి వృథా ప్రసంగములవలన నేమియు లాభము లేదు. సోదరులారా! ఒకమారు కండ్లు తెరచి మనమిప్పుడేస్థితిలో నున్నామో గమనించుడు. ప్రపంచము మనపూర్వులయౌన్నత్యమును గమనించుటలేదు. మనప్రస్తుతస్థితిని జాగరూకతతో గమనించుచున్నది.

ఏదేశపుస్త్రీలు మూర్ఖులై, విద్యాహీనులై యుందురో ఏదేశపుస్త్రీలకు గౌరవము ప్రతిష్టయుండదో ఆదేశప్రజలు లక్షప్రయత్నములు చేసినను దేశమును బాగుపరుపజాలరు. ఈవిషయము లెంతవరకు సత్యములో తెల్పుటకే ప్రపంచౌన్నత్యమువహించి కొనియాడబడుచుండిన ఇట్టిదేశముయొక్క స్త్రీల జీవిత విధానమును నేను తెలియజేయుచున్నాను.

మొట్టమొదటిలో నేను మీకు విన్నవించుకొనునదేమనగా నేను పాశ్చాత్యనాగరికతాప్రియుడను గాను. నావ్యాసమును శ్రద్ధాయుక్తులై చదివినవారికీవిషయము స్పష్టముకాగలదు. నేను కేవలము సత్యప్రియుడను. ఎచ్చోటనైన నీతిదాయకములగువిషయములున్నచో దాని నామూలాగ్రముగా గ్రహించుట నావిధ్యుక్తధర్మముగా నెంచెదను. దోషములులేనిజాతి యొకటియుండదు. అమెరికాస్త్రీలమంచి నేగాక వారియందలిదోషములనుగూడా నాబుద్ధికిదోచినంతవరకు తమకు తెల్పుదును.

నేను భారతవర్షమునుండి అమెరికాకుబయలుదేరినపుడు, అమెరికాదేశపుస్త్రీలు తమభర్తలతో నెట్లు ప్రవర్తించునదియు, తమగృహకృత్యముల నెట్లు నిర్వర్తించుకొనునదియు, భార్యాభర్తల యొండొరులప్రవర్తన లెట్లుండునదియు తెలుసుకొనవలెననుకోరికయుండెడిది. కాని ఒకరోజులో నీవిషయములన్నియు గ్రహించుట దుస్సాధ్యముగదా!

కారణాంతరములచే నేను మనీలాలో కొంతకాలముండవలసివచ్చెను. మనీలా ఫిలిప్పైన్ ద్వీపములలో నొకగొప్పపట్టణము. ఈద్వీపములు అమెరికావారిస్వాధీనములో నున్నవి. అందుచే నిట చాలమంది యమెరికనులుగలరు. వారు వివిధవ్యాపారముల చేయుచున్నారు. నాయదృష్టవశమున నాకొక యమెరికాదేశీయునితో పరిచయముకలిగెను. ఆయనపేరు స్టార్క్. వారు మిూణాల్ శిక్షావిభాగములో హెడ్ గుమాస్తాగా ఉండిరి. వారికి వేదాంతమన్న యిష్టము మెండు. వారు నన్ను తమయింటివద్ద నేయుంచుకొని సంస్కృతము నభ్యసించుచుండిరి. ఒకపనివలన రెండులాభములు సమకూరునుగదాయని నేనందుకొప్పుకొని యచ్చటనే యుంటిని. ఆయనభార్య మంచివిద్యావంతురాలు. ఆమె యొకపాఠశాలలో ఉపాధ్యాయినిగా ఉండెను. నేనీభార్యాభర్తలయొక్క ప్రేమను బాగుగపరిశీలించితిని. ఇద్దరును తీరికదొరికినప్పుడెల్ల మంచిమంచి వ్యాసములుగల పుస్తకములపఠించుచు తమజీవితముయొక్క యానందము ననుభవించుచుందురు. నాకిదంతయు క్రొత్తగా కనబడుచుండెడిది. మనదేశమునందొకబాలునికి వివాహముచేయునపుడు, ఆబాలునికి తాను వివాహమాడుబాలిక విద్యావంతురాలా? మూర్ఖురాలా? నే నీమెతో నాజీవిత మెట్లుగడుపవలయు? నను విషయములు తెలియుటలేదు. ఇక బాలిక కన్నచో తాను వివాహమాడునది పురుషునా? స్త్రీనా? అనువిషయ

మింతకంటె గోచరించుటలేదు. ధనమే ప్రధానముగా నెంచి చేసికొనెడివివాహములు వధూవరులస్థితి నేగాక, దేశముయొక్క స్థితినిగూడ పాడుచేయుచున్నవి. అహో భారతదేశమా! నీకట్టిదుస్థితి ప్రాప్తించినది!

కొద్దిరోజులలో నాకును స్టాకుగారికిని దట్టమగుస్నేహము కుదిరెను. అతనిభార్య వేసవికాలములో శలవులగుటచే అమెరికాకుబయలుదేరెను. వెళ్లుచూ నాతో "దేవ్ జీ! ఇల్లునున్నూ, స్టాక్ గారినిన్నీ కనిపెట్టి యుండుడు" అనిచెప్పెను. పిదప ఇరువది అంటించినకవరుల నాచేతికిచ్చుచూ "ఈతారీఖుల ప్రకారము వీనిని భర్తకు అందచేయుచుండుడు" అనిచెప్పెను. ఆకవరులపై వేర్వేరుతారీఖులు వేయబడియుండెను. వాటిపై స్టాకుయొక్క చిరునామాకూడా వ్రాయబడియుండెను. ఆకవరులతీసికొని యామె చెప్పినప్రకారమే చేసితిని. ఆమె యిట్లాచరించుట కొకకారణముగలదు. మనీలానుండి యమెరికా వెళ్లుటకు ఒకనెలపట్టుచున్నది. తిరిగి వచ్చుట కొకనెలపట్టుచున్నది. అందుచే ఉత్తరము చేరుటకు రెండునెలలగుచున్నది. ఈరెండునెలలును స్టాక్ గారు భార్యావియోగముచే దిగులుచెందకుండుటకుగాను ఆమె యిట్లుచేసియుండును.

భర్తయెడల ప్రేమకిది యొకయుదాహరణము. ఇంకను నామిత్రునివలన అచటి యనేకులగు యమెరికను దంపతులతో నాకు పరిచయముగలిగెను. ఆకుటుంబములలోకూడ సతీపతుల యపారప్రేమనుజూచి యాశ్చర్యమునుపొందితిని. అందుకు కారణ మచటిస్త్రీలు విద్యావతులును, సుయోగ్యలునగుటయే.

నేను షికాగో చేరినతరువాత అనేకవిషయములుతిలకించుటకు సదుపాయములేర్పడినవి. అచటిస్త్రీలయొక్క ఆచారవ్యవహారములకనిపెట్టుటకు మంచియవకాశములు లభించెను. విద్యాలయమునచదివెడి సహాధ్యాయినీలతో ముచ్చటించెడి అవకాశములులభించినపుడు నాకు చాలఆనందముగానుండెడిది. అపారమగు విషయములుకూడ వారికి తెలియును. బాలురవలెనే తమవిద్యకొరకు ధనోపార్జన చేసికొనెడి బాలికలుకూడ గలరు. విద్యాలాభముకొరకు వా రనేకకష్టములసహించి పెద్దపెద్దపదవుల సంపాదించుచున్నారు.

నే నొకరోజున ఒకసహాధ్యాయినితో మిచిగన్ సరస్సునకు విహారార్థమరిగితిని. దారిలో మనేక విషయముల ముచ్చటించుచూ, సరస్సుయొడ్డునకుచేరి ఒకచోటకూర్చుంటిమి. ఆబాలిక పేరు "ఏడీకన్య." మాయిరువుర కీక్రిందిసంభాషణజరిగెను.

ఏడీ:—మంచిది. ఈవిద్యాలయమునుగూర్చి మీయభిప్రాయమేమి?

నేను:—మా దేశమునగూడ నిట్టివిద్యాలయములుండవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఏడీ:—(నవ్వుతూ) మీరందరు ప్రయత్నించిన తప్పకసమకూరును.

అందుకు నే నేమియు మాట్లాడలేదు. తిరిగి ఏడీ:—మీప్రాంతములలో బాలికావిద్యావిధాన మెట్లున్నది?

నేను:—ఇప్పుడిప్పుడే ఏకో ఒకవిద్యాలయమును పేరునకుమాత్రము స్థాపించియున్నారు.

ఏడీ:—(నిట్టూర్పునిగిడ్చి) స్త్రీలు అజ్ఞానాంధకారమునమునిగి విద్యావిహీనులైయున్న దేశమున్నదా యని సంశయముగల్గుచున్నది. మీవంటివారుండియు దేశమునకిట్టిదశయా? నాకు చాలావిచారముగానున్నది-యనెను. నేను చిత్రప్రతిమవలెనైపోతిని. నోట మాటవచ్చుటలేదు. లోచనము లశ్రుపూరితములయ్యెను. నేను నాదేశదుస్థితినిగూర్చి విచారించుచున్నసంగతి ఏడీకన్యగ్రహించి సంభాషణనుమార్చి "రేపు శనివారము. తాము నాతో వ్యాయామశాలకువచ్చెదరా? ఇచటిస్త్రీ లెట్లు వ్యాయామముచేయునదియు తాము జూడవచ్చును" అనెను. నేను చాలసంతోషముతో "మంచిది. అట్లే" అంటిని.

మరునాడు మేమిర్వురము వ్యాయామశాలచూచుటకువెళ్లితిమి. అది రెండుజాములవేళ. ఈవ్యాయామశాలవిద్యాలయమునకు దక్షిణముగా పదునైదుమైళ్ల దూరములోనుండును. ఈశాలయొక్క ఉపాధ్యాయిని నాకుచిరపరిచితురాలు. అందుచే నేనువెళ్లగనే చాలమర్యాదచేసి వ్యాయామశాలనంతటిని బాగుగ చూపిం

చెను. బాలురవ్యాయామమున కెట్టిసాధనములుగావలెనో వారికిగూడ అట్టిసాధనములేయుండెను. బాలికలు వ్యాయామముచేయుసమయమున పురుషులచటికి వెళ్లగూడదు. కాని ఉపాధ్యాయినియనుజ్ఞపై నేను కొంత దూరములోనుండి వారివ్యాయామమును తిలకించుచుంటిని. పదమూడు, పదునాల్గేండ్లబాలిక నాకెదురుగ నొక యినుపకడ్డిపై కసరతు చేయుచుండెను. అప్పుడు నామనసునందుద్భవించినభావముల వర్ణింపనలవిగాదు. ఏదేశ మందైతే స్త్రీలయొక్కయారోగ్యము; మానసిక, శారీరకబలములు పెంపొందింపబడుచున్నవో ఆదేశము ప్రపంచమునం దౌన్నత్యశిఖరము నధిష్టించుచున్నది. బాలికలమాట యటుంచుడు. ఇక అమెరికాస్త్రీల యొక్కవిషయమై యాలోచింతము.

అమెరికాదేశపుస్త్రీలు యెక్కువతీరుబడికలుగజేసికొని క్లబ్బులకువెళ్లుచుందురు. ఈక్లబ్బులలో వివాహితలు, అవివాహితలుగూడ కన్పడుచుందురు. ప్రతియొకపట్టణమందును స్త్రీల కొకక్లబ్బుయుండును. క్లబ్బులనగా సభాభవనములు లేక సమాజమందిరములు. ఇవి యనేకమైన ఉద్దేశ్యములతో నేర్పరుపబడుచున్నవి. షేక్స్పియరుక్లబ్బులో షేక్స్పియరుగ్రంథములనుమాత్రమే చదువుచూ వాటియొక్కభావముల చక్కగా శోధింతురు. బ్రౌనింగుక్లబ్బులో బ్రౌనింగుమహాకవియొక్కగ్రంథముల నన్వయమొనర్చుచుందురు. ఈవర్ణన యంతయు స్త్రీలక్లబ్బులనుగూర్చియేయని గమనింతురుగాక. వ్యాయామపుక్లబ్బులో స్త్రీలు వ్యాయామము చేయుచుందురు. మాతలక్లబ్బులో తల్లులు తమపిల్లలలాభముకొరకు అమెరికాదేశపు గొప్పగొప్పడాక్టర్లను రప్పించి వారిచే నుపన్యాసములనిప్పించుచుందురు. ఆయుపన్యాసములలో జబ్బులకు కారణములు, ఆహార వ్యవహారనియమములు, పసిపిల్లలపోషించుమార్గములు మొదలగువానినిగురించి చర్చించుచుందురు.

నేనొకసారి యొకక్లబ్బులో యుపన్యాసమివ్వవలసివచ్చెను. ఆక్లబ్బు ధనవంతులగుస్త్రీలది. ఉపన్యాస దినమున రెండువందలకంటె యెక్కువమంది స్త్రీలు హాజరైయుండిరి. ఉపన్యాసానంతరము నేను కొంచెము పనిమీద కొంతసేపటివరకు నచట నేయుంటిని. నే నేవరండాలోయుపన్యాసమిచ్చితినో దానికిదగ్గరనే బయటివైపుగదిలో నొకహోటలుయున్నట్లుతోచెను. అచటికేగి అక్కడయున్నప్రధానస్త్రీని "ఏమియిది? హోటలా?" యని ప్రశ్నించితిని. ఆమెజవాబిచ్చుచూ "అవును. ఇది మహిళాసమాజముద్వారా నేర్పరుప బడినది. బీదస్త్రీలు ఇందు కొద్దిఖర్చుతో ఆహారమునుగ్రహించుచున్నారు" అనెను. భోజన ముచితముగా నేలపెట్టకూడదు, పుణ్యమువచ్చునుగదాయని పాఠకులడుగవచ్చును. అమెరికాదేశీయులు మనవలె మూర్ఖులు గారు. నిజముగా మనము అర్థశాస్త్రప్రకారమాలోచించినచో ప్రతిసంవత్సరము పుణ్యక్షేత్రములసేవించు టలో మనమెన్నికోట్లరూపాయలు వృథా ఖర్చుచేయుచున్నామో స్పష్టముకాగలదు. మనదేశములో సోమ రులయొక్కయు, మూర్ఖులయొక్కయు సంఖ్య వృద్ధియగుచున్నది. పుణ్యక్షేత్రసేవకు వినియోగపరచుధన ముతో నేదైన నొకకర్మాగారమునుస్థాపించుచో కొన్నివేలమందిప్రజలకు జీవనాధారముకల్గుటయేగాక దేశ సేవాఫలముగూడలభించును. అమెరికనులకు సంపత్‌శాస్త్రము బాగుగా తెలిసియుండుటచే వారు సోమరుల యొక్కయు, ముష్టివాండ్రయొక్కయు సంఖ్యనువృద్ధిచేయుట మహాపాపముగానెంచెదరు.

ఇలోనాయే రాజ్యములోనున్న స్త్రీసమాజములకన్నిటికిని నొకప్రధానసభయున్నది. అసభకు ప్రతి సమాజపు ప్రతినిధియునువచ్చుచుండును. 1906-వ సంవత్సరము నవంబరునెలలో దానియొక్కవార్షికోత్సవము షికాగో విశ్వవిద్యాలయభవనమునజరిగెను. ఈసభయొక్కఉద్దేశ్యములను ఈక్రింద క్లుప్తముగా వివరించు చున్నాను.

౧—ఈసభయొక్క మొదటియుద్దేశ్యము విద్యాసంబంధమైనది. గ్రామగ్రామములందలి రాజకీయ పాఠశాలల కీసభ సహాయముచేయుచున్నది. అచటి విద్యావిధానమును పెంపొందించుటలో నీసభ యెక్కువ శ్రద్ధవహించుచున్నది. తమపిల్లలవిద్యకొరకు యేమాత్రమును ధనవ్యయముచేయలేనిబీదవారి కీసభ సహాయము

చేయుచున్నది. ఒకగ్రామములో పాఠశాలయుండి, మంచిగ్రంథాలయములేనిచో నట్టిచోట నొకగ్రంథాలయమును స్థాపించుటకుకూడ ఈసభ ప్రయత్నించుచుండును. 1905 నవంబరునుంచి 1906 నవంబరువరకు అనగా ఒకసంవత్సరములో ఈసభ 58 గ్రంథాలయముల స్థాపించియుండెను. ప్రతిజిల్లాలోను ఇట్టిసమాజములు యేర్పరుపబడెను. వాటివలన స్త్రీపురుషులు తమపిల్లల హితసాధనముల నాలోచించుకొనుచుందురు.

2—రెండవది దానవిషయము. దానపాత్రుడెవడు? దీనినిగురించి సభలో విచారించుచుండెదరు. దానమునుస్వీకరించువాడు సభవారివద్దకు పంపబడును. వానికి దానమిచ్చుట యుచితమనియు, నుపయోగమనియు సభవారికి తోచినచో నిచ్చెదరు. కాని మనభారతదేశమునందువలె లక్షలకొలదిధనమును దేవాలయములకుగాని, పండాలకుగాని వృథా ఖర్చుచేయరు. మనము కాశీ, ప్రయాగ మొదలగుప్రదేశములలో పండాలకిచ్చెడిధనము దేశక్షేమమునకు వినియోగపడుచున్నదా?

సభాప్రతినిధు లప్పుడప్పుడు రాజకీయఅనాథాలయములకును, కారాగారములకును వెళ్లి వారిస్థితిగతుల బాగుగ పరిశీలించుచుందురు. వారెప్పుడును "ఖైదీలను బాగుపరచుటఎట్లా" యని విచారించుచుందురు. ఖైదీలకొరకు పాఠశాలలేర్పరుపవలసిన యవసరముగుపడినచో వెంటనే పాఠశాలను నెలకొల్పప్రయత్నములు చేయుదురు. ఖైదీలయొక్క బంధువులెవరైనను దానపాత్రులైయుండినచో సభవారు వారికి సహాయము చేయుదురు.

ఎవరికైనను పనిగాని, ఉద్యోగముగానిదొరకనిచో సభవారే వారికేదైనపనిని వెదకి యొప్పచెప్పుదురు. పనిదొరకునవరకు వారిపోషణకు సభవారే సహాయముచేయుచుందురు.

3—మూడవయుద్దేశ్యము పిచ్చి, గ్రుడ్డి, కుంటివారలకు పాఠశాలలనేర్పరచుట. వారికి సౌకర్యముల కలుగజేయుట. వారలు నివసించుటకు మంచిగాలి వెలుతురుగలయిండ్లు ప్రతిపట్టణమందును కట్టబడియున్నవి. ఇట్టియిండ్లలోనుండువారికి సౌఖ్యముకొరకు వెదకుకొనవలసినయవసరములేదు. ఒక కుంటివాడున్నాడనుకొనుడు. వానికొరకు చిన్నచిన్నబండ్లుంచెదరు. ఆబండిలోకూర్చుండి మరనుత్రిప్పగనే బండి నడచుచుండును. ఈవిధముగా అమెరికాలో కుంటి గ్రుడ్డివారిజీవితములుకూడ ఆనందముగాగడచుచున్నవి. ఇట్టియిండ్లు షికాగోవిద్యాలయమునద్దకూడ చాలగలవు.

4—ఈసభయొక్క నాల్గవయుద్దేశ్యము సాహిత్యవిషయమై మంచిప్రచారముచేయుట. సభతరఫున చిన్నచిన్నపుస్తకము లచ్చువేయబడి యందరకు నుచితముగా పంచిపెట్టబడుచున్నవి. సభకుసంబంధించిన ప్రతిసమాజమువారును యీపుస్తకములు ప్రతిబాలునికి, ప్రతిబాలికకు అందునట్లేర్పాటుచేయుచున్నారు. ఇట్టిపుస్తకములలో బాలబాలికలకు రుచికరమగు నీతిదాయకమగు మంచికథలు వ్రాయబడియుండును. సందర్భములననుసరించి యచ్చటచ్చట చిత్రములుగూడ చిత్రింపబడియుండును.

5—అయిదవయుద్దేశ్యము కళాకౌశలములకౌన్నత్యమును చేకూర్చుట. రాజ్యమునందెక్కడెక్కడ శిల్పకళ నావశ్యకతగలదో యక్కడక్కడ నీసభతరఫున శిల్పకళాశాలలస్థాపించెదరు. శిల్పకళలపై యభిరుచిగల బాలబాలికలకు ధనసహాయమొనర్చుచు, వారి నాకళాశాలకుపంపి యుత్సాహవంతులజేయుచున్నారు.

అమెరికాదేశపుస్త్రీలందరును యీపైవిధముగ తమతమవిధ్యుక్తముల నెరవేర్చుచున్నారు. నేను కేవలము ఉదాహరణముకొరకు కొన్నివిషయములువ్రాసితిని. అమెరికాస్త్రీలయొక్కవిషయములన్నియు చదివిన పిదప వారితో మనభారతస్త్రీలనుపోల్చిచూచినచో మనస్త్రీలెంత యధోగతియందున్నది బాగుగ తెలియగలదు.

పట్టణములందలిస్త్రీలు తమజీవితమును దేశమునకును, జాతికిని యుపకారమొనర్చుటలో ఖర్చుచేయుచున్నవిషయము మనకు తెలిసియేయున్నది. ఇక పల్లెలందలిస్త్రీలనుగురించి తెలిసికొందము. నాకిట్టివిషయములు గమనించుటయనిన చాలసంతోషము. అందుచే వేసవిసెలవులలో షికాగోపరిసరముననున్న పల్లెలకు పోవుచుండెడి

# శ్రీవల్లభా!

మ. ఒకమా టీసకలంబు నీమయముగా నూహించుచు న్వేండి యొ
క్కొకమా టింతయు నీవుగావనుచు నేయుక్తిం బ్రశంసింప నే
రక వేదంబులుచిక్కువడ్డవనిసం బ్రవ్యక్తమైయుండు భా
వకుఁడై నీనిజరూపమిట్టిదన నెవ్వండోపు శ్రీవల్లభా!

మ. పవనుండై హిమధాముఁడై యనలుఁడై పానీయమై యాత్మయై
రవియై యంబరమై మహీవలయమై రమ్యాష్టమూర్తిక్రియన్
భవనాండంబులు లక్షణాంగములుగాఁ బుట్టించు సత్యద్భుతో
త్సవ లీలావిభవంబుతోడ భవదాజ్ఞాశక్తి శ్రీవల్లభా!

మ. సురల న్మర్త్యసమంబుగా మనుజులన్ శోభిల్ల బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్నేర్చుచు నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబునం
దరయన్ జీవుల నింద్రజాలములుగా నాడింతు శ్రీవల్లభా!

మ. రమణాన్ భక్తసమగ్రదర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠి తీ
ర్థము, తద్దివ్యదయావలోకనము తీర్థం బెన్నఁగా నిట్టి జం
గమతీర్థాంబుధి నోలలాడక వివేకభ్రష్టులై పోయి లో
కములోఁ దీర్థములంచు నేఱులు సారంగా నేల శ్రీవల్లభా!

మ. అనురాగంబున నిన్నుఁ జూచుఁ దలపోయుం జొక్కుఁ గాంక్షించు వ
ర్ణనసేయుం దమకించు సిగ్గువిరియుం బ్రార్థించు శోషించు నం
త నిధిధ్యాసముదాల్చుఁ దన్ను మఱచుం దా నీదశావస్థలం
దనరంగా మది నిన్నుఁ డక్కఁగొను సద్భక్తుండు శ్రీవల్లభా!

మ. అమరన్ భక్తులకెల్ల నీవహృదయంబై యుండుట న్వారి సౌ
ఖ్యము నీసౌఖ్యము వారికూర్మియు సమగ్రంబైన నీకూర్మి త
త్త్వము భావింపఁగ వారికోపము భవత్ప్రఖ్యాతరౌద్రప్రభా
వము దా వారలవాక్యనిర్ణయము నీవాక్యంబు శ్రీవల్లభా!

మ. సతివేడ్కం దనప్రాణవల్లభునితో సంయోగమర్థించుఁగా
కతనిం బ్రార్థనసేసి సొమ్ముగొనియో సఱ్ఱాకునే భక్తుఁ డీ
క్షితి నీభక్తియ వేఁడుఁగాక మఱినీశ్రీపాదము ల్గొల్చి కు
త్సితకామార్థము నొంకువేఁడుకొనునే చింతింప శ్రీవల్లభా!

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహావిస్పష్టమై యాత్మలో
పలభావించిన నీస్వరూపమె మహాప్రవ్యక్తమై దృష్టులం
దలఁపంజేకొనియున్న నీయచలితధ్యానంబునంజేసి తాఁ
గలనై నన్నివయోగి తన్ను జగముంగానందు శ్రీవల్లభా!

మ. భవదాకారమెకాంచు నీ స్తవకదంబశ్రేష్ఠసద్వాక్యముల్
చెవులారన్వినను నిన్నె చెప్పు మది దుశ్శీలేంద్రియాటోపదు
ర్వ్యవసాయాత్ములఁగాంచుచో వినెడిచో వర్ణించుచోఁ జీఁకునుం
జెవుఁడు మూఁగయునై చరించు మహి నీశీలుండు శ్రీవల్లభా!

మ. అతిలాలిత్యముగా సహర్నిశము నిన్నర్చింపఁగావచ్చు సు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెల్లకళలం బ్రౌఢుండుగావచ్చు వా
క్పతిగానై నను వచ్చుఁగాని మఱినీభక్తుండుగారాదు సు
స్థితిగా నీదయలేని మానవునకుం జింతింప శ్రీవల్లభా!

మ. ఎచ్చో నీపదభక్తుఁడుండు మదినింపెక్కుం బ్రయత్నంబుతో
నచ్చో నీవనిశంబునుండుదు త్వదీయధ్యానచిన్మూర్తులై
యచ్చో సన్మునులెల్లనుండుదురు మంత్రాంగాక్షరాయుక్తులై
యచ్చోఁ దీర్థములెల్లనుండు నిది వేదార్థంబు శ్రీవల్లభా!

మ. సత్యంబెప్పుడుఁదప్పఁడే మహి దురాచారుండుగాఁడేని యా
చిత్యం బేమఱఁడేని దుర్జనులగోష్ఠింబొందఁడే భక్తసాం
గత్యం బాదటఁబాయఁడేని మదసగ్రస్తుండుగాఁడేని నీ
భృత్యుం డాతఁడు మూఁడులోకములలోఁ బెంపొందు శ్రీవల్లభా!

మ. పెంపఁదల్లియగున్ రుజాపటలదుష్పీడావిధిక్షోభవా
రింపన్ వైద్యుఁడగుం గుమార్గవిధులం గ్రీడింపఁబోకుండ శి
క్షింపన్ బల్లిదుఁడైన తండ్రియగుచున్ శ్రీమంతుఁగా నెంతయున్
సంపద్వృద్ధియొనర్పు దాతయగు నీసద్భక్తి శ్రీవల్లభా!

మ. అరివీరప్రకరంబు భీకరతరంబై తాఁకుచో సింహాసిం
ధురశార్దూలమృగోరగాదిభయము ల్దోతెంచుచో ఘోరదు
స్తరసంసారవికారవేదనలు మీఁదం బర్వుచో వజ్రపం
జరమై చేకొని తన్ను నెత్తుకొను నీసద్భక్తి శ్రీవల్లభా!



శ్రీ వల్లభ రాయస్వామి వారు, వసంతపురము



(విద్యావతి, గానకళాకుశలయగు)

శ్రీమతి కె. సుబ్బమ్మగారు

వాఁడను. నాల్గయిదువందలజనసంఖ్యగల పల్లెలందుగూడ స్త్రీల సభాభవనముండెడిది. ఇట్టివాటినిచూచినప్పుడు చాలాయాశ్చర్యమునుపొందెడివాఁడను. ఆయాపల్లెలందలిస్త్రీ లాయాసభాభవనములకువెళ్లి తమతమకష్టముల చెప్పుకొనుచుండెడివారు. ఇక గానవాద్యములందరి యిండ్లయందునుగలవు. పియానావాద్యములేని గృహమే లేదు. పుస్తకములనుగూర్చి వేరుచెప్పబనిలేదు. ప్రతిగృహ మొకపుస్తకాలయమనియే చెప్పవచ్చును. బీదల యిండ్లయందుసైతము శ్రేష్ఠములగుగ్రంథములు కనీసము యేబది, అరువదియైనయుండియుండును. షేక్స్పియరు, జార్జియులిరియెట్, ఇమర్సన్ మొదలగు సాహిత్యోద్ధారకులజీవితములు ప్రతియమెరికనుఇంటియందును తప్పకయుండును. చివర కిక్కడిస్త్రీలయొక్క దోషములనుకూడ చెప్పవలసియున్నది.

అమెరికనుస్త్రీలకు హద్దుమీరినస్వాతంత్ర్యముగలదు. ఇది ప్రధానమగుదోషము. దీనిచే పెద్దపెద్ద పట్టణములందు వ్యభిచార మభివృద్ధిచెందుచున్నది. అమెరికాయందలి రెండవగొప్పదోషము "నాట్యమాడుట" (Dancing-Ball). ఇట్లు స్త్రీపురుషులుకలిసి నాట్యమాడుటలో నెవరైనను చెడుమార్గమునవలంబింపవచ్చును. అదియునుగాక ఇట్లొండొరులతో నాట్యమాడుట ప్రకృతినియమములకు విరుద్ధము. మనభారతదేశమునందు కూడ ఆంగ్లేయులు నాట్యమాడుచుండెదరు. కాని మనలనటకు రానివ్వకుండుటచే మనమట్టివాటిలో చిక్కుకొనలేదు. నాకు షికాగోలో నాల్గయిదుసారు లిట్టినాట్యములకేగుట తటస్థించెను. అయినను నేనేమియు నాట్యముచేయలేదు. ఒట్టి తమాషా చూచుచుండెడివాఁడను. ఒకసారి ఒకపిల్ల తనతో నాట్యమాడుటకు నన్ను చాలబలవంతముచేసెను. కాని నేను "నాట్య మాడవారిపని. మగవారికితగదు" అంటిని. పిల్ల కిలకిల నవ్వుచూ "అయితే ఈయువకులందరును మీదృష్టిలో స్త్రీలేనా?" అనెను. మరల నేను నవ్వుచూ "సరే, అది వేరుమాట" అంటిని. రెండుమూడునాట్యములయినపిదప తిరిగి యాపిల్ల నన్ను నాట్యమునకుపిలిచెను. "చేతకానివాడెట్లు నాట్యముచేయగలడు?" అని నేనంటిని. పిల్ల "మీకు నేను నేర్పెదను" అనెను. నేను నవ్వి "నేను చాలామందమతిని. ఏదియు త్వరగా గ్రహింపజాలను. నీ కీకష్టమెందులకు?" అంటిని.

పాఠకులారా! సరే, మీకు నేను చెప్పదలచినదేదో క్లుప్తముగా జెప్పితిని. ఇపుడు మీరు మనస్త్రీలకును, అమెరికాస్త్రీలకును—మనయిండ్లకును, వారియిండ్లకును—పోల్చిచూచిన చాలభేదముకన్పడును. మనయిండ్లు యిండ్లుకావు. మనస్త్రీలు మనమనోభావములను గ్రహింపజాలరు. మనము యేవిషయములనుగూర్చి పాఠశాలల లోను, కళాశాలలలోను చదివియుంటిమో వాటిపేర్లుమాత్రమైనను మనవారికి తెలిసియుండవు. భర్త బి.ఏ, భార్య నిరక్షరకుక్షి. అజ్ఞానమునందుపడియున్న మనతల్లులు, సోదరీలు మనయౌన్నత్యమున కెంతవరకుసహాయముచేయగల్గుదురో మీరే యాలోచించుకొనుడు. అనగా మనయర్ధశరీరము నిరర్థకమగుచున్నదన్నమాట. మనము మనకును, మనసంతానమునకును, మనదేశమునకును సహాయము చేయదలచినచో మనస్త్రీల విద్యాభివృద్ధికి తగునేర్పాట్లు చేయవలెను. అప్పుడు ప్రతిపనిని చేయగల్గుదుము. మన మేపద్ధతులనెరుగము. అన్నిపద్ధతులను నేర్చుకొనవలెను. ఏవిధము చేతనైనను స్త్రీవిద్యాభివృద్ధికి పాటుపడవలయును.

మనము చదివినవిషయములలో అమెరికాస్త్రీల చెడుగులనుగూడ విమర్శించితిమి. కాని మనము వారి మంచిపద్ధతులమాత్రమే గ్రహించవలెను. చెడుగుల గ్రహించుట సమంజసముకాదు. వారు పరోపకారమునం దెట్లు నిమగ్నులగుచున్నారో, కాలమును వారెంత విలువగలదిగతలచుచున్నారో, ఏవిధముగ వారు తమ సదుద్దేశ్యముల ప్రకారము మెలగుచున్నారో ఆప్రకారము మనభారతనారీమణులుగూడ మెలంగుదినము లెప్పుడువచ్చునోగదా! సంతోషముతోను, ధైర్యముతోను పనిచేయుట మనవిధి. భగవంతుడు మనభారతస్త్రీలకు విద్యాశీలములనొసంగి దేశమున కౌన్నత్యమును ప్రసాదించుగాక!

—స్వామి సత్యదేవుగారి హిందీవ్యాసమున కనువాదము.

# మాసింహ్వాం పండుగఅడావిడి

శ్రీమతి ప్రాతూరి లక్ష్మమ్మ గారు

సీతనాన్న ఒకరోజున "సీతయ్యా! నీకేమికావాలిపండుగకు" అన్నాడు "నాన్న! నాకు మంచిగౌనుకావాలి" అంది. "సరే, ప్రసన్న! నీకేమికావాలి" అన్నాడు. "నాకుమంచి సంగీతంపెట్టెకావాలి, నాన్నా!"అంది. ఇంతట్లోకే సింహ్వాంగబగబా పరుగెత్తుకొనివచ్చాడు. "చూడు, సింహాం! నీకుపండుగకుఏమికావాలిరా?"అన్నాడు బాబాయి మంచముమీదపడుకొని పేపరుచదువుకుంటూను. సింహ్వాం మంచినిదానంకలవాడు. అందరిపిల్లలలాగా పెంకిపట్టుపట్టడం, ఏడవడంఎరుగడు. చక్రములవలె తనకళ్లుత్రిప్పుకొనుచు నవ్వుతూ "బాబాయి! నాకు, నాకేం, మంచిబూట్లుతెచ్చిపెట్టవే"అన్నాడు. పేపరుచదువుచున్నసందట్లో సింహ్వాం మాటకి జవాబుచెప్పలేదు బాబాయి. సింహ్వాం మంచంఎక్కి బాబాయిపొట్టకుఆనుకొని పేపరుపైకెత్తి "పడకవేం బాబాయి! పడకమేవే,"అన్నాడు. బాబాయి సింహ్వాంపిలుపుతో స్వప్నంలోంచి జాగ్రత్తావస్థలోకవచ్చాడు. "ఏమిటిరా, సింహ్వాం!"అన్నాడు. "నేను పిలిస్తే పలుకవేం" అనియేడుపు మొదటిపాదం మూలుగు మొదలుపెట్టాడు సింహ్వాం. అప్పుడు బాబాయి "చూడు, సింహ్వాం! నీకు, పుస్తకాలుకావాలిట్రా?"అన్నాడు. "కాదు పో," అన్నాడు సింహ్వాంకోపంగా. బాబాయికియేమితోచలేదు. "ఆ, తెలిసిందిలే, జీడిమిఠాయి కాదు?" అన్నాడుబాబాయి. సింహ్వాం మూతిబిగించుకొని మాట్లాడలేదు. అప్పుడు సీత "బూట్లుకావాలిటనాన్న!"అంది. "ఓహో! బూట్లా? సరే! యేమాదరి? నాబూట్లంటివేనా?" అన్నాడు. ఇక సింహ్వాంముఖం వికసించింది. బాబాయి సింహ్వాన్నియెత్తుకు ముద్దుపెట్టుకున్నాడు. సింహ్వాం గబగబతల్లిదగ్గరకు పరిగెత్తుకువచ్చాడు. "బాబాయి నాకు బూట్లుకొంటానన్నాడు" అనిఅమ్మతో చెప్పాడు. అమ్మనవ్వింది. పిన్ని సింహ్వాంతోటి "మాకేమితెప్పిస్తావురా?"అంది. "ఏంకావాలిచెప్పు, బాబాయితో చెపుతాను త్వరగాచెప్పు, పిన్నీ!" అన్నాడు. "మాకు మంచిసేముబెత్తంకావాలి"అంది. సింహ్వాం గబగబవచ్చి "బాబాయి! పిన్నికి బెత్తంకావాలిట"అన్నాడు. బాబాయి నవ్వి "బెత్తం మీపిన్నికి యెందుకుకావాలో తెలుసునా?"అన్నాడు. "ఎందుకు బాబాయి!"అన్నాడుసింహ్వాం. "నిన్నుకొట్టడానికి"అన్నాడు. "అమ్మో! అవుతే, తేవద్దు బాబాయి!" అన్నాడుసింహ్వాం. ఇంతట్లోకేలక్కడికి పిన్ని వచ్చింది. "పిన్ని చెప్పిందితేకు, బాబాయి!" అనిసింహ్వాంపరిగెత్తాడు. "చూడండి, శకుంతలకి జడకుప్పెలుతేవాలి పండక్కి"అంది పిన్ని. "దానితరుపున నీవువకాల్తనామా యేమిటి?" అన్నాడు బాబాయి.

బెజవాడ బయలుదేరివెళ్లాడు. పండుగనాడుతీరదని పండుగరేపనగాన పిల్లలందరికి తలంటిసీళ్లుపోసిందివాళ్లమ్మ. బాబాయియెప్పుడువస్తాడుఅని యెదురుచూస్తున్నారు పిల్లలంతాను. బండిఆగింది. బాబాయి వచ్చాడు. పిల్లలంతాచుట్టేశారు. పిల్లల్నితప్పించుకుని సామానంతాయింట్లోపెట్టి, బండీకిరాయియిచ్చుట పిల్లలగోలలో బాబాయిమరచిపోయినా

బండివాడు అడిగిపుచ్చుకొని వెళ్ళిపోయినాడు. సీతక్కయ్య తండ్రి తెచ్చిన దవనం, మల్లెపువ్వులు, గులాబిపువ్వులు పట్టుకెళ్ళి తల్లిచేత జడవేయించుకొంది. శకుంతలకు జడకుప్పెలు వేసి పువ్వులుపెట్టింది వాళ్ళమ్మ. సీతక్కయ్య తనకు తెచ్చిన గౌనుతొడుక్కొని పండుగ ముస్తాబుపూర్తిచేసింది. సింహ్వంపిల్ల తయారయినాడు చిన్నపంట్లాం, కోటు, టోపిపెట్టుకొని, బాబాయి తెచ్చినబూట్లు తొడుక్కొని, ఒళ్లు తెలియని ఆనందంలో, అటుయిటుపరిగెత్తుకుంటూ ఆడుతున్నాడు. ప్రసన్నకుకోపంవచ్చి మూలుగుతున్నా, పెదనాన్న తెచ్చిన నాగరం చూచేటప్పటికి మూలుగెగిరిపోయి తనసంగీతంపెట్టిపాడుకుంటూ పిల్లలందరిలో కలిసింది. కేకలువేసుకుంటూ ఆడుతున్నారు. వీళ్ళఅడావిడికి అంతా వాకిట్లోకివచ్చారు. సింహ్వం పిన్నినిచూచి "బాబాయి నీవుచెప్పింది తేలోదోయి" అంటూ నవ్వుతుగంతులుపెట్టాడు. బాబాయి పిన్నివయిపుచూచినవ్వాడు. "దొంగసింహ్వమా! నీపనిపట్టిస్తానుండు" అని పిన్ని పట్టుకోపోయింది. సింహ్వంపిల్ల తప్పించుకు తండ్రివద్దకుపరిగెత్తి దాక్కుని "యికదా" అనినవ్వాడు.—పిన్ని ఓడిపోయింది.

* * * * *

నేను పండుగకు వెళ్ళవలెనని, మొన్నాళ్ళపట్టా అనుకోవడమేకాని యెప్పుడూ మావాళ్ళ యింటికివెళ్లడంపడలేదు. కాని యీసారి నేను తప్పక వెళదామని అనుకుంటూయుండగానే మాపాపాయిపుట్టినరోజుకు తప్పక అందరిని రావలసినదని యుత్తరంకూడా రావడంచేత, ప్రయాణం యీదఫా తప్పదుఅనుకున్నాను. మాకురటులు దూరమగుటచేత, మోటారు మావూరిమీదుగా వెళుతుందికనుక, మోటారులోనె అంతాప్రయాణంఅయాము. కొంత దూరంవెళ్లేటప్పటికి మోటారుచెడిపోయింది. నడిదోవలో, మిట్టమధ్యాన్నంయెండలోదిగి ఒకచెట్టునీడనుకూర్చున్నాము. కొంతసేపయినాక కారుబాగుచేసి ముందుస్త్రీలనుయెక్కించి కొంతదూరంతోసుకుంటూపరుగెత్తి తరువాత యెక్కారుప్రయాణీకులంతాను. మోటారు దిగి మాయింటికివెళ్లేటప్పటికి అందరు భోజనములుచేస్తూయున్నారు. భోజనాలసందడిలో కూడా మేమురాలేదని తల్చుకుంటూయున్నారు. మేముయింట్లోకివెళ్లేటప్పటికి మా పాపాయియెదురుగావచ్చింది. "ఇప్పటికేనా తీరినదాఅమ్మా! యిప్పుడొచ్చావుపాపం" అంటూ "అమ్మోయి!.........వచ్చారే"అని ఒకకేకవేసేటప్పటికి బొబ్బట్లువండుతూన్న మాబామ్మ "వచ్చారుఅమ్మా! మీరు రాలేదేఅనుకుంటూ యున్నాము" అంది. "పనితప్పించుకు ఫలహారంకు అందుకున్నారు"అని అప్పుడే భోజనమునకువచ్చిన స్నేహితురాలు కొంచెండెప్పింది. మోటారుకుదుపుకువొళ్ళంతా... యెండకు తలంతా మాడి యింటికి చేరేటప్పడికి యీవియ్యపురాలిదెప్పులు నాచెవిలోపడలేదు. ఎక్కడో ఒకపక్కను కూర్చుని సంతోషంగానేను వాళ్లతో భోజనంచేశాను. ఈఅడావిడి అయేటప్పటికి ఒంటిగంటదాటింది. అబ్బా! పండుగవచ్చిందంటే ఒంటిగంటభోజనం, సాయంత్రందాకాపనీనా?

"ముత్తయిదులువచ్చేవేళఅయింది, త్వరగా తెమలండీ" అన్న కేకలు సావిట్లోనుంచి వినపడ్డాయి. "పాపాయి! దబ్బునజడవేసుకున్నావా? నాన్నగారు కోప్పడుతూయున్నారు" అందివాళ్ల అమ్మ. ఆరోజు వీణపాటఅని కార్డులుపంపియుండుటచేత, చాలామందివస్తూ యున్నారు. మాపెద్దసావిడిఅంతా నిండారుజనం. పళ్లు, పసుపు, కుంకుమలు ఒకబల్లమీదను; గంధము, అత్తరు, పన్నీరు ఒకబల్లమీదను పెట్టాము.

మాయింట్లో పండుగబూచాడు సింహ్వంగబగబావచ్చి బల్లమీదపెట్టినపళ్లు యెత్తుకు పోదామని వచ్చి వెనక్కాలెనుంచున్నాడు. పండుతీద్దామనికాళ్లుయెత్తేటప్పటికి బల్లకదలి గంధపుగిన్నె వలికి సింహాముగానునిండాను, వంటినిండానుపడింది. "అమ్మో! సింహాం ఉండు. మీఅమ్మకనుక చూస్తే కొడుతుంది, పారిపోరా. నీముఖముచూపించకు" అందిసీత. ఒలక పోసినగంధము యెత్తుకునేఅడావిడిలో వాళ్లుఉండగానె ఒకపండుతీస్కుని పారిపోయాడు సింహ్వం.

వీణపాట చాలబాగుండుటచేత అంతా నిశ్శబ్దముగాకూర్చుని వింటూయున్నారు. ఇకపాటఅయిపోవచ్చింది. అప్పుడె పాటఆపారు. ఒకపక్కనుంచి అదేమిటి అదేమిటని అందరుచూస్తూన్నారు. ఏమిటాఅనినేనుచూసాను. మబ్బురంగుగాను, వంటినిండా గంధపు చారలతో ముఖమునకుఒక పంపరపనాసడిప్ప బోర్లించుకుని అందరిమీద పడుతూలేస్తూన్న మాసింహ్వప్పిల్లనుచూచి మేమంతా కడుపుబ్బేటట్టునవ్వాము. "ఇదేమిటిరా? సింహ్వము!" అనిఅమాంతంగాపట్టుకుని యెత్తుకుముద్దుపెట్టుకుంటూఅడిగాను. "అమ్మ నాముఖముచూస్తె గంధముపారపోసినందుకు కొడుతుందిఅని చీతక్కయ్య చెప్పింది, నాముఖము యీాటోపీలో పంపరపనాసడిప్పలోదాచుకున్నాను. ఇకనన్ను అమ్మకొట్టదుగా" అన్నాడు. వాడిముద్దులు మూటకట్టు కబుర్లకు, దెబ్బలుతప్పించుకునే నేర్పరితనముకు మేమంతానవ్వాము—పండుగ బూచాడువేషం వేసాడు సింహాంయివాళఅని పాపాయినవ్వింది. పండుగబూచాడుఅని అప్పడి నుంచి మాసింహాముకు ఒకపేరువచ్చింది.

## లాలి పాట

అధికార్ల సూర్యనారాయణ రావు గారు బి.ఎ., బి.యల్.,

పొందుగా విందుగా
చందమామ! చూడుమోయి
ముందుగానుమాసీత
కందమిమ్మ.
సుఖివుగా తీయగా
పులుగులేమ! పాడుమమ్మ
అలుకలేక మాబాల
కులుకనిమ్మ.

మెల్లగా హాయిగా
చల్లగాలి! వీచుమమ్మ
కళ్లనిండనిద్ర మా
పిల్లకిమ్మ.
చక్కగాకాచుడీ
చుక్కలార! రేయియెల్ల
జట్టుకట్టుమీతో మా
జానకమ్మ.



## గులాబ్జామూన్ చేయు విధము

శ్రీమతి కమలరత్నమ్మ గారు

ఒక్క సేరుఆవుపాలను మూడుపావులుగాఇంకునట్లుకాచవలయును. పాలుఅట్లు బాగాకాగినదే రెండు నిమ్మపండ్లరసమును ఆపాలలోపిండవలయును. నిమ్మపండ్లరసముపోసినపిమ్మట అరఘడియ నిప్పుపైనుంచి పాలనుదింపిపెట్టవలయును. అట్లుదింపినఅర్ధగంటలోపుగా పాలుబాగావిరిగినలాగు కనబడును. నీళ్ళువేరే పాలువేరేకనబడినప్పుడు సన్నటిబట్టలో వడియబోయవలయును. నీళ్ళంతయు పోయినవెనుక ఆబట్టనుపాలతో బాగాగట్టిగామూటకట్టి ఒకచీలపై వ్రేలాడకట్టవలయును. అట్లుకట్టినయెడల నీళ్ళంతయు బొత్తిగాపోయి పాలముద్దబాగా గట్టిగానుండును. అప్పుడు ఆముద్దనుతీసి కళాయిపాత్రలోవేయవలయును. ఈముద్దకే 'చన్నా' అని బంగాళీ, హిందీభాషలలో అందురు. పావుసేరుపాలకోవా గ్రహించవలయును. ఆపదార్థమును యింటివద్దనయినను చేయవచ్చును లేనియెడల బజారునుండైనను తెప్పించవచ్చును. ఇంటివద్దచేయుటకొంచెంప్రయాస. ఒకసేరుపాలను కలియపెట్టుతూ బాగాముద్దగాచిక్కబడేటట్లు కాచవలెను. చిక్కపడగా పడగా, మంచిపాలైనయెడల ఒక్కసేరుపాలకు పావుసేరుకోవా తేలును. ఈకోవాను బాగాగట్టిముద్దఅయిన పిమ్మట తీసికళాయిపాత్రలోనుండే 'చన్నా'తో కలుపవలయును. (ఒకసేరుపాలలోవేయించిన 'చన్నా'కు ఒక్కసేరుపాలలోవేసిన కోవాసరిపోవును.) ఈరెంటితో మితముగా మైదాపిండికలుపవలయును. ఈమూడు వస్తువులనన్ను సన్నరాతిమీదవేసి అన్నిఒక్కటిగాకలిసేటట్లు చేతితోమర్దించుతూ కలిపి, ముద్దనుతీసి కళాయిపాత్రలోనుంచవలయును. అర్ధసేరు తెల్లచక్కెర (పంచదార)లో కొంచెముగా నీళ్ళుచేర్చి లేతపాకముగాకాచి దింపిపెట్టుకొనవలెను. మంచినెయ్యిపావుసేరు కళాయిలోపోసి పొయిపయినపెట్టి కాచవలెను. నెయ్యిబాగాకాగినప్పుడు పైనచెప్పినట్లు సిద్ధముచేయించియుండు పాలముద్దలోనుంచి ఒకపెద్దవుసిరికాయంతపిండితీసి ఒక్కఅంగుళముపొడుగుగల వత్తిగాతీసి నేతియందువేయవలెను. ఈపదార్థము నేతిలో కరగిపోయినయెడల పాలముద్దలో మరికొంచెం మైదాపిండి కలుపవలయును. ఈలాగే ఆపాలముద్దనంతయున్ను ఒక్కఅంగుళప్రమాణం వత్తులనుగాచేసి నేతిలోవేయించి పైకితీయవలెను. కొంచంవేడి చల్లారిన పిదప ఒకసన్నటిగుండుసూదితో ఒక్కొక్క గులాబ్జామూన్‌కున్ను 4, 5 రంధ్రములుపొడచి సిద్ధపరచియుండు పాకములో వేయవలెను. పాకమునవేసిన అరగంటకంతయు భుజించుటకు సిద్ధముగానుండును. ఈ విధముగానే బంగాళాదేశమందును, ఉత్తరహిందూస్థానమందును ఈభక్ష్యముచేయుదురు. ఈఫలహారమందు మైదాకలుపునపుడు హెచ్చుతగ్గులులేకుండా కలుపవలయును. పిండిహెచ్చైనయెడల గులాబ్జామూన్ గట్టిపడి పాకము గులాబ్జామూన్‌లోపలయింకదు. కనుక ముందుఒక్కగులాబ్జామూన్ చేసి చూచినయెడల మైదాపిండి దిట్టము తెలియును.

## బ్రింజీపుకా

శ్రీమతి దిగుమర్తి బంగారమ్మ గారు

ఒక శేరు గోధుమనూక ఆ తైసరుపలె తగినంతనీరుతో కొంచెము పలుకువుంచి దింపివేయవలెను. పది లవంగాలు అరతులము ఏలకగింజలు కొంచెము దాసినచెక్క కొంచెము నీరువేసి మెత్తగనూరి ఒకపల్లెములో ఉంచవలెను. బంగాళాదుంపలు నాలుగైదు (సవాశేరు) ముక్కలుగ దకెబెట్టి పైచర్మముతీసివైచివుంచేది. ఒకదాకలో కొంచెము నెయ్యివేసి దానిలో జీడిపప్పు బింజ్ ఆకు కొంచెమున్నువేసి దానిలో ఈబంగాళా దుంపలతో పైనూరివుంచినది కలిపి సరిపోవునంత ఉప్పు ఆతాలింపులోవేసి కొంచెము నీపైవర ర్యాతదింపి ఆపై వుడికిన గోధుమనూకలో ఈదుంపలువేసి కొంచెము నెయ్యివేసి గరిటతో బాగుగా కలిపి కొంచెము పెగతగల నిచ్చిదింపిన మంచిసువాసనతో బ్రింజ్ పుక్కాతయారగును. ఈవిధముగానే గోధుమనూకకుబదులు సన్న బియ్యము (రాజనాలు)తో చేసిన బంగాళాదుంపల పలావగును.

## బియ్యపువడ

శ్రీమతి పి. సత్యవతమ్మ గారు

బియ్యముబాగా మెత్తగావిసరి నూకలేకుండ జల్లెడపట్టవలెను. అరసేరుపిండికి కొంచెముతక్కువగా మంచినీళ్ళుఒకగిన్నెలో పొయ్యిమీదపెట్టి బాగా తెర్లించవలెను. ఈవిసరినపిండిలో పచ్చిమిరపకాయ ముక్కలు, తగినవుప్పు, కొత్తిమిరి, కరివేపాకు, కొంచెమునూవులు, ముంతమామిడిపప్పు, కొద్దిగాశనగపప్పువేస్తే బాగుండును. ఇంగువకొద్దిగా, సోడావుప్పుకొంచెము, అన్ని ఈపిండిలోతయారుచేసి నీళ్ళలోకొద్దిగా చమురువేసి బాగా తెర్లినపుడు, యీపిండిఅందులోపోసి బాగాకలియబెట్టవలెను. ఉంకాయతురుమునుకూడ తప్పక చేర్చవలెను. గట్టిగా ముద్దగాఉండవలెను. నీళ్ళుజాస్తిగాఉన్నవనితోచినయెడల కొంచెముతీసి ఇవతలపెట్టవలెను. బాగాఉడికి కలిపినతరువాత ఇదిదింపి (క్రిందికి) ఆరబెట్టవలెను. బానలిలో తగినచమురుపోసి బాగాకాగినతరువాత, ఈపిండిని ముద్దగాతీసికొని వడమాదిరితట్టి చమురులోవిడవవలెను. వేడిగాతినిన బహు రుచిగావుండును.

## నిమ్మపండ్లమురబ్బా

శ్రీమతి గ్రైనేడి లక్ష్మీనరసమ్మ గారు

25 ప్రశస్తమగు నిమ్మపండ్లనుదెచ్చి చాకుతో కొంచెముపైచెక్కును తీయవలెను. పిమ్మటవానిని కళాయియుండుపాత్రలోవేసి $1\frac{1}{2}$ శేరు నీళ్ళుపోసి పొయ్యిమీదబెట్టి ఉడుకపెట్టవలెను. తర్వాతను $\frac{1}{4}$ వీశ పంచదార ఉడుకుచుండు నిమ్మకాయలలోవేసి బాగాఉడికినతరువాతను వడిచుకట్టుకొనవలయును. ఒక కళాయిపాత్రతో $\frac{1}{2}$ వీశపంచదారవేసి తగుమాత్రమునీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టి చక్కనిపాకముగాకేసికొని దానిలో ఈ ఉడికిననిమ్మపండ్లను వేయవలయును. దానిని గరిటెతో బాగాకలిపి, చల్లారినవెనుక ఏదయినా మంచియత్తరువు 5 బిందువులువేసి కలుపవలయును. ఇది ప్రతినిత్యము ఉదయము సేవించిన మంచిఆరోగ్యము కలుగజేయును.

## మనారపుండలు

శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మ గారు

కుంచెడు బియ్యమునకు 1 శేరు శనగపప్పు. కడిగినబియ్యము ఎండబోసి విసరవలెను. పప్పును ఎండ బెట్టివిసిరి రెండునుకలిపి ముద్దజేసి జంతికర్రలో చమురులోపిడవవలెను. అదివేగించి తీసి కుంచెడుబియ్యమునకు, శేరుపప్పునకు ఎత్తుడులేక 2 వీశలు పంచదారలేక బెల్లము పాకముపట్టి ఈపూసను రోటిలోవేసి పొట్టేసి పాకములోవేసి వెలకాయంత ఉండలు చేయవలెను.

## సత్యసంసేవనము

శ్రీమతి కోరప్రోలు వేంకటరంగమ్మగారు

పరమేశ్వరుఁడు సత్యస్వరూపి. సర్వభూతములును సత్యమునందుజనించి సత్యమునందు వర్తించి దానియందే లయించుచున్నవి. సత్యమనఁగా అబద్ధమాడకుండుటయేయని కొందరి యభిప్రాయము. సత్యము వాక్యస్వరూపముమాత్రమే కాదు. సత్యము సంకల్పస్వరూపము, బోధస్వరూపము, తపస్స్వరూపము, జ్ఞానస్వరూపము, విశాలస్వరూపము. పరిశుద్ధమగుదృష్టిచేఁ జూచిన మహనీయులకు సమస్తము సత్యస్వరూపముగనే గ్రాహ్యముకాఁగలదు. ఈసత్య బీజము నాధారముగనంగీకరించి ప్రకృతియనుతల్లి బ్రహ్మాది స్తంభపర్యంతమైన భూతజాలమును బుట్టించుచున్నది. ఈప్రకృతికి ప్రధానాంగములుమూఁడు. వానినే గుణత్రయమందురు. ఇవియే నాడీకాత్రయమగుచున్నవి. ఈమూఁడుగుణములందును ముఖ్యమైనది సాత్వికము. ఇది సత్యమునకు బహుసమీచీనముఁగ నున్నది. దీనిలక్షణములు ప్రకాశము, నిర్మలము, సుఖము, శాంతము మొదలైనవై యుండును. సత్యమనగా బలముగాన యిదియే త్రిగుణములకుప్రధానము. ఈగుణము ప్రకృతికాంతకుపూర్వాంగము. ఇకతక్కిన రెండుగుణములును మధ్యమాధమాంగములని చెప్పనొప్పుచున్నవి. క్రోధలోభమోహదంభాదిప్రవృత్తులకు మానసము లోఁబడినసమయమందు రజఃప్రవృత్తియని తెలియవలసియున్నది. భయాలస్యమాంద్యములకు వశమగుతరి తమఃప్రవృద్ధమని తెలియనగును. మనహృదయము నావరించి సంకుచితముగానొనర్చి సత్యస్వరూపావలోకననిరోధసాధనములగుక్రోధలోభప్రమాదమోహభ్రమలనుండి మనముతొలగు నుపాయము ముఖ్యముగా యోచించి యాచరించుట ప్రధానమైయున్నది. సత్యమనగా బలమని చెప్పియుంటిమి. మనోద్రఢిమ చేయూతగఁగొని ఓర్పుచేత క్రోధమును ధైర్యమునంజేసి లోభమోహాదులను పరిశుద్ధమగు సాత్వికమితాహారమువలన రోగోపద్రవాదులనుజయించి మించకున్న సత్యమునుదర్శించుభాగ్యము లభించునా? ఇట్టి భాగ్యమునొందుటయేగాక శ్లేష్మాదులజయించి వజ్రకాయులమై చిరంజీవులమై వర్ధిల్లగలము. దేహమునందు శైత్యము ప్రాబల్యముగానున్నతరి విశేషము కారముగను బులుసునంగలిసి యత్యుష్ణములగు పదార్థములఁ దినఁగోరుదుము. ఇది రాజసాహారము. ఉస్తికాకర మొదలగువస్తువులు శ్లేష్మమును గోసివేయును. శ్లేష్మము నాడులందు దట్టమైయుండుటచేతనే నిద్రాలస్యాదులకు బలము గలుగుచున్నది. సాత్వికపదార్థములఁ దెలిసికొని భుజించుటయు సత్యగోష్ఠినిజరించుటయు నలవరించుకొనినచో బుద్ధిమాంద్యముతొలంగి హృదయము వికాసవంతమగుచున్నది. హృదయవికాసమున సత్యసందర్శనము లభించుచున్నది. గుణావిర్భావకాలమున దానిస్వభావమును గ్రహించి విమర్శించితిమేని ఉత్తీర్ణులగుటకు ప్రబలమగు సహాకారియగుచున్నది. కావున ప్రతియాంధ్రసోదరులును సోదరీమణియు ముఖ్యముగ సాత్వికమితాహారమునకును, బ్రహ్మచర్యమునకును విశేషముగ బ్రయత్నించవలసియున్నది. దేశ

సౌభాగ్యనాశనమునకు ముఖ్యహేతువులగు కాఫీ, అమితాహారము, అశౌచము వీనినుండి తొలంగుటకు విధిగా ప్రయత్నించి సాధింప బ్రార్థితులు.

సీ. సత్యస్వరూపుఁడౌ సర్వేశుఁ జెందఁగ సహకారగుణమగు సత్యమరయ
సంకల్పవిజ్ఞానసహానబోధంబులు సత్యంబుచేతనే జరుగుచుండు
బ్రహ్మాదులకునైనఁ బ్రభవవినాశముల్ సత్యబీజంబున సంభవించు
క్రోధమాంద్యంబులు గొనగొని రాజసతామసంబులనుండి దాడివెడలు
సత్యమునుజెందగోరిన సకలజనులు సాత్త్వికాహారసేవనే జరుపవలయు
వ్యాధులనులోభమోహాదివర్తనముల జన్యముగజేయుచుండు రాజసపుభుక్తి.

# అరిమేదము*

సీరిపి ఆంజనేయులుగారు

(వనపాలకుని వగపు†)

క్షీరవారాశిఁ దనదు నపారదీప్తి
సౌమ్యగతినించు నాబాలచంద్రురీతి
నమరపాదపాంకురము నీవనితలంచి
పావనమొనర్తు వనుకొంటినావనంబు.
సాంద్రసంఛాదితాంబుభృచ్ఛయమునుండి
హిమమరీచినిఁదేర్చు సమీరమట్లు
ముండ్లతొడగులతోడి నీముసుఁగువీడ్చ
శ్రమమువాయఁబొసర్చితి సౌఖ్యవృత్తి.
గణుతిగల మకుటాగ్రభాగంబునందు
జాతిఁబొదిగించు స్వర్ణకారకునిమాడ్కి
గణ్యులువసింపఁదగిన చొక్కటపునేలఁ
బాదుకొల్పితినిన్నుఁ బ్రమోదగరిమ.
అమృతమునఁదృప్తిగొల్పి కాలాహిఁ బెనుప
నాత్మఁదమకంబుఁగను సమాయకునిపగిది,
నీదుసత్వరసంవృద్ధి నేగణించి
మధురజలసేచనమున నిన్మనుపఁగంటి.
వక్రగమనంబు దంష్ట్రిలవాలకంబు
బాలహారికినిసర్గమై పరఁగుకరణి,
ద్రుమానివంకర ముండులమేనితీరు
శైశవమునసీయందు విస్పష్టమయ్యె.

ఎపుడొ ఘూతుకవృత్తిఁ దీండ్రించుపులికి
శాంతభావంబుఁ గొల్పెడునరణి, నీదు
కంటకమ్ములనూడ్చి వంకరలఁదిద్ది,
నేనుసల్పినయత్నంబు నిష్ఫలంబు.
తుమ్మయిది; యౌనె సురపాదపమ్మటంచు
జగమునినుఁగాంచి వికటహాస్యమ్మొనర్ప,
నెప్పుడేని మహోన్నతి కెక్కెడంచు
నెంచి, నీభావిపరిణామ మెఱుఁగనుంటి.
ముదమునంబెంచి చేఁగొని ముద్దులాడు
పోషకునకు నాశీవిషప్రాజ్యఫలము
గలిని, నిన్నంత విహితసంగతినిఁ బెంతు
నంతయుహితోపకృతియ నాకగునుబోలు!
తావసించినతరువు నెంతయునుజీల్చు
బోయువలె, నావనమ్మున హాయిఁ బెరిఁగి,
హెచ్చినాకాళ్ళకేముప్పుదెచ్చి, సతత
ముపయశముఁగూర్చ లవము నెన్నాఁడవైతి.
ఒక్కనికిహానిఁగూర్చ, వేఱొకనరుండు
విషముహోయిఁ గొల్పునని భావింపనట్లు,
తెలిసి నీదుకృతఘ్నతాకలుషచరిత
విజ్ఞుఁ డెవ్వండు నిన్నింకవిశ్వసించు?

* వెలితుమ్మ   † అనుభూతయోగము = 21 వ, ఏప్రియల్ 1931.

# ఉగాది కానుక

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దర్ వారు

చ. అలతిపిసాళినవ్వుల హా
యల్ చిలికించునో లేతవెన్నెలల్
కలచెఱువేళ మల్లిక, పి
కప్రమదల్ చివురాకుపుక్కిలిం
తల నొగరా కషాయితసు
ధామధురోక్తుల నాలపింతురో,
సలలితమయ్యె ఈప్రకృతి
సర్వము నీశుభదర్శనమ్మునన్.

గీ. ఎంత గహనాతికోమల మీవినూత్న
వర్షపున్ తొలిదర్శనవైభవమ్ము
భావనావ్యక్తచిత్రణాపారవశ్య
మలసరమణీయకవిహృదయమ్మువోలె.

చ. హిమవతి మంచుపూవుల ర
చించిన మేలిముసుంగుద్రోసి, సం
తమసముతో నిరీక్షణవ్య
థాజనితోష్ణము చిమ్మరేగ పా
పము! సగమైనదోర్చుకొని
బాలకిసాలయతల్పసీమలన్
దమరిచి నీకృతజ్ఞత వె
లార్పుము నూతనవర్షశోభచే.

గీ. మూగవోయినజీవితమును కదల్చి
ప్రేమవెలయించి దారిద్ర్యవికృతమైన
గుండె బలిసేయ నరచేత గొన్నదిపుడు
ఆర్యవంశము ప్రేమభిక్షార్థి నీకు.

# అవతరణము

జనమంచి కామేశ్వరరావుగారు

బంగరుతీగవోలె
ఒయ్యారినోరపై
పర్వుపర్వున గాఢనిశీథిని
కారుమబ్బులగగనపటలిని
ఈదుకుంటూవచ్చుచుండే
ప్రసవకోమలి సూర్యకిరణం
బామె ఎవతెయో!—

ఆమెరుపుదూపు
పై నుండి జారుసరికి
మేలుకొనె నామూతపడిన
కళ్లు; పులకరించె నాపుల్లువడిన
ఒళ్లు; పాటపాడె నామూగవోయిన
గళము; ఆటలాడె నామన్ను తిన్న బ్రతుకు.—

ఆమెముఖము
చిరునవ్వు ప్రసవాలనెలవు,
కనులలో వలపువరదల
గుండ్రనిసుళ్లుగలవు,
చెక్కిళ్లపై చలువవెన్నెల
సెలయేళ్లు కలిసిపారు.—



ఛాయాచిత్రగ్రహణమున గారిడీ

(ఈఛాయాచిత్రము విచిత్రమైన కమీరాతో తీయబడినది. ఒకేతల రెండుతల లుగా కనిపించునట్లు చేయుట ఆకమీరాపై చిత్ర్యము.)




చంద్రావళి ఫిలుమునందలి స్త్రీపాత్ర

# ఆంగీరస

హరి రాధాకృష్ణమూర్తిగారు

౧

ఏరసవాహినిన్ గడఁగి యింపొనరింపగనుంటివో క్రొ? ఆం
గీరస! నీవు వత్తువని గేహములం దెలిక్రొత్తనున్న మిం
పారఘటించి గుమ్మముల కందముగాఁ బసుపుంమిళ్లించి మా
వారలు కాచియుండిరి నివాళులలో దయఁజేసి తెల్పవే.

౨

మంత్రాంగంబుననున్న వాడు బుధు డమ్మాన్యుండెపో రాజు దు
స్తంత్రంబున్ దొరలింప నీకెట నవశ్యంబింతయున్ గానమే
తంత్రాత్మ్యం డితరేతరంబులను నిస్తంద్రుండుగానుండినన్;
తంత్రీనాద మదేదిసల్పుదువో యాదార్థ్యంబుగాఁ బల్కుమా.

౩

లోకములకు కల్యాణము
ప్రాకటముగఁ జేతువనుచుఁ బాడుచు నిన్నే
లోకైకమిత్రముగ వా
రాకాంక్షించెదరు యశమునందెదో లేదో.

౪

తొలకరిలేజివుళ్ల ఘనతోరణముల్ ఘటియించి, గండుకో
యిలలను గాపుగానునచి మెక్కుడుబత్తిని నీకు వేపపూ
తల నలమావిపిండెల ముదంబున నీయగ నుంచినారు మా
లలనలు పొందనేర్తువె విలాసమునన్ దనివొంది యబ్దమా!

౫

హైందవాచారసరణి మా కతిథివైన
నీదుశీలంబు నెమకగాఁ గాదుమాకు
స్వాగతం బిడువారు మాపణతులెల్ల
అంగిరసవర్షమా? కొనియాదరింపు.

# మూఢాంబల పెంపకము

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

కలదుమూఢాంబ గుడిసెలోఁ గాఁపురంబు,
ఎందఱో బిడ్డలు, తెలియ దేమి సేయ,
కూరలేనికూడింత చేకూర్చి, పెట్టి
చిదుకఁగొట్టి, వారలఁ గొంతనిదురఁబుచ్చు.

ఆమె యవస్థను వర్ణింపఁగలమా? పాప మామెనుజూచిన జాలివైచును. కాని పిల్లల మాటయేమి? వారియూహ లెట్లుండునో మనము కనిపెట్టఁగలమా? వారేల నిదురఁగాంచ బలవంతపెట్టఁబడుచుండిరో యెఱుఁగుదురా? వారినడిగిన, "మాయల్లరిసహింపలేక మా యమ్మ బలవంతముగా మమ్ము నిదురఁగొట్టు"నందురు.

ఇట్టిస్థితి పెక్కుగృహములలోఁ గననగును. తండ్రి దినమంతయుఁగష్టపడి పనిచేసి డస్సి యింటికివచ్చును. పెద్దపిల్లలు చదువులలోనో పేకాటలోనో మునిఁగియుందురు. విసుగుఁదలతోనున్న తండ్రి యింటిలో నెట్టియల్లరియు వినఁబడఁగూడదని పెండ్లామున కాజ్ఞయిచ్చును. అల్లరియడఁగకున్న "ఇటిలో సంతగోలయేమి? వెంటనే నోళ్ళునొక్కుదవా, లేదా?" అనిభార్యపైఁగోపపడును. అప్పుడు గృహిణియేమిచేయును? అనుకొనుచున్న చిన్నపిల్లల నిద్దఱ నాటమాన్పించి నిదురఁగొట్టును.

పిల్లలయాటలు పాడుచేయుటకుఁ దండ్రులేకాక, తల్లులుకూడ నొకప్పుడు కారణమై యుందురు. ఒకనారీమణిగలదు. ఆమెకు మువ్వురుబిడ్డలు. వారుమిక్కిలి యేఁపుగాఁ బెరుఁగుచు ముద్దువచ్చుచున్నారు. భోజనములైనతర్వాత నామె యొకకుర్చీలోఁగూర్చుండి చదువుకొనును. చదువునంతసేపామె యొకకన్ను పుస్తకముమీఁదను, మఱియొకకన్ను పిల్లలమీఁదనువైచియుంచును. ధ్వని చెవినిబడినంతనే పుస్తకముక్రిందఁబడును, పిల్లలవీఁపులమీఁదఁ బిడుకచఱుపులుకురియును. అట్లు నాలుగుబాఁదులుబాఁది యామె వారినినిదురఁబుచ్చి, మరల నిశ్చలముగాఁ జదువుకొనుచుండును. ఇది నేను ప్రత్యక్షముగాఁజూచితిని.

సాధారణముగా బిడ్డలు తల్లిదండ్రులకువిధేయులై యేమిచేయుమన్న నదిచేయుదురు. కాని వారికిష్టముకానిపనులపట్ల, వారుకోపగించి విసుగుకొని మఱిచేయుదురు. తల్లిదండ్రులు తాత్కాలికముగాఁ దమసుఖమునుజూచుకొని పిల్లలనట్లు నిరోధింతురేకాని, యానిరోధము వలన ఆబిడ్డల యభివృద్ధి కెట్టిభంగముకలుగునో యూహింపరు. ప్రతినిమిషమును బిల్లల యభిరుచులఁగనిపెట్టి వారిని నీతివిశారదులనుగాఁజేయుట పితరులధర్మము.

మునుపటి మూఢాంబలెందఱో బాలకుల నట్లుశిక్షించి పాడుచేయువారు. అట్టిశిక్షచే బాలకులు ఋజువర్తనము, యోజనము మున్నగునవిచెడి వక్రగాములై, బుద్ధిహీనులై చెడిపోవుచుండెడివారు. ఒకమంచిగుణముగాని, చెడ్డగుణముగాని యలవడినచోఁ జిరకాలము వఱకు వారు దానినివిడువలేరు. కావునఁ బ్రతిజననియు, జనకుఁడును బిడ్డలశిక్షవిషయములోఁ జాలజాగ్రత్తవహింపవలెను.




## శిరోజములు

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

సౌందర్యము ఆభరణములు, దుస్తులు, చర్మముయొక్క కాంతి, కనుముక్కు తీరు, శిరోజములు వీని యొక్క అమరిక. మొదటిరెండును కృత్రిమములు. తుదిమూడును దైవదత్తములు. సాధనసంపత్తిచే దైవదత్తములగు వీనికికూడ మానవజాతి మెఱుగులు దిద్దజాలియున్నది. శిరోజములవిషయమున పరిశీలింతము. ఇవి ఎంతనునువుగను, నల్లగను, నిడివిగను, దట్టముగనుఉన్న అంత సౌందర్యమునిచ్చును, అంతటి ఆరోగ్యమును సూచించును. అనేకకారణములచే శిరోజముల ఈగుణములకు వ్యతిక్రమమువేర్పడుచున్నది. వానినుండి కాపాడుటకు క్రింద సులభమైనక్రియలు ఈయబడుచున్నవి. ఇందు కొన్ని చదువరులకు చిరపరిచితములైనవే. అతిపరిచయమువలన వానివిలువనుగూర్చి చదువరులుశంకింతురని భయముకలుగుచున్నది. శ్రద్ధతో అనుసరించుచో అనుభవముచేవారు వీనిమంచినిగ్రహింపగలరు. శిరోజములను బాగుగాపెంచుకొనవలయునను తీవ్రకాంక్షవలన పలువురు పత్రికలయందలిప్రకటనలనుచూచి ఆతైలములను తెప్పించి వాడుచున్నారు. ఈతైలములు సాధారణముగ వ్యాపారదృష్టితో చేయబడినవగుట ఒకకంపెనీవారికంటె మఱియొకరు చౌకధరకువిక్రయించుటకు మినరల్ ఆయిల్సు, బొగ్గుతారునుండితీసిన అత్తరుచేర్చి తయారుచేయుచున్నారు. వీనిఉపయోగమున కోరబడిన కేశవృద్ధి కలుగకపోగా కంటిజబ్బులుమాత్రము వచ్చుచున్నవి. ఈబూటకపుతలనూనెలకులోడు మనవారు సబ్బులఉపయోగమునుకూడ హెచ్చించినారు. చౌడుగలియు అసబ్బులఉపయోగమువలన శిరమున ఉష్ణముజేరి వెంట్రుకలు నెరియుచున్నవి, ఊడిపోవుచున్నవి, చిట్లుచున్నవి, రాగిరంగునుపొందుచున్నవి. కాబట్టి బజారులలోవిక్రయించు తలనూనెలు, సబ్బులు శిరోజములసౌందర్యమునుకోరువారు పరాకునగూడ ఉపయోగించరాదు. మనవారు తలరుద్దుకొనుటకు సాధారణముగా కుంకుడుకాయలనుపయోగింతురు. కుంకుడుకాయలో చర్మదోషములనుపోకార్చు కార్బాలిక్ యాసిడ్ ఉన్నదికాని అది ఉష్ణవీర్యముకలదియగుటచే శిరోజములకు అంతమంచిదికాదు. తలచమురుపోవుటకు కుంకుడుకాయలకుబదులు సీకరేని, బెండ, గోగు, తుత్తురుబెండ, ముత్తవపులగము మొదలగు జిగటపదార్థముండుఓషధులను లేదా మినపపిండి, పెసరపిండి, మెంతులపిండి మొదలగువానిని ఉపయోగించవలెను. వీనిఉపయోగమువలన శిరోజములనంటియుండుచమురు సీదాగాపోదు. వెంట్రుకలు నునుపెక్కి మిసమిసలాడుచు మృదువుగ పట్టుకుచ్చువలెనగును. ఉసిరికపరుగు ఊట తలకు అప్పుడప్పుడురుద్దుకొనుట వెంట్రుకలకు చాలమంచిది. సూర్యరశ్మిలో తలకట్టు తరుచుగాఆర్చుకొనుటమంచిది. వీపు సూర్యునివైపుంచి అప్పుడప్పుడు తలను ఇటుఅటుత్రిప్పుచుండవలెను. స్నానముచేసి తలఆర్చుకొని క్రిందచెప్పిన ధూపద్రవ్యములతో పొగవైచుకొని పిమ్మట వెంటనే చమురురాచుకొనుటమంచిది.

తఱుచుగా అనగా దినమునకు అయిదారుసార్లు తలదువ్వుకొనుట, ఉష్ణోదకముతో శిరస్నానముచేయుట ప్రశస్తముకాదు. లోహము శరీరమునతగ్గినచో తలనెరయునుగాన లోహసేవనము, లోహము విస్తారముగాగల గుంటకలగర ఉసిరికాయ తానికాయ మొదలగువానిసేవనము చేయవలయును. ఆముదము శిరోజములకు రసాయనమువలెపనిచేయును. ఈవిషయము మనపెద్దలకు బాగుగ తెలియును. కావుననే శిశువులకు మాడపట్టున వారు ముల్లాగ్గ ఆముదముపెట్టుచుందురు. దీనివలన వారివెంట్రుకలు నిగనిగలాడుచు శీఘ్రగతిని పెరుగును. సాధారణములగు పైనచెప్పినమెలుకువలను క్రిందనిచ్చుచున్న సూక్ష్మక్రియలను జాగరూకతతో నవలంబించి చదువరులు తమశిరోజములసౌందర్యమును పెంచి పోషించుకొందురుగాకయని కోరెదను.

శిరోభ్యంగము కేశవృద్ధిని, కపాలము ఇంద్రియములు వీటికితృప్తినికలుగజేయును.

—అష్టాంగసంగ్రహము.

ఉష్ణోదకముచే శిరస్నానముజేసిన వెంట్రుకలకు నేత్రములకు దౌర్బల్యముగలుగును.

—అష్టాంగహృదయము.

కేశములు అలంకరించుటవలన శరీర పుష్టి, పుణ్యము, ఆయువు, పరిశుద్ధత, సౌందర్యముకలుగును.

ప్రతినిత్యము తలను నూనెతో తడుపుకొనువారికి వెంట్రుకలురాలిపోవు. మూలములు దృఢమైపడి దీర్ఘముగాను నల్లగాను అగుచున్నవి. —చరక.

దువ్వెనచే జుట్టును దువ్వుట జుట్టుకు మేలుచేయును. దుమ్ము, పేను, మురికివీనిని పోగొట్టును. కావున జుట్టుదువ్వుకొనవలయు.

—యోగరత్నాకరము.

శిలారసము, జటామాంసి, చందనము, వస, లవంగపట్ట, సాంబ్రాణి, మిరియములు, గుగ్గిలము, వేమిలియాకలు, మడ్డిపాలు, తెల్లగుగ్గిలము, అగరుచెక్క—వీటిలో దొరికినవి చూర్ణముచేసి ధూపము వేసికొనుచుండవలయును.

కొబ్బరినూనె తలకురాసిన వెంట్రుకలకు బలముచేయును. మృదుత్వమిచ్చును. వెంట్రుకలనెదుగజేయును. వలుపెక్కజేయును. పుండుమాన్పును.

మెంతిఆకునునూరి వెంట్రుకలకుకట్టిన వాటికి మృదుత్వమువచ్చును.

రేగుచెట్టు: దీనియాకులునూరి తలరుద్దుకొని స్నానముచేయుచుండిన వెంట్రుకలెదుగును. మృదుత్వముగనుండి పగులకయుండును.

సీకాయచెట్టు: దీనికాయలపులుసుతో తలరుద్దుకొనిన వెంట్రుకలకు మృదుత్వమును బలమునుఇచ్చును.

గోరింటాకు: తలవెంట్రుకలకుకట్టిన అవిఆరోగ్యముగ బలముగలేచును.

చామంతిపుష్పధారణ శిరోజములకు వృద్ధినిచ్చును.

నువ్వులనూనెలో జీడిగింజలువేసికాచినది తలకు పూసికొనిన వెంట్రుకలకు నలుపును బలమును యిచ్చును. పేలనుజంపును.

నీలిమందు: దీనిని నూనెలోగలిపిపూసిన వెంట్రుకలుఎదుగును.

మంచినూనె నీలిమందు గలిపిరాయ
తలవెంట్రుకలు పెరుగు తరుణులకును
వాసననూనెచే పండును వెంట్రుకల్
గానదీని రాయకండిరెపుడు.

—వైరాగిచిట్కాలు.

ఇనపచిట్టెము, త్రిఫలములు, సుగంధిపాల వీటిని కల్కముచేసి దీనికి 4 గింతలు నువ్వులనూనె నూనెకు 4 గింతలు గుంటగలగరాకు రసముబోసి తైలపక్వముగ కాచి వడియగట్టి మర్దనచేసిన అకాలపలితకేశములు నల్లనగుటయగాక దురద యింద్రలుప్తము యివి నశించు. —శారంగధర.

చేదుపొట్లఆకురసమును 3 దినములు మస్తకమునకు లేపనముజేసిన ఇంద్రలుప్తమునశించును.

ఇంద్రలుప్తమునకు ఏనుగుదంతమునునిప్పులోకాల్చియామసిని నువ్వులనూనెలోకలిపి లేపనముశ్రేష్ఠము.

తెల్లవెంట్రుకలకు మేకకొమ్ము నిప్పులోకాల్చియామసిని నువ్వులనూనెలో కలిపి లేపనము చేయవలయును.

నువ్వులఆకులకషాయము వెంట్రుకలకు లేపనముగా వాడబడుచున్నది. అది వెంట్రుకలను పెంచుననియు, నలుపు చేయుననియు చెప్పబడుచున్నది.

జాజికాయలనుండితీసినచమురు తలకురాచుకొను పొమేడులతో కలిపి ఉపయోగించుటవలన కేశములు చురుకుగా పెరుగును.

దాసానిపుష్పము, సీమనూనె (Olive Oil)లోగాని కొబ్బరినూనెలోగాని నూనెకు సమం పువ్వులరసము పోసి నీరిగురువరకుగాచి తలకుపూసుకొనుచుండిన వెంట్రుక లెదుగును. వలిపి పేనుకొరికినచోట దినముకు 2, 3 మార్లు రుద్దుచుండిన నది మాని వెంట్రుకలు తిరుగ వచ్చును.

వెల్లుల్లి: పీటిపాట్లు (పొప్పర) కాల్చినమసిలో సీమనూనె (Olive Oil) కలిపి తలకుపట్టించిన వెంట్రుకలు విస్తారముగబుట్టును. వృద్ధియగును. వెంట్రుకలు వంకరగా (నుబ్బునుబ్బుగా) నుండును. పీటిచమురు వెంట్రుకలకుపూయుచుండిన నెరియకుండును. పీటిరసము తలకుపూసిన పేలు చచ్చును.

మహాంబ్రము, 2 వంటలఘాటుసారాయిలో కలిపి వెంట్రుకలకుపూసిన నలుపెక్కును. తలకుపూసిన వెంట్రుక లెదుగకేయును.

కానుగపట్ట, చిత్రమూలము, జాజిఆకులు, వాడగన్నేరువేళ్ళు వీటిని కల్కముచేసి దీనికి 4 గింతలు నువ్వులనూనె, కల్కము చక్కగా పాకముగుటకై నూనెకు 4 గింతలునీళ్ళుపోసి తైలపక్వముగ కాచి వెంట్రుకలురాలి పురుగులుజనించి గులగులాడుచుండెడివాటికి లేపనము చేసిన మరలవెంట్రుకలు మొలుచును. —శారంగధర.

. పొన్న (Myrtle) పండ్లనుండి చక్కనిచమురు తీయబడుచున్నది. ఈచమురు వెంట్రుకలపాదులను గట్టిపఱచును. వానినిబాగుగ ఎదుగునట్లుచేయును.

గుంటకలగరస్వరసము ఆముదముతో కలిపి వెంట్రుకలు నలుపెక్కుటకు ఉపయోగింపబడుచున్నది.

గుంటకలగరఆకు స్వరసమును నువ్వులనూనె లేక టెంకాయనూనెతో తలకురాచుకొనిన కురులు నలుపెక్కును. వృద్ధినొందును.

గుంటకలగరరసము, త్రిఫలములు, నల్లకలువ, సంబరేణి, మందారము వీనియందు నూనెబోసి పాకముగాచి యభ్యంగవార్థ ముపయోగించిన బట్టతల నశించి వెంట్రుకలు దట్టముగాను గుంపుగాను పెరుగును.

గురివెందగింజలను పొడిచేసి గుంటకలగరరసమున భావనచేసి యందు తైలమునుపోసి యీతైలమున ఏలకులు, జటామాంసి, దేవదారు వీనిని కల్కముగాచేసి పచనముచేసి అభ్యంగవార్థ ముపయోగించిన వెంట్రుకలు దట్టముగ పెరుగును.

భృంగరాజతైలము. నీలివేళ్లనుదంచి కషాయము కాచి యందు చంద్రవిత్తులచూర్ణమును నీలివేళ్లు, నల్లతుమికి, యష్టిమధుకము అనువానికల్కమును ప్రస్థము గుంటకలగరాకురసమును ప్రస్థము నూనెనుగలిపి తైలపక్వముగకాచి వెంట్రుకలకు లేపనముచేసిన ఇంద్రలుప్తమునారించి వెంట్రుకలు తుమ్మెదలవలెనల్లనై మృదువుగనుండునట్లుచేయును.

కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, నీలియాకు, లోహచూర్ణము, వీటిని సమభాగములుగ గుంటగలగరాకురసము గోమూత్రము వీటిచే చక్కగమర్దించి వెంట్రుకలకు లేపనముచేసిన అకాలమున నెరసినవెంట్రుకలు నల్లనగును.

లోహచూర్ణము, గుంటకలగరాకు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, రేగటిమన్ను వీటిని సమభాగములుగా చూర్ణముచేసి చెఱుకురసమున 30 దినములు నానబెట్టి అకాలమున నెరసిన వెంట్రుకలకు లేపనముచేసిన నవి నల్లనగును.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి యన్. వి. సరళాదేవి గారు

బారుబారు—
ఏమిబారు?
చీమలబారు—
ఏమిచీమ?
గండుచీమ—
ఏమిగండు?
పిల్లిగండు—
ఏమిపిల్లి?
నల్లపిల్లి—
ఏమినల్ల?
కారునల్ల—
ఏమికారు?
పట్టుకారు—
ఏమిపట్టు?
నారపట్టు—
ఏమినార?
గోగునార—
ఏమిగోగు?
పుల్లగోగు—
ఏమిపుల్ల?
కాకిపుల్ల—
ఏమికాకి?
జెముడుకాకి?
ఏమిజెముడు?
బొమ్మజెముడు—
ఏమిబొమ్మ?
పిండిబొమ్మ—
ఏమిపిండి?
వరిపిండి—
ఏమివరి?
మొక్కవరి—
ఏమిమొక్క?
జొన్నమొక్క—
ఏమిజొన్న?
పచ్చజొన్న—
ఏమిపచ్చ?
పైరుపచ్చ—
ఏమిపైరు?
మంచిపైరు—
ఏమిమంచి?
కామంచి—
ఏమికామ?
గొడుగుకామ—
ఏమిగొడుగు?
ఆకుగొడుగు—
ఏమిఆకు?
తాటిఆకు—
ఏమితాడి?
పోతుతాడి—
ఏమిపోతు?
మేకపోతు—
ఏమిమేక?
కంచిమేక—
ఏమికంచి?
శివకంచి—

౨. పాటలు

## ఒప్పులకుప్ప

శ్రీమతి పట్టిసపు రామేశ్వరమ్మ గారు

ఒప్పులకుప్పా
ఒయ్యారిభామా
సన్నబియ్యం
చాయపప్పు
చిన్నమువ్వ
సన్నగాజు
కొబ్బరికుడక
బెల్లపచ్చు
గూట్లోరూపాయి, నీమగడుసిపాయి.

## తాత్త

చింతచెట్టుతొర్రలోన చిలుకయున్నది
చిలకముక్కు జూచి తాత చిర్రుమన్నాడు
చిలకముక్కు తాతముక్కు పోలికున్నదీ
తాతకిదాన్ని చూస్తే కోపం తాళకున్నది
"చిలకయేమిచేసినది తాత! ఊరుకో."

## జోలపాట

కొండలలో వున్నారు మండలేశ్వరులూ
కట్టించె మీనాయన కనకమండపమూ
చేయించె పెదనాయన వెండిగోపురమూ
పరపించె చినాయన సల్లన్నిరాళ్లూ
చూడబోయి మీతాత సున్నమేయించె
అనుగబోయి మీయవ్వ అరుగులేయించె
మల్లిబోయి మీయత్త మల్లెవనమేసె
త్రవ్వించె మీమామ కొల్లోనుబావి
పోసెనూ మీయక్క వనములకునీళ్లు
వేసెనూ మీయమ్మ పూలజడసీకూ.
శ్రీరామజయరామ సీతాభిరామ
పల్లెపల్లెలరామ పల్లెలలోరామా
పల్లెలలోవుండేటి పట్టాభిరామా
వాడవాడలరామ వాడలలోరామా
వాడలలోతిరిగేటి వైకుంఠరామా
అడవిఅడవులరామ అడవులలోరామా
అడవులలోదిరిగేటి అయోధ్యరామా
కొండకొండలరామ కొండలలోరామా
కొండలలోదిరిగేటి కోదండరామా.
తిరుపతీవెంకయ్య తిట్టబోకయ్యా
వడ్డికాసులతోను వస్తున్నామయ్యా

శ్రీమతి చావలి బంగారమ్మగారు

"ఛీ!ఛీ, వెధవ, నోరుముయ్యి, చితగగొట్టేను."
"తాత! నువ్వులేచినన్ను గొట్టవస్తేను,
తాత! నీదుగూనునడ్డి దడదడమంటుంది
ఆ, తాత! ఓ, తాత! తాతోయి, తాత్త!"

శ్రీమతి పాకల రత్నమాలగారు

బంగారుకోనేటిలో స్నానములుచేసీ
అయ్యా! నీముడుపులు తెస్తున్నామయ్యా.
గోపాలకృష్ణమ్మ యెవ్వరల్లాడూ?
గోవులనుకాచేటి గొల్లలల్లాడూ.
చిన్నమాఅబ్బాయి యెవ్వరల్లాడూ?
మేనత్తకాంతమ్మ మేనల్లుడమ్మా.
అందరీమామల్లు చందమామల్లూ
అబ్బాయి మామల్లు మండలాధిపులూ.
రాజుల్లయిండ్లలో రత్నాలవెలుగూ
మాచిన్నఅబ్బాయి మాకండ్లవెలుగూ.
అందరీచేతిలో హంసల్లగిలుక
అబ్బాయిచేతిదీ రత్నాలగిలుక.
చిన్నమాఅబ్బాయి యెందాడబోయె?
బాలలతోగూడకొని బంతాడబోయె.
పందిట్లోఅబ్బాయి పారాడుచుండ
పనసపండని అంత పరుగులెత్తేరు
దొడ్లోనుఅబ్బాయి దోగాడుచుండ
దొండపండనిఅంత దోసిల్లొగ్గేరు
హాయిహాయిహాయి ఆపదలుకాయి
చిన్నిపాపలగాయి శ్రీరంగశాయి!

3. కథలు

# లోనిగుట్టు పెరుమాళ్ల కెఱుక

కల్యాణసింగ్ గారు

ఏటేట లేక అయిదేళ్ళకొకసారి వైష్ణవగురువులంటూ శిష్యులయిళ్ళకు దయచేస్తూఉంటారు. శిష్యులచేత పెరుమాళ్ళకైంకర్యాలు చేయిస్తారు. వాళ్ళయిళ్ళలో విందులారగిస్తారు. తరువాత గురుదక్షిణలు పుచ్చుకుంటారు. కొత్తశిష్యులకు ఉపదేశాలు చక్రాంకితాలు ఇస్తూంటారు. ఇంకాచాలాపనులు చేస్తుంటారు లెండి, అదంతా మనకెందుకు? కథకానిద్దాం. ఒకగ్రామానికి ఒకానొకప్పుడు ఒక వైష్ణవగురువుగారు వేంచేశారు. రోజు కొకరియింటివంతున శిష్యులయిళ్ళలో విందారగిస్తున్నారు. ఒకనాడొకబీదశిష్యుడువంతు వచ్చింది. బీదవాళ్ళకదా బంధువుల్ని బాగా ఆదరించడం, గురువుగారిని మనసా పూజించడమున్నూ! గురువుగారు వచ్చినారుగదా అని ఆబీదశిష్యుడు పెండ్లాం మెళ్ళోపుస్తె అమ్మేసి గురువుగారికి చిట్టిగారెలు వగయిరాలతో భోజనంపెట్టినాడు. అందరిశిష్యులకంటె ఆశిష్యుడిఆదరణే బాగా ఉండడంచేత గురువుగారక్కడే కొద్దిరోజులు మకాంవేయదలుచుకున్నారు. రెండోరోజున శిష్యుడు ఎలాగోగడపినాడు. మూడోరోజున ఏమి అమ్మిగడపడం? గురువుగారు ఏటికిస్నానానికి వెళ్ళినారు. భోజనంవేళకు సిద్ధంఅవుతారు. శిష్యుడికి ఏమీ తోచిందికాదు. ఏమిమార్గంచూపిస్తావురా దేవుడా అనుకుంటూ దేవతార్చనకోసం కొన్ని పువ్వులుకోసి గురువుగారు తమకూడాతెచ్చిన దైవపీఠం దగ్గరికివెళ్ళినాడు. పువ్వులక్కడపెట్టి భోజనంగురించి ఏలాగురా భగవంతుడా అని ఆలోచిస్తూ అక్కడనిలబడ్డాడు. అంతలో ఆతనిదృష్టి పీఠంలోఉన్న చిన్నవిగ్రహంమీదికి పోయింది. చటాలున ఆవిగ్రహాన్ని ఎత్తిచూచినాడు. చాలాబరువుగాఉంది. శుద్ధమేలిమిబంగారం. ఇదే గురువుగారిఆస్తి. ఇదే పెరుమాళ్లు. దీనికే గురువుగారు నిత్యంపూజలు కైంకర్యాలు చేస్తూఉంటారు. శిష్యుడికి ఏమీతోచడంలేదు. భోజనంవేళ సమీపిస్తూఉంది. గురువుగారిక దయచేస్తారు. చేతిలో చిల్లిగవ్వయినా లేదు. పోనీ తనతోపాటు గురువుగారు కలిగంజితాగుతారు కనుకనా? గడపక ఇంటిలో వస్తువులు అమ్ముకోవడం మొదలు పెట్టినప్పుడు సాధారణంగా ఆఖరుకు మిగిలేది పెండ్లాంమెళ్ళో పుస్తెపూసేకదా! అదికూడా అమ్మివేసినాడు గురువుగారి రాకనాడు. ఇంకేమి అమ్మడం? పోనీగురువుగారితో అయ్యా! నేనింకభోజనం పెట్టలేనని చెప్పేస్తే బాగుంటుందేమో. అయితే తీరా భోజనంవేళా చెప్పేది? అయినా ఏలాగుచెప్పగలడు? తనధనమూ తనమనస్సూ తనతనువూ గురువుగారికి ధారపోయాలని గురువుగారు ఉపదేశకాలాన్ని తనకు చెప్పినది మఱచిపోలేదు. మఱచిపోకపోతేమాత్రం ఏమ్లాభం? ప్రస్తుతం ఎట్టిదియేగానైనా వచ్చేమార్గం కనిపించడంలేదు. మఱి గురువుగారి భోజనంమాట ఏలాగు? ఎంతోఆలోచించినాడు. చివరకు ఈలాగుఅనుకున్నాడు: "గురువుగారికంటె అధికంఅయింది మఱొకటి లేదనికదా అంటారు పెద్దలు. (నగురోరధికం) అయితే ఈబంగారుప్రతిమ (పెరుమాళ్ళువిగ్రహం) ఆయనకంటే ఎక్కువా? ఎన్నటికీకాదు. కాబట్టి దాన్నిగురువుగారి భోజనానికి ఎందుకు వెచ్చించకూడదు? వెచ్చించవచ్చు. కాని అదివాడి కాదే. గురువుగారికి మాత్రం ఈపని నచ్చుతుందా? నాదేమిటి? ఆయనదేమిటి? నాధనము నామనస్సు నాతనువు అన్నీ ఆయనికి ధారపోసిన తరువాత నాదిఆని అనుకొనుటకు మిగిలినవస్తువేది? నావ్యక్తిత్వములేనప్పుడు తానుమాత్రం ఎక్కడ? 'నేను' అనుకొన్నంతకాలం 'తాను' ఉన్నాడు. కాని 'నేనే' లేనప్పుడు 'తాను' అనుకోవడానికి అవకాశం ఎక్కడుంది? కాబట్టి 'తాను' 'నేను' ఒకటేకదా? అప్పుడు ఎవ్వరిసొమ్ము వారు ఖర్చుపెట్టుకోవడానికి తప్పేమిటి? ఒకరిసొమ్ము ఇంకొకరు ఖర్చుపెట్టితేకదా తప్పు? కాని మాగురువుగారే యీసిద్ధాంతం బోధించినప్పటికి ఇప్పుడిది తనయెడల అన్వయించడంవస్తే ఆయనికి నచ్చకపోవచ్చు. నచ్చినీనచ్చకపోనీ

గురువుగారు మాయింటికి అతిథిగా ఉన్నంతకాలం ఆయన్ని సంతోషపెట్టడం నావంతు. తరువాతి సంగతి నాకేమి?" అనుకొంటూ చటాలున ఇంటిలోకివెళ్ళి చిన్నఆకురాయిపెట్టి రాయడం ఆరంభించినాడు. తనకు ప్రస్తుతం కావలసినంత బంగారాన్ని తీసుకొని అంగళ్ళోకివెళ్ళి అమ్మేసి గురువుగారికి ఎప్పటిలాగున విందు పెట్టినాడు. డబ్బుకావలసినప్పుడల్లా గురువుగారు ఇంటిదగ్గిఱలేనప్పుడు చూచి యిదేపని చేసేవాడు. గురువుగారెప్పుడైనా మాటవరసకి "ఏమోయీ! నీకు గురుభక్తి మెండు. మమ్ములను బాగా నాదరించుచున్నావు. బీద కుటుంబమైనను ఏలాగున గడపుచున్నావో మాకే ఆశ్చర్యముగానున్నది. పెరుమాళ్ళకటాక్షముచే ఇబ్బంది లేకయే జరుగుచున్నదని తలచెదము" అని అనేటప్పుడు శిష్యుడు "చిత్తం. తమకి తెలియని విషయం ఒకటి ఉన్నదా? ఇదంతా తమకటాక్షమే. జరుగుటకేమి లెండి. ఈపిల్లలతో ఈబీదఅవస్థలో ఏలాగుగడుపుకొని వస్తున్నానో ఏమిచేస్తున్నానో లోనిగుట్టంతా ఆపెరుమాళ్ళకే ఎఱుక" అని అంటూ ఉండేవాడు. గురువుగారు కొన్నాళ్ళయింతరువాత ఇక అక్కడుండడం భావ్యంకాదని ప్రయాణమయినారు. మూటముల్లె సరుదుకొని పీఠంలోఉన్న బంగారుప్రతిమను భద్రపర్చాలని తీసేసరికి—ఇంకేముంది—ప్రతిమప్రతిమలాగే ఉంది. కాని లోన గుల్లయిపోయింది. నిర్ఘాంతపోయినారు గురువుగారు. శిష్యుడువంక చూచి యిదేమన్నారు. "చిత్తం. చెప్పడానికేముందండి? ఈపెరుమాళ్ళ కటాక్షాన్నేకదాండి యిన్నాళ్ళు తమని ఆదరించేభాగ్యం నాకు కలిగింది" అన్నాడు శిష్యుడు. గురువుగారు ఇప్పుడు గ్రహించినారు శిష్యుడు అంటూవచ్చిన 'లోనిగుట్టు పెరుమాళ్ళకు ఎఱుక' అనేమాటకు అర్థం. సిగ్గుపడి మారుమాటాడకె తనదారిపోయినారు గురువుగారు. అప్పటినుంచీ 'లోనిగుట్టు పెరుమాళ్ళకెఱుక' అనేమాట వాడుకలోకి వచ్చింది. లోపల అనుభవించే కష్టాలు తెలియక పైకి కనుపించే గోప్యాన్నిబట్టి ఎవరైనాఏదైనా అనేటప్పుడు "ఏమిటో మీకు తెలియక అలాగు అంటారు. లోనిగుట్టు పెరుమాళ్ళకెఱుక" అని అంటూ ఉంటారు.

## ప్రాతకథ

శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

పూర్వం కాంచీనగరాన్ని ఓమహారాజు పాలించేవాడు. ఆరాజు సాక్షాత్తు ధర్మదేవతఅవతారమే. అడిగినవాళ్ళకు 'లేదు' అనిచెప్పటం ఆయననోటబట్టదు. ఆరాజు దానమునకు లోనుగానియాచకుడు వానికి తెడవనినరుడోఅంటూలేడు. ఆమహారాజ్యంలో దొంగతనంచేసేనీచులు కన్నుపొడుచుకున్నా కనుపించరు. సాలీనామూడుపంటలు. అతివృష్టులు, అనావృష్టులు మచ్చునకైనా సంభవించవు. కరువులు, కాటకాలు అచటి ప్రజలు ఎరుగనేఎరుగరు. దేశద్రోహులు, పిరికిపందలు, చుప్పనాతులు, చాడీకోర్లు, గర్విష్టులు ఎందుకూ కొరగాని వాజమ్మలులేని దాధర్మరాజ్యం. ఆరాజ్యంలో ఎక్కడచూచినను ఆనందమే. వృద్ధులుండగా పిన్నవారు చనిపోయేవారుకారు. విధవరాండ్రు నూటికొక్కరైనా కనుపించరు. ధర్మధేనువు నాలుగుపాదాలతో హాయిగానడుస్తూంది. ఇంకా తక్కువేమిటక్కడ? అన్నివిధాలభూలోకస్వర్గమే. ఆరాజు మంచి చదువుకున్నవాడు. ఏనుగలాంటి సత్తువకలవాడు. దానంలో కల్పవృక్షానికెనవచ్చువాడు. తనరాజ్యంలో 'దరిద్రము' అనేపదమునకే దరిద్రముపాదించాడు. ప్రజను కడుపునగన్నబిడ్డల్లాగా పరిపాలించేవాడు. సప్తసంతానవంతుడయ్యాడు. ఇంతమందిప్రజలు తనకై పంచప్రాణాలువిడుస్తూంటే కుమారుడనేవాడొకడు లేకపోతే ఏంఅనుకున్నాడామహారాజు. రాజుభార్య మహాగొప్పయిల్లాలు. మగడు పగలంటేపగలు రాత్రంటేరాత్రి అంటే వేరుమాటఅనదు వినదు. ఆభాగ్యశాలికి ఒకటంటే-ఒకటే-ఒకటి-కోరిక చెలరేగింది. దానికోసం అహర్నిశాలు భగవంతుణ్ణిగురించి ప్రార్థించేది. ఇలవేల్పుల కందరికిముడుపుకట్టింది. వరదరాజులకు బంగారుపుతొడుగు తొడిగిస్తానని మ్రొక్కుకొన్నది. ఉండలేనిఉపవాసాలు, తరుగులేనితపస్సులు, పడరానిపరిశ్రమలుపడింది.

ఆడపుట్టుకకూడా? మరి ఇంకేంఉంది సంతానవాంఛతప్పితే? అంతఃపురానికంతా వెలుగిచ్చేమణిలాంటికుమారుడులేకపోయాక ఇక ఈజన్మయెందుకూ? పాడుజన్మ? అనుకుందావిడమనస్సులో. మహాపతివ్రత కోరడం దానికి తిరుగంటూఉండటంకూడానా? ఆరాజు రాజ్యంలో ప్రతిఉగాదికీ మునీశ్వర్లందరూవచ్చి ధర్మోపదేశాల్ని చేయటం అనవాయితీయైపోయింది. ఆనాడేఉగాది. ఎక్కడలేనిమునీశ్వరులూ కోటానుకోట్లువచ్చారు. వాళ్ళందరినీ మరియాదచేసి ఉండటానికితగిన వెలవులు సిద్ధంచేయించాడు. దివాణంలోఉండే నౌకర్లను చాకర్లను వాళ్ళ సేవలుచేయడానికి నియోగించాడు. ఎక్కడా ఏలోటుపాటులులేకుండా పైనుండి వేయి కళ్ళతోకనిపెట్టుతున్నాడు. మధ్యాహ్నంసభకొక్కవలసిన పురమాయింపులన్నీ ఆయా తీర్చడానికి అమాత్యులను, సేనాపతులను ఆజ్ఞాపించాడు. సభకురావలసినదిగా తనపట్టణమంతా దండోరావేయించాడు. తాను మునీశ్వర్లందరినీ పరామర్శించడానికి పాదచారిగాబయలుదేరాడు. సభలో స్త్రీలకు పురుషులకు ప్రత్యేక స్థలాలు ఏర్పాటుచేశారు. సభాభవనమంతా అద్భుతంగా అలంకరించారు. కలికవైకుంఠం కన్నులపండువుగా వుంది. ఆసభకు ఆయనపరిపాలనలోఉన్న ఆబాలగోపాలంవచ్చారు. గలభాలేదు. అంతానిశ్శబ్దం. యావన్మంది మునీశ్వర్లూ అనేకవిషయాల్ని గురించి ధర్మోపన్యాసంచేశారు. ఆమునీశ్వర్లందరికీ నాయకమణిలా మెరిసిపోతూన్న ఒకముసలిబ్రాహ్మణుడు లేచినిలబడ్డాడు. హిమవచ్ఛిఖరంలా గంభీరమైన ఆమూర్తిపైకి అందరి కళ్ళూ ఒక్కసారిగా ఎగప్రాకినవి. ఆముసలాయనపలుకులకు తల్లులు స్తన్యములుకూడావిడిచిపెట్టి నిక్కినిక్కి చూచారు చంటిబిడ్డలు. ఇంక పెద్దవాళ్ళసంగతులు చెప్పనక్కరలేదు. తరువాత అనేకఅమూల్యవిషయాల్ని గురించి తన్మయత్వంచెందేలాచెప్పాడు. అంతట సభ రాజాగారిఅభివాదనములతో అంతమైనది. ఎక్కడవారక్కడ నిశ్శబ్దంగా నిశ్చలంగా కూర్చున్నారు. ఆవృద్ధమునీశ్వరుడు రాజుని దగ్గరకుపిలిచి "నీకు సంతానమెంతమంది?" అని ప్రశ్నించాడు. రాజు తడబడకుండ సప్తద్వీపవసుంధరాభారధౌరేయమగు దక్షిణకరము చాచి పౌరులనందరిని చూపించాడు. మునికతపసి ఆశ్చర్యచకితుడైనాడు. ప్రజలకండ్లన్నియు సంతృప్తితో సంచలించినవి. ముని తిరిగి నీకడుపునకన్నబిడ్డలెంతమంది అని ప్రశ్నించాడు. రాజు నిరుత్తరుడై నిలబడ్డాడు నతమస్తకముతో. ప్రజలంతా అంజలిబద్ధులై ఏకకంఠంగా యువరాజునుప్రసాదించమని ముని దేవుని ప్రార్థించారు. మునిహృదయం నిర్భరానందంతో నెల్లివిరిసింది. ఒకనిమేషం నేత్రాలను నిమీలితం చేశాడు. కళ్ళువిప్పిచూసేటప్పటికి రాజుసహా యావన్మందిప్రజలూ వినమితశిరస్కులైనిలబడ్డారు. రాజు తలమీద అభయహస్తంఉంచాడు. అందరూ తలలుపైకెత్తారు. కోటానుకోట్లనీలోత్పలాలు ఒక్కసారిగా మునీశ్వరుని ఆపాదమస్తకముఅలంకరించినై. ముని ఒకకనకకలశము తెప్పించి మంత్రపూతమైన కనకమండలోదకాన్ని అందులోపోసి రాణికివ్వమనిచెప్పాడు. "ధన్యోస్మి" అన్న రాజుగారిపలుకు ప్రజాకంఠధ్వనుల లీనమై సభాభవనము ప్రతిధ్వనింపచేసినవి. కుమారాభ్యుదయానికినిరీక్షించిన బర్హిర్ముఖులులాగా కాంచీ పౌరులు రాకుమారాభ్యుదయానికి నిరీక్షించినారు. ఆముసలితపసిమాటప్రకారం చక్కని రవ్వలాంటికుమారుడుపుట్టాడు. ప్రజలంతా పురుడుపట్టారు. హా! ఎక్కడచూచినా దానాలు, ధర్మాలు హోరత్తిపోతూంది ఊరంతా. మాసాలకొద్ది బందిఖానాలోపడి తెల్లపోయినముఖాలన్నీ సూర్యుడుచంద్రుడుకనపడే ప్రపంచంలోకివచ్చినై. ఊళ్ళోవుండే ముత్తయిదువలందరికీ కోకలురవికలు పంపినారు. అందరికీ సంతోషసంభ్రమాలే. అంతా ఆనందతాండవమే. అచేతనాలుకూడా పులకరించినవి. రాకుమారుడు నాటానాటా అభివృద్ధి చెందుతున్నాడు. అంతఃపురంఅంతా బాలుణ్ణి అరచేతుల్లోపెట్టుకొని పెంచుతున్నారు. కోరటం తడవుగా సమకూర్చేవారు ఏదిబడితేఅది. తల్లిదండ్రులముద్దులతో పెరుగుతున్నాడు బాలకుడు...అది కుమారరాజా తృతీయజన్మదినమహోత్సవం. రాజ్యంఅంతా అలంకరించారు. అష్టాదశవర్ణాలవారికి సంతర్పణలుచేయించారు.

బ్రాహ్మణులఆశీర్వాదములు మహిళామణుల మంగళహారతులుపొంది బాలకుడు నిద్రించాడు. సాయంకాలము మహారాజు అంతఃపురంలో హంసతూలికాతల్పంమీద ఒయ్యారంగాకూర్చున్నాడు. రాణి అప్రక్కన సోఫామీదకూర్చున్నది. ఒకదాసీది మణిచషకంలో ద్రాక్షాసవంతీసుకొనివస్తూంది. రాజకుమారుడా ప్రక్కనున్న పంజరంలోని రామచిలుకదగ్గరనుంచుని వింతగాపరికిస్తున్నాడు. భార్యాభర్తలు విలాసంగా ఫలరసాన్ని సేవిస్తున్నారు. ఇంతలోకుర్రాడు పైడిగిలకతో చిలుకకంటిలోపొడిచాడు. చిలుక గగ్గోలుపడి యేడ్చింది. పిల్లవాడుభయపడి కాపురుమన్నాడు. రాణి పరుగెత్తుకొనివెళ్ళినది. కుర్రాడు కళ్ళెర్రబడేటట్టు ఏడుస్తున్నాడు. రాణీ కుర్రవాణ్ణిచంకకెత్తుకొని బురుజువద్దకువెళ్ళి అప్పుడప్పుడేఅస్తమించుచున్న సూర్యబింబం చూపెడుతూంది. "నాన్నా" అంటూ ఏడ్చాడుపిల్లవాడు. రాజొక్కంగంతునవెళ్ళి కుర్రాణ్ణి చంకకుతీసుకున్నాడు. గదిలోనుండి రామచిలుకఏడ్పు వినిపించినది. కుర్రా "దదీఅదీ" అంటూఏడ్చాడు. "భయంలే దాన్ని దీనితోచంపి ముక్కలుచేద్దాం" అని మొలనున్నఖడ్గంచూపించాడు రాజు. రాజు నానాటికి క్షీణిస్తున్నాడు. పాపం రాజుగారికుడికంటిలో అపరిమితమగుమంటలు. రాత్రే పగలు పగలే రాత్రిగా గడుపుతున్నాడు. రాచకార్యాలజోలికి పోవటంలేదు. రాజ్యంఅంతా విచారంలోమునిగింది. రాణీ వినుగక స్వయంగా సపర్యలుచేస్తూంది. అనేకమందివైద్యులువచ్చారు. చేతులువలుపుకుంటూవెళ్ళారు. వైద్యవిద్యావిద్ భిషక్కుఆచార్యులుఅంతా చప్పరించారు. రాజ్యంలో ఎవరినోటవిన్నా ఇదేసంగతి. పౌరులంతా తమధర్మప్రభువునిరక్షించవలసినదని ప్రార్థించారు. ప్రార్థనలాలించినట్టుగా ఇదివరలో సంతానాన్నిప్రసాదించిన మహానుభావుడు తనశిష్యమండలితోవచ్చాడు రాజ్యానికి. ఆయన్నిచూడటంతోటే ప్రజలంతాచుట్టుముట్టి ప్రభువుదురవస్థను విన్నవించారు. వారందరితో రాచనగరునకుబయలుదేరాడు మునీశ్వరుడు. రాజు మునిని చూచి సాష్టాంగపడ్డాడు. మునిరాజు రాజునుదీవించి తనప్రక్కనకూర్చోమన్నాడు. సమాచారంఅంతావిని రాజుతో యిలాఅన్నాడు: "రాజా! బుద్ధితెలిసి ఏఏపాపాలుచేశావు?" అని. రాజు "ఏంచేయలేదు" అన్నాడు. "నిర్దోషిఅయిన చిలుకకన్నుపొడిచినకుమారుని శిక్షించకపోవటం తప్పేనా?" అన్నాడుముని. 'తప్పే' అని రాజన్నాడు. ముని "నీనేరానికి నీవే శిక్షవిధించుకో"మన్నాడు. రాజు తనకైజారుతో రెండు కళ్ళూ పొడుచుకున్నాడు. అంతాశూన్యం. అంతలో కలకలం. రాజు మంత్రినడిగాడు. జవాబులేదు. కళ్ళుంటేనా అనుకున్నాడు. తీరపువ్వుల్లా రెండుకళ్ళూవచ్చినై. మునిలేడు. ఆస్థానే ఒకదివ్యతేజస్సు వెలిగిపోతావుంది.

## జిత్తుపై జిత్తు

శ్రీమతి గరికిపర్తి సీతామహాలక్ష్మమ్మగారు

అనగాఅనగా ఒక తాబేలు. అది ఒక చెరువులోవుండేది. దానికి రెండు కొంగలతో స్నేహం. ఒక వేసవిలో ఆచెరువు ఎండిపోయింది. తనను నీరున్న చెరువులోకి తీసుకువెళ్లమని తాబేలు ఆకొంగలనుకోరింది. ఆకొంగలు ఒకపుడకను తీసుకువచ్చి దానిమధ్యను తాబేలు నోటితో పట్టించి ఆపుడకను చెరియొకవైపున నోటితోపట్టుకొని ఎగిరి తీసుకువెళుతూన్నాయి. అది ఒక నక్కచూచి "తాబేలుబావా! తాబేలుబావా! కొంగలు నీనోటిలో కర్రగొట్టి తీసుకుపోతున్నారేమి?" అన్నది. తాబేలు ఏదోచెప్పబోయి పుడకను విడిచిపెట్టి క్రింద పడింది. నక్కదానిని తినుటకు కొరకబోయి "ఇదేమి? తాబేలుబావా! ఇంతగట్టిగా ఉన్నావు?" అన్నది. "నీళ్లలో నానవేసుకో. మెత్తబడతాను" అన్నది తాబేలు. "పారి

పోతావేమో?" అన్నది నక్క. "నీకు నమ్మకంలేకపోతే కాలితోనొక్కిపట్టుకో" అన్నది తాబేలు. నక్క తాబేలును ఒక చెరువుయొడ్డున నీళ్లలో పడవేసి కాలితోనొక్కిపట్టింది. కొంచెముసేపు అయినతరువాత నక్క "తాబేలుబావా! నానినావా?" అన్నది. "అంతానాని తినికాని నీవుకాలితోనొక్కిన భాగంమాత్రం నానలేదు" అన్నది తాబేలు. అపుడు నక్క తనకాలు కొంచెముఎత్తింది. తాబేలుచల్లగా లోతునీళ్లలోకిజారి ప్రాణాలు దక్కించుకుంది. నక్క తనజిత్తుసాగలేదని మిక్కిలి విచారిస్తూ ఇంటికివెళ్లిపోయింది. కథకంచికిపోతే మనం ఇంటికివచ్చాము.

౮. వ్యాకరణశాస్త్రకథలు

## క్రియలధాతయ్య

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

వ్యాకరణద్వీపాగ్రహారీకులలో క్రియలధాతయ్యయను నొకబ్రాహ్మణసంపన్నగృహస్థుకలడు. ఆయనకు సంతానము మెండు. ఆయనకు బిడ్డలకన్న బిడ్డలబిడ్డలు సంఖ్యకు నెక్కువగానున్నారు. ఆయనకు సమాసకయ్య యను నొకకొమారుడును అసమాసకమ్మయను నొకకొమార్తెయునుగలరు. వారి సంబంధబాంధవ్యములన్నియు నాగ్రామమునకు జెందినవేకాబట్టి వారిబంధువు లాగ్రామములో లెక్కకు మిక్కిలిగానున్నారు. వారి కొమారుడైన సమాసకయ్యకు స్వార్థకయ్య, ప్రార్థనయ్య, ఆశీరయ్య అను ముగ్గురుపుత్రులుకలరు. వారిలో మొదటివారైన స్వార్థకయ్యకు నలుగురునందనులుద్భవించిరి. వారిపేరులు వరుసగ భూతయ్య, వర్తమానయ్య, భవిష్యదయ్య, తద్ధర్మయ్య యని. తక్కినయిద్దరిమనుమలకు సంతానముశూన్యము. ధాతయ్య స్త్రీసంతానమగు అసమాసకమ్మకు భావమ్మ, క్రియాకాంక్షమ్మ, నామాకాంక్షమ్మ యను ముగ్గురాడపిల్లలుమాత్రముపుట్టిరి. భావమ్మను నామాలవారింటి వడుచువానికిచ్చి పెండ్లిచేసిరి. ఆమెకు సంతానములేదు. క్రియాకాంక్షమ్మను అవ్యయాలవారింటిపిల్లవానికిని, కామాక్షమ్మను విశేషణాలవారిబాలునకును నిచ్చి పాణిగ్రహణమహోత్సవము నడపిరి. క్రియాకాంక్షమ్మకు మొదటిస్త్రీసంతానముగా కవల పిల్లలుపుట్టిరి. కాని వారిద్దరకును నొకటే పృష్టభాగమనివ్రాయుటకు విచారముచేయుచున్నది. వారిపేర్లు స్వార్థకవ్యతిరేకస్వార్థకమ్మలు. తక్కిన నలుగురుస్త్రీశిశువులకు తుమ్మమ్మ, శత్రమ్మ, అవంతమ్మ, చేదమ్మ యని నామకరణమొనర్చిరి. అప్రకారము క్రియాకాంక్షమ్మకు అయిదుగురు ఆడపిల్లలుకలిగిరి. నామాకాంక్షమ్మకుకూడ నయిదుగురు ఆడపిల్లలుపుట్టిరి. భూతమ్మ, వర్తమానమ్మ, భవిష్యదమ్మ, తద్ధర్మమ్మ, వ్యతిరేకమ్మ అని వారికి పేర్లుపెట్టిరి. ఈమెను విశేషణాలవారింటికిచ్చినను విశేషణాలవారు కరణాలుకాబట్టి ఆమెను కరణాలవారికోడలని చెప్పుకొనుచుందురు. ధాతయ్యగారు తమ మనుమలకును మనుమరాండ్రకును తగిన పెండ్లికొమార్తెలను పెండ్లికొడుకులనువెదకి తమ యింటనే కల్యాణమహోత్సవములనొనరిచిరి. ఆవివాహసందర్భమునజరిగిన యద్భుతచర్యలు వినదగినవి, చదువ దగినవి అని మానవి. భావమ్మ పెండ్లియాడునకువచ్చినవెంటనే నాగ్రామమునగల గృహస్థునిబిడ్డనికిచ్చియే వివాహముచేయవలెనని ధాతయ్యగారు సంకల్పించుకొని యట్లుచేసిరి. ఒకనాఁడు ధాతయ్యగారు వీధియరుగు మీదకూర్చుండియుండగా ఒకవైష్ణవబాలుడు-పదునాలేండ్లవయస్సుగలవాడు అతీతని చేతఁగొన్ని పుస్తకములు పట్టుకొని, ముఖమున పట్టవర్ధనాలు బాగుగపెట్టుకొని, పొట్టనిండ చలిదియన్నముకొట్టి బాలకరేంద్రునివలె సుందరమందగమనంబున పాఠశాలకుఁబోవుచుండెను. అతనినిజూచి ధాతయ్యగారు "ఇటురా! అబ్బాయి" అని పిలిచిరి. ఆబాలుఁడు సమీపమునకురాఁగానే "నీవెవ్వరిపిల్లవాడవోయి" యని ధాతయ్యగారు ప్రశ్న

చిరి. ఆపిల్లవాడును ధాతయ్యగారికి వినయముతో నమస్కరించి "నేను నామాలవారిఅబ్బాయినండి" అని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట ధాతయ్యగారు "ఇల్లా చాపమీదకూర్చో" అని వీథియరుగుమీదిచాపను జూపించిరి. ఆబాలుడును సుఖాసీనుడైనతరువాత వారిద్దరకు నిట్లు సంభాషణజరిగెను.

ధాతయ్య:—నీ చేతిలోని వేంపుస్తకాలు?

బాలుడు:—వ్యాకరణసంగ్రహమండి.

ధాతయ్య:—ఎవరురచించినారు దానిని?

బాలుడు:—వీరేశలింగముపంతులుగారు.

ఇట్లీ సంభాషణముజరుగుచుండగా భావమ్మ సమయమునకు తాతగారివద్దకువచ్చి దగ్గరకూర్చుండెను. అంతట ధాతయ్యగారు మనుమరాలిని దగ్గరకూర్చుండపెట్టుకొని నామాలవారియబ్బాయిని నింకను నిట్లు ప్రశ్నించిరి.

ధాతయ్య:—అబ్బాయీ! నీకు వ్యాకరణమెంతవరకువచ్చును.

బాలుడు:—ఈపుస్తకమంతావచ్చునండి.

ధాతయ్య:—ఎన్నాళ్ళలో నేర్చినావు.

బాలుడు:—ఆరునెలలోనండి.

ధాతయ్య:—నేనేదైనా అడిగితే చెప్పగలవా?

బాలుడు:—చిత్తము. తమయనుగ్రహము!

ధాతయ్య:—సంధియనగా నేమి?

బాలుడు:—ఆవిషయములో మాగురువుగారు వ్యాకరణశాస్త్రజ్ఞులలో అనేకాభిప్రాయలున్నాయని చెప్పినారండి. ఒకరు సంధిని నిరూపించబోయి అచ్సంధికి వర్తించేటట్టుగా నిరూపణమునిచ్చినారండి. దానినే వీరేశలింగముపంతులుగారు అచ్సంధిని నిరూపించుటకువిడిచి మొత్తముమీద సంధియనగా నేమొ మరియొక క్రొత్తనిరూపణమునిచ్చినారు. కాని హల్సంధిని నిరూపణకు మరొకసూత్ర మేమియు చెప్పినారు కారు.

ధాతయ్య:—అయితే నీవు వ్యాకరణములో గొప్పప్రజ్ఞకలవాడవులాగున్నావు. పాఠశాలకు ప్రొద్దు పోవుచున్నదికాబోలు!

బాలుడు:—లేదండి. ఇంకా వేళకాలేదండి.

పిమ్మట ధాతయ్యగారు తమ మనుమరాలినిచూచి "అమ్మాయీ! ఈఅబ్బాయిని పెండ్లాడుతావా?" అని యడిగిరి. అందుల కాబాలిక 'ఛీ' అనిసిగ్గుపడి యింటిలోనికివెళ్ళిపోయెను. కాని మరల రెండుమూడు సారులు ఆబాలిక గుమ్మములోనికివచ్చి తొంగిచూచిపోయెను. ఆయబ్బాయికూడ నాబాలికనుచూచి ఆమె వైపుచూచుచుండినచో ధాతయ్యగారేమనుకొందురోయను శంకచే క్రిందిమొగముచేసికొనియే కూర్చుండెను. ధాతయ్యగారు విద్యార్థినిజూచి "పో అమ్మా బడికి. మీనాయనగారి నొకసారి నేనురమ్మన్నాననిచెప్పు" అని యడిగి యతనినిపంపివేసిరి. మరికొన్నినాళ్ళకు భావమ్మను నాబాలునకేయిచ్చి వివాహముచేసిరి. స్మార్తులైన తాము వ్యాపారులఇంటికిచ్చిన తనకుమార్తెసంతానమైన ఆబాలికను వైష్ణవబాలునకిచ్చి వివాహముచేయబట్టియే భావమ్మ నామాలవారియింటికోడలైనదని వ్రాయవలసివచ్చినది. ధాతయ్యగారు గొప్పసంఘసంస్కర్తలు. ఇట్లే వారుచేసిన ఇతరవివాహములుకూడ విచిత్రపద్ధతులపైజరిపి పండితులను మాట్లాడకుండచేసెను. వానిని గూర్చి మఱియొకసారివ్రాసెదను.



"చైనా దేశపు నారీజనం శతాబ్దాల నిద్రనుండి లేచారు":—

"నీధైర్యాన్నంతా సమకూర్చుకొని, 'ముందరి'కిపోవడానికి తయారుగావుండు. మన జీవనధాత్రికోసరమై నడుముకట్టిపోరాడు. ఈపావనమతయుద్ధంలో నేనూ నిన్నుకలుసుకొంటాను. మనదేశంకోసరం నీప్రాణాలే బలిదానంయివ్వవలసివస్తే, నాహృదయం నీఆత్మకు పుణ్యదేవాలయంగా అర్పణచేస్తా." ఈవిధంగా వ్రాసింది ఒకచదువుకొనేఅమ్మాయి తాను ప్రేమించిన ఒకవిద్యార్థిని సేవలోచేరమని ప్రోత్సహిస్తూ. దేశకార్యార్థం చైనాదేశపునారీత్వం యింతవుత్సాహంగా బదులుచెప్పింది యింతకుమును పెన్నడూ లేదు. రక్తదాహంగల జయవాదాలుచేస్తూ, మగవారిని 'యుద్ధరంగానికి ఆయుధాలుధరించండోయ్' అని హెచ్చరిస్తోవున్న చైనాదేశపు ముక్తకంఠాలుకలవిద్యార్థినీబాలికలచేత విరోధియైన జపాన్ నేడు తిరస్కరించబడింది. "మాయిండ్లను మేము ప్రేమిస్తాము కాని మాదేశప్రేమ అంతకన్నా బలీయమయింది" అని వొక స్త్రీఉపన్యాసకురాలుచెప్పింది. "మారో ఘరంకికో మారో" అని ప్రతిధ్వనించారు ఆమె సభాసదులంతా. యుద్ధజ్వరం చైనాబాలికలందరినీ ఆవహించింది. వందలకొలదీ దాదులుగాకావడానికి శిక్షణపొందుతున్నారు; ఉపన్యాసాలుయివ్వడానికీ, ధనంపోగుచేయడానికీ వందలకొలదీ తమచదువులకు స్వస్తిచెప్పారు. వేలకువేలు "ధార్మికధీరసేన", "పరిరక్షణసేవాదళం" మొదలైన సేవాదళాలుగాఏర్పడ్డారు. ఇంతయెందుకూ? కుట్టుపని, బుట్టలస్థానం నేడు కత్తి ఆక్రమించుకొంది. పదివందలయేళ్ళక్రిందట "హ్వామూ-లాన్" అనువొక పేదపల్లెటూరిబాలిక మగవేషంధరించి, తనధీరకృత్యాలచేత వొకసేనకు నాయకురాలై, ఆదేవతాసామ్రాజ్యపు (చైనాదేశపు) సరిహద్దులమీదకుదండెత్తివచ్చిన విజాతీయసేనలన్ని చెల్లాచెదరుగా తరిమివేసింది: ఎన్నడో ఒకానొకనాడు ఆమెనుకూడా అతిక్రమించగలుగుదుమని నేటి చైనాదేశపుయువకుమారికలు ఆశిస్తున్నారు."

—అనువాదకుడు: కస్తూరి రాజమాణిక్యం.

—*The Hindu.*

మాతా, శిశుశరణాలయములు: జర్మనీ:—

"ఆధునికజర్మనీ దేశమున శిశువులను, శిశుమాతలనురక్షించుటకై చక్కనిపద్ధతులపైనడుపబడు శరణాలయములుగలవు. దీనులగుశిశుమాతలకు శరణమొసంగుట, మతవిషయికముగ ధర్మకర్మమని జర్మనులు ఆరవ శతాబ్దినాటికిను గ్రహించి దీనులకై శరణాలయములను మతపీఠాధిపతులు నెలకొల్పిరి. ఇటుల దీనశిశువులకును, శిశుమాతలకును మతప్రభుత్వమువారే రక్షణమొసగుపారంపర్యకాయము రోమీయనాగరకతాజన్యము. ఇటలీదేశమున మిలాన్‌నగరమున తల్లిదండ్రులచే విడువబడినబిడ్డలు, అనాథలగు శిశువులరక్షణమునకును, ఉయ్యాల

లమర్చిన 'శిశురక్షణశాలలు ఇటలీ ప్రభుత్వమువారిచే నెలకొల్పబడెను. ఈవిషయమున ఫ్లోరెన్సునగరియు, మొట్టమొదటిదియునగు పట్టణమిదియే. వీథులలో నిర్దాక్షిణ్యముగవిడిచిపెట్టఁబడిన శిశువులకాశ్రయరక్షణములనొసగినదియు నీనగరమే. ఈరోమీయునగరము నాదర్శముగఁగొనుచు పదునాఱవశతాబ్దిని జర్మనీలో న్యూరెంబర్గునగరమున అనాథశిశువులకును, వీథులలోను యితరస్థలములలోను విడిచిపెట్టబడినశిశువులను కాపాడుట కొకశరణాలయము స్థాపింపఁబడినది. అల్మ, ప్రెయిబర్గు అనునగరములు 1386-వ సంవత్సరమునను, మ్యూనిచ్ నగరము 1489-వ వత్సరమునను యిట్టిశరణాలయములను సంస్థాపించుకొనఁగల్గినవి. 18-వ శతాబ్దమున జర్మనీదేశములో ఇట్టిగృహములునిర్మించుట ప్రధానావశ్యకతయేయయ్యెను. ఏలనన జర్మనీదేశము తన యనాథశిశువులనుకాపాడి తనప్రజాసంపత్తిని పెంపొందించుకొన యవసరమేర్పడెను. అట్టియవసరమునచే స్ట్రాస్‌బర్గు, డ్రెస్డన్, కేసెల్, బెర్లిన్, మెయిన్‌జ అనునగరముల నిట్టిశరణాలయములు స్థాపింపఁబడినవి. జర్మనీదేశపు శిశుశరణాలయములకును, ఇటలీదేశపు శిశుశరణాలయములకును భేదమున్నది. ఇటలీదేశములో శిశుశరణాలయములలోనుండెడిశిశువు లెట్టివారనగా, వ్యభిచారదోషములవలనగలిగిన శిశువులు, కిరంతువులశిశువులు, అనాథశిశువులు మొదలగు శిశువులెల్లరు యేయర్ధరాత్రమునదో యెవరిచేతనో గొనిరాబడి, యెల్లరకును యెల్లవేళలనందుబాటులోనుండెడి యాశరణాలయప్రాంగణమున వ్రేలాడఁగట్టఁబడినతొట్టెలోఁ బండుకొనఁబెట్టబడినబిడ్డలెల్ల నాశరణాలయరక్షణకుఁజేర్చబడిన శిశువులుగఁ బరిగణింపఁబడుదురు. ఇటలీదేశపుశరణాలయములకును, జర్మనీదేశపుశరణాలయములకునుగల ముఖ్యమగుభేదమేమనన నిటలీలోనిశరణాలయములలో శిశువులనుపెంచి పెద్దవారినిగఁజేయుటయేగాని వారికి విద్యాసంస్కారము గల్గించుటలేదు. జర్మనీలోనిశరణాలయములలో నట్టిశిశువులకు విద్యాసంస్కారము బాగుగకల్గింతురు. జర్మనీలో అగస్టు, హెర్మన్, ఫ్రాంకే, పెస్టలాజీ అనువారలు బిడ్డలకుత్తమమగువిద్యగఱపుటకుతగిన యేర్పాట్లు గావించిరి. 17-వ శతాబ్దమున జర్మనీదేశమున హేంబర్గు, హాల్లే అనునగరముల ననాథశరణాలయములు నెలకొల్పబడియున్నవి. జర్మనీదేశమున 1339-వ సంవత్సరమున న్యూరెంబర్గునగరమున పేదలగు గర్భిణీస్త్రీలు ప్రసవించుటకనుకూలములగు వైద్యాలయము నెలకొల్పబడెను. అచ్చట నిట్టిస్త్రీల కాహారరక్షణములను ప్రభుత్వమువారే యుచితముగనొసగెదరు. తరువాత తరిఫీదొసంగఁబడినవారును ధాత్రీశిక్షణమును, మంత్రసానితనమునను కౌశలమునుగడించినస్త్రీలు "పూజ్యస్త్రీలు" అనునామముతో వ్యవహరింపఁబడుకొందఱుస్త్రీలు నగరమున నెచట తమసేవకై యాహ్వానమువచ్చునో అచటకువెడలి వారి కుచితముగ తమసేవాధర్మమును నెఱపుదురు."

—అనువాదకుఁడు: ఆకుండి వేంకటశాస్త్రి.

—*The Modern Review.*

కల్యాణీ సహగమనము:—

"కల్యాణి మాలపిల్ల. అది యేడేండ్లది. ఒకనాఁడది కాశియందలి క్వీన్సుకాలేజికిసమీపమందున్న చెట్ల క్రిందను ఎండుపుడక లేరుకొనుచుండెను. అప్పు డాదారిని ఒకబ్రాహ్మణునిశవమును "రామనామసత్య హై" అనుచు శ్మశానమునకు తీసికొనిపోవుచుండిరి. కళ్యాణి ఆధ్వనివినఁబడగానే శవమును మోయువారిని సమీపించి ఈశవము నిచట నేదించండి. ఈశవము నాభర్తగారిది. నేనీశవముతో సహగమనము చేసెదను అన్నది. అది యన్నమాటల కందఱునుఆశ్చర్యపడుచు నీవు మాలపిల్లవు. ఇదియొక బ్రాహ్మణునిశవము. మీయిద్దఱకును దాంపత్యసంబంధమెట్లు? అందును నీవుచాల చిన్నపిల్లవుకూడనుగదా అనియడిగినారు. ఇట్లుపేక్షాపూర్వకముగాఅన్నవారిమాటలువిని మాలబాలిక యంచిది. మీరు శవమును క్రిందికిదింపుఁడు. శవమునకుకట్టినకట్లు విప్పుఁడు. ఆయన నిజముగా నాభర్తగారే. ఆయనపక్షమున, మీరుచూచుచుండగానే లేచి నన్నుపట్టుకొందురు

అని యున్నది. వారు మరింతఆశ్చర్యపడుచు అదిచెప్పినచొప్పున చేసినారు. అప్పటికి జనులు చాలమంది ప్రోగయినారు. శవమునుదింపి కట్టువిప్పినతోడనే అదిలేచి దానినిపట్టుకొన్నది. ఇట్లుజరుగుటవలన అందరకును దాని మాటలయందు గట్టినమ్మికకల్గినది. ఆపిల్ల తానదివరలోఏరిన కట్టెపుడకలనుఎత్తితెచ్చి శవమును దహింపఁగొని పోవుకట్టెలతోచేర్చినది. పెద్దచితిపేర్చినది, అది చితిపైని శవమును పెట్టించి తానుకూడ నెక్కఁబోవుచుండఁగా "మీాయిరువురకునుగలసంబంధపు రహస్యమెట్టిది" అనియడుగగా అది యిట్లుచెప్పినది:- నాపూర్వజన్మమున నే నీయనకు భార్యను. ఒకనాఁడు చీపురుతోఇల్లూడ్చుచుండఁగా నేను నాభర్తగారిపాదరక్షలను కాలితో దూరముగతొలగించితిని. చేతితోనెత్తి ఒకచోటనుంచనైతిని. ఆపాపమునకుఫలముగా అందర పాదరక్షలను చేతితోమోత్తు మాలకులమునందుపుట్టినాను. ఈలోగా నాపాపమునకు ప్రాయశ్చిత్తమయినది. ఇపుడు నాభర్తగారిశవముతో సహగమనముచేసెదను అనిచెప్పి సహగమనించినది. అపుడేఅచ్చోట ఒక చపటాకట్టించినారు. అది కల్యాణిసతిఅయినచపటాఅను పేరును, ప్రసిద్ధినిపొందినది. దానిని పూజించుచున్నారుకూడను. క్రొత్తగాపెండ్లిఅయినవధూవరులను ఆచపటాయొద్దకుతీసికొనిపోయి మ్రొక్కించుచుందురు. అసంగతియెఱింగినవారు పెద్దలెందరోఉన్నారు." కాశీ-బ్రాహ్మణసమ్మేళనపత్రికనుండి అనువాదితము.

—పండిత పురాణం సూర్యనారాయణతీర్థులు.

## భారమితియంత్రనిర్మాణచరిత్ర:—

"మనమందరమును వాయువుస్వభావమును తెలిసికొనుటకు భారమితియంత్రమును పరీక్షింతుముగాని మనలో ఒక్కరికేనియు ఈఉత్కృష్టోపయోగమైన యంత్రముకనుగొనుట ఎట్లుసంభవించెనో తెలియదు. 1640-వ సంవత్సరమున "ది గ్రాండ్ డ్యూక్ అఫ్ టస్కనీ" అనునాతఁడు తనభవనమున డాబాపై ధారాయంత్రములనిర్మించ ఆజ్ఞాపించినపుడు నీటిని 32 అడుగులనుమించి పైకిఎక్కించుట అసాధ్యమని తెలిసికొనబడెను. ఒక్కరేనియు దానిమర్మమును తెలిసికొనజాలరైరి. అందుచే ఆప్రభువు గొప్పశాస్త్రవేత్తయైన గెలీలియోకు విన్నవించెను. కాని ఆగొప్పశాస్త్రవేత్తకూడ దానిమర్మమును బోధపర్చజాలకపోయెను. తుట్టతుదకు గెలీలియోశిష్యుడును, స్నేహితుడునగు టారిసెల్లి కారణమునుకనుగొనెను. గాలినితీసివైచిన పొడుగైనగొట్టమును నీటిలోనికిబోర్లించినపుడు నీరు 32 అడుగులఎత్తు గొట్టములోనికిఎక్కునదనియు అంతకన్న పైకిపోలేదనియు కనుగొనెను. "ఓహో! ఈనీటిని గొట్టములోనికి ఏదోత్రోసిపంపించుచున్నది" అని యాలోచనకొనెను. అతడు సరియైనదానినే తలచెను. అదిఏది? గాలి బరువుకలిగియున్నది. ఆగాలికున్న ఒత్తిడిశక్తియే నీటిని లోనికిత్రోసినది. ఈనూతనభావమే అతనికి భారమితియంత్రమునుకల్పించవలెననుయూహ తోపించెను. నీటికన్న రెండింతలబరువుగలద్రవ ముపయోగించిన 16 అడుగులుమాత్రమే ఆగొట్టములోనికిలేచునని కనుగొనెను. నీటికి 13½ మార్లధికబరువుగలపాదరసము నుపయోగించిన (ఒకవైపుమూసినగొట్టమున నిండుగా పాదరసముపోసి వ్రేలునుమూసి పాదరసపుగిన్నెలోనికిబోర్లించి వ్రేలుతీసివైచిన) 29 అంగుళములపాదరసము గాలి సహాయమున నిలబడియుండునని కనుగొనెను. ఈవిధముగా 29 అంగుళములపాదరసము నిలబడియున్న గొట్టపుయంత్రమునకే "భారమితి" (Barometer) అని పేరిడెను. బారో=భారము మీటర్=మితిలేక పరిమాణము అనిఅర్థముగల గ్రీకుదేశపు రెండుపదములకలయిక-అనగా బరువునుకొలుచునది. ఈభారమితియంత్రమున నిలబడియున్నపాదరసము ఎట్టిసమయమందైనను హెచ్చు-తగ్గు తప్పక గాలియొక్కబరువును తెలియపరుచుచుండును. గాలియొక్కబరువు వాతావరణస్థితిని కనుగొనుటకు కొంతఆధారము. అందుచే మనము భారమితినే వాతావరణస్థితిని తెల్పు యంత్రమనియందుము. ఇట్లు భారమితియంత్రమునుకనుగొనిన టారిసె

శిశుసహాయకసంఘము, మదరాసు




బాలికలు పనిచేయుచుండుట

శిశుసహాయకసంఘము, మదరాసు




గరల్‌గైడ్సు

ఇప్పటికి 323 సంవత్సరముల క్రిందట పుట్టియుండెను. భారమితియంత్రమున పాదరసమునకు పైభాగమున యుండుఅవకాశము టారిసెలియన్ వాక్యూమ్ అని అమహనీయుని నామముతో విరాజిల్లుచున్న విషయము ప్రకృతిశాస్త్రపాఠకులకు విశదమే కదా!"

—ఆంధ్ర రంగారావు.

*—The Scientific American.*

## స్వర్గత శ్రీమాన్ పండిత చక్రవర్తి శ్యామయ్యంగారు:—

"శ్రీమాన్ పండిత శ్యామయ్యంగారు 31-1-32 తేదీన నెల్లూరు రంగనాయకులపేటలో స్వగృహమున దేహమును జాలించిరని వ్రాయుట కతివిషాదముగనున్నది. బెంగుళూరుచేరువనుండు చెన్నపట్టణము వీరి జన్మస్థానము. వీరిజననము 13-9-1860. వీరిది పండితవంశ మనగా పారంపర్యముగ వైద్యవంశము. శిష్టాచారసంపత్తిగల శ్రీవైష్ణవులు. బెంగుళూరిలో శ్రీమహారాజాగారి సంస్కృతపాఠశాలయందు సాహిత్యగ్రంథములను వ్యాకరణమును బూర్తిచేసి ఆయూరనుండు శ్రీమహారాజాగారి ఆయుర్వేదవిద్యాలయమున వైద్యశాస్త్రమును సమగ్రముగనభ్యసించి వైద్యపట్టములబొంది బెంగుళూరులోని శ్రీరామచంద్రయ్యర్ ఆయుర్వేదవైద్యశాలయందు కొంతకాలము పండితులుగనుండిరి. నెల్లూరివారగు మ-రా-రా-శ్రీ రాజమంత్రప్రవీణ పల్లె చెంచల్ రావుపంతులు C. I. E. గారు కొలదికాలము శ్రీమహారాజాగారి మంత్రాలోచనసభలో ప్రధానసభ్యులుగనుండగ ఆయుర్వేదమహిమ వీరి కచట పూర్ణముగ గోచరమైయుండి ఆయుర్వేదవైద్యశాల నొకదాని నెల్లూరిలో నెలకొల్పవలయునని నిశ్చయించుకొని కొందరు ప్రముఖులసాహాయ్యమున నెల్లూరియందు 25-3-94 తేదీన యొక ఆయుర్వేదవైద్యశాలను "కర్ణాటకవైద్యశాల" యను పేరుతో స్థాపించి శ్రీశ్యామయ్యంగార్ల నందు ప్రధానపండితులుగ నేర్పాటుజేసిరి. అయ్యంగారు దీని నభివృద్ధిజేసి మహోన్నతస్థితికి దెచ్చిరి. ఆయుర్వేదవైద్యశాలల ప్రభుత్వమువా రభిమానించునటుల లెజిస్లెటివ్ సభలలో తీర్మానములు అయి 1918 ప్రాంతముల సర్కారువారు డాక్టరు కోమను ప్రభృతుల నొక కమీషనుగా నేర్పాటుచేసి ఆయుర్వేదపాఠశాలల పరిస్థితులను ఆయుర్వేదయథాపద్ధిగణ్యప్రయోజనప్రభావములనువిమర్శింప నియోగించిరి. డాక్టరు కోమన్ గారు 5-11-18 తేదీన ఈకర్ణాటకవైద్యశాలకువచ్చి అచట జరుగు చికిత్సావిశేషములను ఔషధములను చక్కగపరిశీలించి శ్యామయ్యంగార్లు ఆయుర్వేదమున మహానిపుణులని శ్లాఘించియున్నారు. ఆటుతరువాత 1922 సంవత్సరపు జనవరి కడభాగములో ఈపత్రికాధిపతులగు డాక్టరు కే. యన్. కేసరిగారు, శ్యామయ్యంగార్లులోనగు వైద్యశిఖామణులును, వైద్యవిద్యాపారంగతులును నెల్లూరులో విలసిల్లజేసినసనౌషధీసముదయప్రదర్శనమున అయ్యంగార్లు విశేషముగ శ్లాఘింపబడిరి. కర్ణాటకవైద్యశాల యేర్పడుటకుముందును నెల్లూరియందు ఆయుర్వేదప్రచారమున మెలగుచుండిన భిషగ్వరుల నేకులుండిరిగాని శాస్త్రరీత్యా దానినభ్యసించియు అభ్యసింపజేసియు ఆయుర్వేదమున కత్యంతవ్యాప్తిగలుగజేసినది కీర్తిశేషులగు శ్యామయ్యంగార్లని చెప్పనొప్పును. అష్టాంగహృదయము, చరకసంహిత, సుశ్రుతము, శార్ఙ్గధరసంహితలోనగు యుద్గ్రంథములు వారికి కంఠస్థములుగనుండినవి. వీరి సౌజన్యసౌశీల్యాదిసంపదలు, వీరి విద్యాతిశయమునకు వన్నెబెట్టునవి. ఆడువారు-పిల్లవాండ్రు-ముదుసళ్ళు లెక్కలేక విడికడజేరి మందులచీట్లు వ్రాయించుకొనుచుండుదురు. యూనానిదవాఖాన యొకటి యాయూరి నడిబజారుననున్నను మహమ్మదీయుల నేకులు ఈవైద్యశాలయందు చికిత్సకువచ్చుచుండురు. డాక్టరు కోమన్ గారి శ్లాఘావచనములలో అయ్యంగార్లును వీరిక్రిందివారును నీచోచ్చభేదములులేక సర్వత్రసమాసాదరము చూపుచుండిరని వ్రాసియున్నారు. శాంతముతోడను, దీర్ఘాలోచనతోడను వీరు చికిత్సలజేయుచుండిరి. కామిలా (కామెర్లు) క్షయ-సంజు-జన్ని-రక్తగ్రహణి లోనగు గడుసువ్యాధుల గడుకుశలతతోను సాఫల్యముగను సమర్థించుచుండిరి. సరాసరి దినమునకు మున్నూరుమందిరోగులు మందులకైవచ్చుచుండిరి. శ్రీచెంచల్ రావు

పంతులుగారుస్థాపించిన ఈగోష్ఠసంస్థకు కొలదికాలము ద్రవ్యలోపమువలని కష్టముసంగలిగినది. అట్టిసందర్భములన్నిటను అయ్యంగార్లు జంకక వెనుదీయక ధీరులై నిలచి వైద్యశాలనునిర్వహించి యుద్ధరించిరి. 1918-వ సంవత్సరమున మంకు సుబ్రహ్మణ్యశెట్టి, కృష్ణస్వామిశెట్టిగార్ల ప్రేరణవలన ఈవైద్యశాలకు కలవల కన్నయ్యశెట్టి, రామానుజంశెట్టిగార్ల ధర్మములలో ప్రవేశముగలిగి 1921 వరకు వారిచే పోషింపబడుచుండిరి. కారణాంతరములచే అసహాయము జరుగకుండునటులఏర్పడినది. అంతట జిల్లాబోర్డువారాదుకొని ఒకసంవత్సరము జరిపిరి. 1922-వ సంవత్సరమునుండి ఈవైద్యశాల మునిసిపాలిటీపరిపాలనలోకేర్పబడి నిర్భయముగనట్టియు స్థిరముగనట్టియుపదవిం జెంది వర్ధిల్లుచున్నది. వైద్యశాలప్రారంభించిన 1894 మార్చినుండి అయ్యంగార్లవారు వయస్సుమీరినవారై 22-4-31 తేదీన ఈవైద్యశాలయందలి పండితోద్యోగమును చాలించునంతవరకు జనప్రియులై పరోపకారతత్పరులై పరమశ్రద్ధాలువులై కీర్తిప్రతిష్ఠలతో తమధర్మమును పరిపాలించిరి. ఇట్లు వీరు స్వర్గతులగుట ఆయుర్వేదమండలికి తీరరానికొదువగనుండగలదు. వీరిభార్యగారును పుత్రపుత్రికాది సంతానమును పరిశిష్టులున్నారు. ఇచటి యశేషజనమును వీరలయెడల సహృదయులై సమదుఃఖభాగులయి యనుతాపము జెందియున్నారు. అయ్యంగార్లు సిద్ధపరచుచుండు శాస్త్రీయౌషధముల పేళ్లును వానివాని యుపయోగబాహుళ్యమునుబట్టి యింటివాడుకమందులై స్త్రీలు, పురుషులు, పెద్దలు, పిన్నలు వానికెల్ల యింటివాడుక పేళ్ళతోనే వైద్యశాలనుండి తెచ్చుకొనుచుండిరి. వానిలోగొన్ని ఈక్రింద పేర్కొనబడుచున్నవి. ఆదిత్యరసమాత్రలు = పుల్లమాత్రలు - హింగ్వష్టకాదిచూర్ణము = అన్నముపొడి - త్రిభావనకీర్తిరసమాత్రలు=ఎర్రమాత్రలు-అష్టాంగవటి=పెద్దనల్లమాత్రలు." —ఒంగోలు వేంకటరంగయ్య, బి.యె;బి.యల్.

హిందూ దేశపు స్త్రీలు: పాశ్చాత్యుల ఫాషనులు:—

"మనబాలికలు ఆర్యలలనలుకావలయుననియే నాకోరిక. మనబాలికలకు విద్యచెప్పింపరాదనుభావము నాకెప్పుడునులేదు. వారికి విద్య నేర్పవలసినదే కాని బాలురకుచెప్పునట్టివిద్యకు వీరికిచెప్పునట్టివిద్య విభిన్నమై యుండవలయును. దేవుని, ప్రకృతిని మనము కాదనజాలము. బాలురను బాలికలుగాను, బాలికలను బాలురుగాను చేయజాలము. ఈవిషయము అంగీకరించితీరవలయును. బాలుని ఆదర్శగృహస్థునిగను, బాలికను ఆదర్శగృహిణినిగను చేయుటయే మనఉద్దేశమైయుండవలయును. ఏమైనచెప్పుడు. ఈఇరువదియవశతాబ్దిలోగూడ స్త్రీకృత్యములను పురుషుడును, పురుషునికృత్యములను స్త్రీయు చేయజాలరు. ఈవిషయము జ్ఞప్తియందుంచుకొనక బాలికలవిద్యావిధానమును ఏర్పఱచితిమేని కోరికష్టమును తెచ్చుకొనినవారమగుదుము. 'దాస్యభావము' అనుపదము మనమిప్పుడు పలుసారులు వినుచున్నాము. ఇతరతావులయందుకంటె మనస్త్రీలయందు ఈదాస్యభావము హెచ్చుగనున్నదని చెప్పుటకు విచారించుచున్నాను. నిజమో, కాదోగాని ఒకకథగలదు. అలగ్జాండ్రా రాణి కాలుబెణుకుటచే కుంటుచునడచెను. అట్లునడచుట ఫాషనుఅనుకొని కోర్టునందలి ఇతర స్త్రీలుకూడ అట్లు కుంటుచునడువనారంభించిరి. ఫాషనువిషయమున మనస్త్రీలు ఈకథలోని స్త్రీలవలెనే యున్నారు. స్త్రీసౌందర్యమునకు శ్రీరామరక్షలనదగిన శిరోజములను కత్తిరించుకొనుపద్ధతి పాశ్చాత్యయువతులు ప్రారంభించిరి. గొఱ్ఱెదాటువలె మనస్త్రీలును ప్రారంభించిరి. ఇట్టి అకార్యకరణమునుండి మనస్త్రీలను మరలునట్లుచేయజాలనివిద్య విద్యకాదు."

—*Mahamahopadhyaya Dr. Ganganath Jha.*

స్త్రీవిద్యావిధానము:—

"స్త్రీలకు విద్య రెండువిధములుగానుండవలయును. కళాశాలవిద్యనవలంబింపదలచినవారికొకవిధముగను, ప్రత్యేకకళలునేర్వదలచినవారికి ఇంకొకవిధముగను నుండవలయును. పూనాయందలి స్త్రీవిశ్వవిద్యాలయము

నందువలె స్త్రీలకు గృహనిర్వాహకము, ఆరోగ్యశాస్త్రము, జంతుశాస్త్రము, చరిత్ర, శారీరశాస్త్రము, మనస్తత్వశాస్త్రము, శిశుహృదయపరిజ్ఞానము నేర్పవలయును. స్త్రీలను గృహనిర్వాహకురాండ్రనుగా తరిఫీతు చేయుటకు పూనవలయును. పాకకళ, శిశుహృదయపరిజ్ఞానము, ధనవ్యయవిధానము, సంగీతము మొదలగు కళలు విశ్వవిద్యాలయపుతరగతులయందు పఠనీయవిషయములుగనొనర్చుచో విద్యావతులు గృహనిర్వాహకమునుపూనుటకు వెనుకంజవైవరు. గృహవిద్యావిషయికమగు ప్రత్యేకస్త్రీకళాశాలలను నిర్మించుప్రయత్నములు ఢిల్లీయందు సాగుచున్నవి. అవి నెఱవేఱునుగాక!"

—*Miss D'souza.*

## చీనా దేశపు సేనలో స్త్రీలు:—

"జపానుసేనలతో డీకొనిపోరుచున్న చీనావీరుడు చాన్ పాన్ సేనలలో ఒకజట్టు స్త్రీసైనికులుగలరు. వారాసైన్యమునందలిపురుషులతో యుద్ధనైపుణ్యమున ఎంతమాత్రమును తీసిపోవువారుగారు. చీనాదేశపు సైనికురాలు పురుషోచితమైన దుస్తులుధరింతురు. రైఫిలు, బాయినెట్లుదాల్చెదరు. శత్రువును డీకొనుట యందును, శిబిరమునురక్షించుటయందును ఇంతవఱకుజరిగిన కయ్యములయందు వారు ధైర్యసాహసములను ప్రకటించిరి. అచ్చటిప్రస్థానములు సాంద్రారణ్యములగుండా. అయినను ఆస్త్రీలు వానికివెనుకంజవైవరు. సైనికజీవితమువలన తమకుగలుగుచున్న కష్టములకు విసిగికొనరు. వారు నిజమైనవీరనారులు. దారిద్ర్యపీడిస్థితి యందుండిన మగవారికిచెందిన ఈస్త్రీలకు పోట్లాటయనిన ఆలవోకయైనది. చీనాదేశపు ఉత్తరప్రాంతము లందలి ఆరణ్యభాగములలో ఇట్టిస్త్రీలు పలువురుగలరు. ఈఇరువదియవశతాబ్దమున ఇట్టివీరనారులు మన మూహించినంత సకృతుగాదు. ఒకటిరెండుసంవత్సరములక్రితము మంచూరియాభాగమున దాదాపు ఎనుబది మంది రష్యాదేశపుస్త్రీలు యుద్ధముచేసి చక్కనిస్థానికచరిత్రను నిర్మించియున్నారు. హార్బిన్ ప్రాంతము లందలిమగవారు కారణాంతరములచే తమజన్మస్థలమునువదలి చీనాసేనామలసైన్యములందు చేరవలసివచ్చినది. యుద్ధప్రశంసనుకోరి మగవారు దేశమునువిడువగా స్త్రీలు గృహకృత్యములనుచేయుట తప్పుగాభావించి వారును సైనికవృత్తినవలంబించిరి. వారు నేరుగా దక్షిణమునకువచ్చి చాంగ్ చంగ్ చాంగునుదర్శించి తమ్ము సైనికులుగాచేర్చుకొనమనికోరిరి. దానికి అతడు ఆశ్చర్యపడి వారికి సాధారణమైనఉద్యోగములిత్తుననెను. వారు వలదనిరి. 'మేము యుద్ధముచేయుటకువచ్చితిమి. నీవు మా సేవనుగ్రహింపవా మఱియొకరుగ్రహింతురు' అని వారనిరి. చేయునదిలేక అతడు వారిని తనసేనయందుచేర్చుకొనెను. ఆస్త్రీలు ప్రత్యేకమొకజట్టుగా నైరి. వారు ప్రత్యేకముగ నాయకులనెన్నుకొనిరి. వారికి ప్రత్యేకమగువిధులు నేర్పడెను. రైఫిల్, బాయి నెట్టులతోడు వారు పిస్టలులకూడధరించిరి. యుద్ధములో అమితధైర్యమును ప్రదర్శించి తమనాయకుని పూర్ణ విశ్వాసమునుగొనిరి. యుద్ధముతీరి శాంతినెలకొనినపుడు వారిజన్మస్థలమగు హార్బిన్ పోవుటకు ఎంతయోమంది మిగులలేదు. ఆప్రాంతముననే బ్రేజిల్ నడుమను మాటోగ్రాసో అనబడుప్రదేశమున నేటికిని సాంద్రారణ్యములుగలవు. ఆప్రదేశము ఇప్పటికిని తెల్లవానికాళ్ళచేతొక్కబడనిది. అక్కడ వీరనారులుగలరనియు, వారిసంగతితెలిసికొనుటకు న్యూయార్కుశాస్త్రవేత్తలు వెడలుచున్నారనియు తెలియవచ్చెడిని. ఇది కట్టుకథ గాదు. దేహదార్ఢ్యము, ధైర్యగరిమగలిగి విషలిప్తములగు ఈటె, బాణములతో యుద్ధముచేయుచు ఆస్త్రీలు ఆఅడవియందు జాతివైరమున ప్రేరితులైతిరుగుచుందురనియు, పురుషులు ఇంటనుండి ఇంటిపనిని చేయు చుందురనియు తెలియుచున్నది. అచ్చటిమగవారికి ఎట్టిఅధికారమునులేదు. ప్రతివిషయమునందును పైచేయి స్త్రీదే."

—*Daily Herald.*

## సినేటరుగా ఎన్నుకొనబడిన అమెరికను స్త్రీ:—

"అమెరికా యునైటెడ్డుస్టేట్సు కాంగ్రెసుచరిత్రలలో ప్రథమపర్యాయము ఒక స్త్రీ సినేటరుగా నున్నది. అమెరికా సినేటులో తొంబదిరెండుగురు సభ్యులు. వారందరును పురుషులే. డిసెంబరు 8-వ తేదీని హాట్టీ కారావేసతి అందు ఖాళీయైనఒక స్థానమునకు నియమింపబడెను. ఆమెభర్తమృతిచేతనే ఆస్థానము ఖాళీయైనది. జానెవరి 12-వ తేదీవఱకు ఆమె ఈస్థానమునందుండును. అప్పుడు తిరిగి ఎన్నికలుజరుగును. అందు జయమును గాంచి ఆమె సినేటుకుఎన్నుకొనబడిన ప్రథమసభ్యురాలు కాగలదు. సినేటులో ఈమెఒక్కతే సభ్యురాలు. హౌసు ఆఫ్ రిప్రజెంటేటివ్సునందుమాత్రము ఆర్గురుస్త్రీలు సభ్యులుగానున్నారు. అందుముగ్గురు ఫ్లోరెన్సు ఖహన్, ఎడిత్ నోర్సురోజర్సు, ఇ. డింజో అనువారలు ప్రథమమున తమభర్తలు ఖాళీచేసినస్థానములకు ఎన్నుకొనబడి రెండవసారి తమస్వంతహక్కులమీదనే ఎన్నుకొనబడిరి. మిగిలినముగ్గురును మేరీటి నార్టన్, రూత్ బ్రియాన్ ఓవెన్, రూత్ ప్రాట్ అనువారల స్వంతహక్కులమీదనే ఎన్నుకొనబడిరి."

*—International Women's News.*

## బర్మాకౌంసిలు సభాప్రతినిధురాలివచనము:—

"బర్మాకౌంసిలు సమావేశమున సభ్యురాలగు మిస్. మేయూంగ్ గారు నూతనరాజ్యాంగసంస్కరణములయందు స్త్రీలకు పురుషులతో సమానమైనవోటింగుహక్కునుకోరెను. "మైనారటీలు, మఱియు నితర సంస్థలవారు సమానమైన హక్కులకొఱకును, సమానమైన అవకాశములకొఱకును కోరియున్నారు. ఏఒక్కరికిని ఎక్కువ అవకాశము ఈయరాదని సర్వసాధారణముగ అంగీకరింపబడుచున్నది. ఏఒక్క మైనారిటీకంటెను మాస్త్రీసంఘము ప్రముఖమైనదని మేముచెప్పగలము" అని ఆమెవచించెను.

*—The Vote.*

## సువాసనః దాని ప్రభావము:—

"వాసనపట్టగలస్వభావము కొన్నిజంతువులలోకంటె మానవునియందు తక్కువగానున్నది. కాని మానవునియందు ఈస్వభావము అతని చురుకుతనమునకు సహకారిగా నున్నది. వాసనతగిలినతోడనే మానవుడు ఎన్నోవిషయములను విస్మరింపబడినవానిని స్మృతికి తెచ్చుకొనుచున్నాడు. శాస్త్రప్రసిద్ధమైన ఈవిషయమునే కిప్లింగుకవి 'హృదయతంత్రులనుమీటుటకు శబ్దము, దృశ్యము వీనికంటె వాసన శక్తిమంతము' అనిచెప్పియున్నాడు. భావనాబలమును వాసన పెంపొందించుననుటకు నిదర్శనములుగలవు. మాడేమ్ డార్లీ అను బెల్జియము నటకురాలు క్రొత్తకీర్తన ప్రారంభించునపుడెల్ల క్రొత్తవాసనద్రవ్యమును గ్రహించుచుండును. అట్లు గ్రహింపకయే ఆమె కీర్తన పాడ ప్రారంభించునో అదిరక్తికట్టదు. సీమరేగుపండ్ల కుళ్లింపుతో నిండారియుండుగదియందు కూర్చుండి గ్రంథరచనము సాగించుచో షిల్లరు అనుజర్మనుకవీశ్వరుడును, నాటకకారుడును ఉత్సాహముతో పనిచేయువాడు. అట్టివాసనలేనిచో గ్రంథరచనము తిన్నగసాగునదికాదు. ఈవాసనలయందును మానవుడు భిన్నరుచులుకలవాడు. ఒకరికి కిట్టినవాసన మఱియొకరికికిట్టదు. సాధారణముగ పురుషులకంటె స్త్రీలు వాసనను హెచ్చుగ ప్రేమింతురు. కాని దీనికి మినహాయింపులు లేకపోలేదు. నీరోచక్రవర్తి అత్తరువు లనిన చెవికోసికొనువాడు. నెపోలియనుచక్రవర్తి తానుపుట్టిన కార్సికాద్వీపమునుగూర్చి 'ఆవాసనద్వీపము' అనువాడు. షేక్సుపియరునాటకములందును, పద్యములందును సువాసన పలుతావుల స్మరింపబడినది. హేవలక్ ఇల్లిస్ సువాసనవిషయమై దీర్ఘపరిశ్రమచేసి మానవజాతిలో సువాసనను పసిపట్టుటయందు స్త్రీలకంటె పురుషులు నేర్పరులని తేల్చెను."

*—The Indian and Eastern Druggist.*




**విచిత్రమైన ఊయింగు పద్ధతి:—**

అట్లాంటికుమహాసముద్రమున దక్షిణమున ట్రిస్టన్ డాకున్హా అను ద్వీపముగలదు. ఆద్వీపవాసుల విచిత్రమైన ఆచారములలో వారి ఊయింగు పద్ధతియొకటి. ఒకడు ఒకతెను వివాహమాడదలచినచో అతడు తాను వివాహమాడదలచిన కన్యయింటికిపోయి వారివంటయింట ప్రతిదినమును కొన్నిగంటలు కూర్చుండవలయును. విశేషప్రసంగము చేయరాదు. కొన్నిమాసములు జరిగినపిమ్మట కన్య అతనితల్లివద్దకుపోయి అతనిబట్టలు ఉతుకుటకు అనుజ్ఞ కోరును. వివాహమునకు వారు ఒండొరులు సమ్మతించిరనుటకు ఇది చిహ్నము.

**కలకత్తా విశ్వవిద్యాలయము: మెట్రిక్యులేషను పరీక్షాభ్యర్థులు:—**

గతవత్సరము కలకత్తా విశ్వవిద్యాలయము వారి మెట్రిక్యులేషను పరీక్షకు 19,077 మంది అభ్యర్థులు. ఈవత్సరము మరి వేయిమంది ఎక్కువ అభ్యర్థులున్నారని తెలియుచున్నది.

**గుడ్లగూబవంటి ముఖముగల బిడ్డ:—**

శరన్ జిల్లాకు చెందిన శివన్ వందు ఒక మంగలిస్త్రీ ఆడశిశువును ప్రసవించెను. ఆశిశువునకు రెండుతలలు గలవు. ముఖముగుడ్లగూబముఖమును పోలియున్నది. అరుపుకూడ గుడ్లగూబ అరుపువలెనే ఉన్నదని చెప్పబడుచున్నది. ఆశిశువు ఒకరోజుమాత్రము బ్రతికినది.

**జర్మనీలో స్త్రీ వోటర్లు:—**

మొత్తము 44 మిలియన్లుగలరు. అందు దాదాపు 22 మిలియన్లమంది ఓటర్లు స్త్రీలే.

**ఇక గుఱ్ఱుపట్టరాదు:—**

గుఱ్ఱుపట్టు చెడుఅలవాటుగలవారు ఆచెడుఅలవాటును తప్పించుకొనుటకు ఒక క్రొత్తయంత్రము కనుగొనబడినది. ఆయంత్రము మిక్కిలిచిన్నది. నిద్రపోవుటకుముందు ముంజేతికిగాని శరీరమునకు మరియేభాగమునకుగాని పెట్టుకొని పండుకొనవలయును. గుఱ్ఱుప్రారంభముకాగానే సన్ననిసూదులతో చిన్నపోట్లు పొడుచును. అందుతో గుఱ్ఱుపట్టువానికి మెలుకవ వచ్చును. ఈయంత్రమిప్పుడు పేటెంటు చేయబడినది.

**కప్పలు రవానా సరుకు:—**

ఆఫ్రికాలోని కేపుటవున్ నుండి లండనుకు గ్నాస్పా అనబడు జర్మనుఓడపై ఈనడుమ నాలుగువందల కప్పలు—జీవించుచున్నవి—రవానా చేయబడెను. అవి మంచుగడ్డలోనుంచబడి జాగ్రత్తగ ప్యాక్ చేయ

బడెను. వాతావరణము సరిసమానముగనుండుటవలన అభివర్ధించబడెను. ఈకప్పలు ప్రొఫెసరు లాన్సిలాట్ హాగ్ బెనుగారు లండనులో గావించుచున్న పరిశోధనలకు కావలసియుండెను. ఈరీతి కప్పలు ఇంగ్లండులో లేవు.

**పాము కడుపులో కడుపుతో ఉన్న బాతు:—**

దక్షిణఆఫ్రికాలో నొకచోట పదునాలుగుఅడుగులపామును ఒకకృషీవలుడుచంపి దానినికోసిచూడగా దానికడుపులో ఒకబాతుకానవచ్చెను. ఆబాతునుకోసిచూడగా దానికడుపులో ఒకపిల్లకానవచ్చెను. ఒకే గుటకలో రెండుప్రాణులను మ్రింగుట పరిశోధనచేకమునగాని రికార్డుచేయబడుటకు ఇదియే ప్రథమమట.

**నిరుద్యోగుల కష్టనివారణకు సింహము పిల్ల.—**

బుడాపెస్టుఅను పట్టణమున నిరుద్యోగులకష్టనివారణకుగాను ఒకసంఘము ఏర్పాటుచేయబడెను. నిరుద్యోగులు రొక్కరూపముగ ఈసంఘమునకు సాయము చేయజాలరు కావున వస్తురూపకమగు చందాలనుపంపవలసినదిగ కోరబడిరి. ఒకడు ఈసంఘమునకుబాగుగాఎదిగిన సింహముపిల్లను బహుమానముగానిచ్చెను. ఆసంఘకార్యనిర్వాహకవర్గమువారు సమావేశమై నిరుద్యోగులీసింహముపిల్లను ఎట్లుపయోగింపగలరో తమకు తెలియుటలేదనియు, దీనిమాంసమును తినవలసినదిగా నిరుద్యోగులను తాముకోరజాలమనియు, ఈకఱవుకాలములో ఈసింహముపిల్లనుకొనువారుకూడ ఉండరనియు, కావున ఈబహుమానమును వందనపూర్వకముగ వాపసుచేయుచున్నామనియు తీరుమానించిరి.

**పదునాలుగేండ్ల బాలిక బాలుడగుట:—**

నాపెల్సుసముద్రతీరమున ఒకబాలికబాలుడుగా మారెను. పదునాలుగేండ్లువచ్చువఱకు ఆమెబాలికగా తలంపబడెను. 1917-లో ఆమె తమకుగలిగెననియు, ఇంతపర్యంతము బాలికగాతలంపబడెననియు తల్లిదండ్రులుచెప్పిరి. డాక్టరు పరీక్షచేసి ఆమె ఇప్పుడు బాలుడుగామారెననియు, గడ్డమువచ్చు సూచనలు కలవనియు తెల్పెను. ఆమె పూర్తిపురుషలక్షణములను పొందుచో తాము క్రొత్తతావునకు పోవుదుమని తల్లిదండ్రులు చెప్పిరి.

**పదునెనిమిదేండ్ల యువకుడు యువతిగా మారుట:—**

పురుషునికి సహజములగు లక్షణములను గోల్పోయి స్త్రీ కుండవలసిన లక్షణములను పొందిన యొక అపూర్వసందర్భము లాహోరు మేయో ఆసుపత్రిలో సంఘటిల్లినది. అమృతసరమునందలి ఖాల్సాకళాశాల విద్యార్థి 18 ఏండ్ల యువకుడు, తనదేహమునందలి కొన్ని అవయవములలో కొవ్వు చేరుచున్నదని మందుకు వచ్చెను. లాహోరు మెడికల్ కాలేజి ప్రధానాచార్యుడు యువకుని పరీక్షింపగా నడుముక్రిందినుండి కాళ్ళవరకు పురుషచిహ్నములుపోయి యువతీచిహ్నము లేర్పడుచున్నట్లును వక్షస్థలమునందుపయోధరములు దినదిన ప్రవర్ధమానములగుచున్నట్లును స్పష్టముగా కానవచ్చెను. —ఆంధ్రపత్రిక.

**ఒకేకాన్పున ముగ్గురుబిడ్డలు:—**

తిరుత్తనికి కొలదిదూరమునగల నెడుంబరము గ్రామమునందలి బలిజకులమునకు చెందిన ఒకస్త్రీ మార్చి రెండవవారమున ఒకేకాన్పున ముగ్గురుబిడ్డలను ప్రసవించినది. ముగ్గురును ఆడపిల్లలే. పుట్టినకొద్దిగంటలకే వారు మరణించిరి. తల్లి సురక్షితముగానున్నది.

**మదరాసు విశ్వవిద్యాలయము: స్కూలుఫైనలు పరీక్షాభ్యర్థులు:—**

1927 లో మదరాసు విశ్వవిద్యాలయమువారి స్కూలుఫైనలు పరీక్షకు అభ్యర్థులు 15,587. 1931 లో 21,947.




**పురుషవేషమునున్న బర్మా స్త్రీ ఎరస్టు అగుట:—**

మార్చి 5-వ తేదీని మాండలేలో నొక విచిత్రసంఘటనము జరిగినది. ఒక బర్మాయువతిని పురుషోచితములగు దుస్తులు ధరించియున్న దానిని సబ్ డివిజనల్ మేజిస్ట్రేటుగారి చెంతకు గొనివచ్చిరి. ఆమె దుఃఖించుచుండెను. రోగగ్రస్తగా కానవచ్చెను. ఆమె వృత్తాంతము కేవలదుఃఖకథనమేగాక ప్రేమకథనముకూడనై యుండెను. ఆమె పేరు మామ్యాలే. పెగూయందలి ధాన్యప్రమరస్వానుదారుడగు నొక వర్తకుని కొమరుని మాంగ్ కోగ్యిఅను పేరుగలవానిని ఆమె ప్రేమించుచుండెను. అతనితోడి ఆమె వివాహమునకు ఆమెతల్లిదండ్రులు ఒప్పుకొనలేదు. అందుమీద ఆయువకుడును, ఆయువతియు ఇహలోకసౌఖ్యములను విడనాడి వానప్రస్థులగుటకు నిశ్చయించిరి. శాగయింగులోనున్న వానప్రస్థాశ్రమమున చేరుటకు వారు బయలుదేరిరి. ప్రయాణావసరమున ఇతరుల అనుమానమును తప్పించుకొనుటకు అతడు ఆమెను పురుషునివలె దుస్తులు వేసికొనవలసినదిగా కోరెను. దానిపై నామె శిరోజములను ముండనముగావించుకొనెను. ఇతరమగుమార్పులు గావించుకొనెను. మగదుస్తులుధరించెను. వారు మాండలేవచ్చువఱకు సర్వము సవ్యముగా సాగిపోయెను. అచ్చట పోలీసువారు తప్పించుకొనిపోయిన ఒక స్త్రీకొఱకు వెదుకుచుండిరి. ఆస్త్రీరూపురేఖలు కొంతవఱకు ఈస్త్రీరూపురేఖలతో జతపడుచుండుటచే పోలీసువారీమెను ఎరస్టుచేసి మేజిస్ట్రేటునెదుట బెట్టిరి. అచ్చట వీరికథ బయలుపడెను.

**దొరగారికి జ్యోతిషమునమ్మకము:—**

టెయిలరుఅను బ్రిటనుదేశీయుడు 25 ఏండ్లక్రితము బొంబాయిలో నొకపత్రికాకార్యాలయమున నుద్యోగిగానుండెను. అపుడతనికి ప్లేగువ్యాధివచ్చినది. పెక్కువారము లతడు బాధపడెను. ప్రాణాపాయము తొలగినదిగాని దీనిఫలితము యెన్నటికిని పూర్తిగతొలగదుఅని డాక్టరుచెప్పెను. అటుపిమ్మట టెయిలరుగారినవుకరు ఒకగుజరాతిజ్యోతిష్కుని తీసికొనివచ్చెను. అతడు యేవో మంత్రతంత్రములు చేయుచు చాల రోజులు చికిత్సచేసెను. టెయిలరుగారికి స్వస్థతకలిగినపిమ్మట ఆజ్యోతిష్కుడు భవిష్యత్తుచెప్పెను. "మీకు పెళ్లియగును. ఇద్దరుబిడ్డలుపుట్టెదరు. మీరు యుద్ధములో పనిచేసెదరు. తరువాత మీకు జబ్బుచేయును. కడపట మీరు లండనులో పనిచేయుదురు. 1932 లో మీరు చనిపోయెదరు" అని అపుడు ఆజ్యోతిష్కుడు చెప్పెను. అతడుచెప్పినరీతిగా అన్నియునుజరిగినవిగాన యీసంవత్సరము నేను మృతినొందవలసియున్నది. ఏదియెటులజరిగినను నాకు విచారకరములేదు. అంతయును అదృష్టముప్రకారమేజరుగుచుండును" అని టెయిలరుగారు డెయిలీమెయిలుపత్రిక విలేఖరితో తెలిపెను.

—ఆంధ్రపత్రిక.

**భార్యకంటె ప్రాణముహెచ్చుకాదు:—**

సైన్యమున ఉద్యోగమునకుకుదిరియున్న ఎ. కుక్కు అనువాడు తనభార్య రోగగ్రస్తయైయున్నదని రేడియోవార్తరాగానే ఆమెయున్న స్కెగ్నెస్సుకువెడలిపోయెను. అధికారుల అనుమతిపొందనిదే ఎవరును

సైన్యమునువదలరాదు. కావున ఇంటికి చేరుటతోడనే ఎ. కుక్కను ఎరస్టుచేసి కోర్టునకుకొనివచ్చిరి. కోర్టులో అతడిట్లుచెప్పెను. "నేను ఇంటికి చేరుటతోడనే నన్ను ఎరస్టుచేయుదురని నాకు తెలియును. కాని ప్రేమ చెఱసాలనుకూడ లక్ష్యముచేయదు. నాపేరు ఎ. కుక్క. నావయస్సు 26 సంవత్సరములు. చిరునామా యార్కుకోర్టు, కాన్‌టన్‌బరీ."

### ఓ చెఱసాలా! ఈ స్థితికి వచ్చితివా?:—

బొంబాయిలో భాయిపత్రిక వ్రాసినందుకు ఎరస్టుచేయబడిన తులసీదాసునల్లభతీ కేసు విచారణ. అతని దుస్తులు అతివిచిత్రముగనుండెను. క్రిందిదుస్తులు హిందువువలె, టోపి రైలులో బొగ్గువేయువానిటోపి. కోర్టువారుఅడుగకయే అతడు కోర్టులో ఇట్లుఅరచెను. "నేను విచారించుచున్నాను. మిక్కిలి విచారించుచున్నాను. నేనిట్టివి ఇకవ్రాయనని వాగ్దానము చేయుచున్నాను. నేను కాంగ్రెసుమనిషినని ఎవరుచెప్పిరి? నేను కిరస్తానీవాడిని." అరవబడదని మేజస్ట్రేటు చెప్పెను. దానిమీద అతడు "నేనుఅరవవలెను. చెఱసాలకు పోవడము నాకుఇష్టములేదు" అనెను. "నేను క్షమాపణ చెప్పినప్పటికిని నన్ను వదలిపెట్టరా?" అని అతడడిగెను. వానివర్తనము విచిత్రముగనుండెను. ఇకఇకలు, పకపకలు, తలత్రిప్పులు, హస్తచాలనములు. పోలీసువారు జోక్యముకలిగించుకొనవలసివచ్చెను. ఒకపోలీసుఉద్యోగి ఈతనివైపు వేలుచూపెను. ఈతడు ఆఉద్యోగివైపు వేలుచూపెను. పోలీసులు దగ్గరకురాగానే నేను రాజభక్తుడనుఅనును. దూరముపోయిన తనకోతిచేష్టలు తిరిగిప్రారంభించును. ఆరునెలలుశిక్షయు, రు. 20 జరిమానా, చెల్లింపనిచో ఒకమాసము అదనపుశిక్ష విధింపబడెను. ఇదివిని అతడు పెద్దగొంతుకతో 'ఓ! చెఱసాలా! ఈస్థితికివచ్చితివా?' అనిఅరచెను. అరచి కోర్టువారికి మొక్కి నాటకములోని పాత్రవలె కోర్టునువదలెను.

### ఆఫ్గను స్త్రీల సాహసము:—

స్వాతంత్ర్యమునకై పోరాడిన సమస్తదేశముల చారిత్రములును త్యాగసాహసములప్రకటించు అనేక దృష్టాంతములతో విరాజిల్లుచున్నవి. మొన్నటి ఆఫ్గనువిప్లవములో జరిగిన ఒకయంశమును సర్దారు ఇక్బల్ అలీషాగారు ఇటీవల లండనులో చేసిన ఒకప్రసంగమునందిట్లు తెలియజేసిరి. ప్రకృతము ఆఫ్గనిస్థాన సింహాసనము నధిష్ఠించియున్న నాదర్షాప్రభువు కాబూలుపట్టణములో ఒకానొకదుర్గమును పట్టుకొనుటకై ప్రయత్నించుచుండెను. ఆకోటలోనే అతనిసహోదరియొక్కతె శత్రుహస్తములలో జిక్కి బందీకృతురాలై యుండెను. ఫిరంగులుకాల్చి దుర్గమును స్వాధీనముచేసికొనుటకై విప్లవకారులు ప్రయత్నింతురేని గుండుదెబ్బచే చనిపోవుటకు వీలగునట్లు ఆరాజకన్యను తెచ్చి అడ్డముగా నిలువబెట్టుదుమని కోటనురక్షించుకొనుటకై ప్రయత్నించుచున్న సైనికులు నాదర్షాప్రభువునకు తెలియజేసిరి. దుర్గమునందు బంధింపబడియున్న యానారీమణి రొట్టెలులనో ఒకకాగితపుముక్కపై నొకవాక్యమువ్రాసి అన్నగారికిపంపెను. ఆఫ్గనుజాతియొక్క క్షేమమునకై మాప్రాణములను గోల్పోవుటను మేము గౌరవముగాభావింతుమని ఆమె పంపినసందేశము. ఫిరంగిగుండ్లను ప్రయోగించి కోటనువశముచేసికొనుటకై నియోగింపబడిన సర్దారుయొక్క తల్లియు ముగ్గురు తోబుట్టువులుగూడ కోటలోబంధితులైయుండిరి. తనదాడిని ప్రారంభించుటకు పూర్వము సేనాధ్యక్షుడు దూరదర్శినీయంత్రసాహాయ్యమున కోటపైపునకు చూడగా సరిగా ఫిరంగిగుండ్లుతాకుస్థలమున స్త్రీలుకొందరు బారుగా నిలువబెట్టబడియుండిరి. వారిలో తమఆడువాండ్రుగూడ గలరని అతడెఱుంగును. అయినను అతడు గుండునుప్రయోగించెను. కాని కోటయంతయు దాదాపుగా ధ్వంసమైపోయినను దైవకృపవలన ఆ స్త్రీలలో నొక్కరికిని అపాయముకలుగదయ్యెను. తమదేశశ్రేయస్సునకై తమప్రాణముల బలిదానముసేయ నియ్యకొన్న ఆఫ్గనునారీమణుల చరిత్రము ప్రపంచమున చిరకాలము స్మరింపబడును. —ధర్మసాధని.

శిశుసహాయకసంఘము, మదరాసు




బాలికలఆట

శిశుసహాయకసంఘము, మదరాసు




సంఘము వారి మందిరము




వెలగఆకు వెదురుఆకులు వీట్లను సమముగానూరి కల్కముజేసి వాటిలో తేనెవైచికలిపి పుచ్చుకొనిన తీవ్రప్రదరరోగము మానును.

అశోకవృక్షముయొక్క పట్ట, లేదా శుద్ధప్రదేశమునందుజనించిన చిత్తివేరును రసాంజనము వీటిని బియ్యపుకడుగుతోనూరి అందు తేనెవైచి యారసమును పానముజేసి లేని ప్రదరము నివర్తియగును.

ఉసిరికకల్కమును నీటిలోకలిపి కండచక్కెర; తేనెకలిపిగాని; ఆరెపూవులను తాడిదుంపిరికరసములలో తేనెకలిపిగాని ప్రదరరోగులు త్రాగుటమంచిది.

ప్రత్తివేళ్ళు బియ్యపుకడుగుతోనూరి త్రాగిన ప్రదరరోగములునశించును.

అశోకపుచెక్కతో వాన్చినపాలను కాచిచల్లార్చి బలానుసారముగా ప్రదరరోగులు ప్రాతఃకాలమున సేవించిన మంచిది.

రేగుచూర్ణములో బెల్లముకలుపుకొని పాలతో త్రాగిన ప్రదరములునశించును.

దర్భవేళ్ళను లేదా నేలఉసిరిక వేళ్ళనుగాని బియ్యపుకడుగుతోనూరి కల్కముజేసి 3 రోజులుత్రాగిన ప్రదరములుమానును.

ఆరెపువ్వు, పోకపూలు వీటిని కషాయముపెట్టి 3దినములుపుచ్చుకొనిన దుస్తరమైన ప్రదరరోగము నిశ్చయముగ నివర్తియగును.

వాకుడు సమూలరసముపూసిన కాళ్లపైన పొక్కులతోవున్న మంటలునయమగును.

వాకుడు సమూలమును నీడనుయెండించి కాల్చి చేసినభస్మమును (మోతాదు 3 చిన్నములయెత్తు) తేనెతోగాని, గంటుభారంగి, అక్కలకర్ర, శొంఠి మొదలగు శ్లేష్మహరవస్తువులచూర్ణము తేనెతోగాని యిచ్చిన సమస్తకాసశ్వాసలు, క్షయలు నివర్తించును.

వాకుడుకాయ, పండురసము లోపలికిచ్చిన గొంతుకపుండురోగమును పోగొట్టును.

వాకుడుగింజల పొగబట్టిన పంటినొప్పిహరించును.

కంటకారికషాయములో పిప్పళ్లను చేర్చికొని త్రాగిన పన్నివిధములగు దగ్గులు తగ్గిపోవును.

వాకుడువేరు కషాయములో సైంధవలవణము, ఇంగువకలిపి అప్పుడప్పుడు వచ్చేదగ్గులయందు ఈయనగును.

వాకుడు, ఉలవలు, అడ్డసరపాకు, శొంఠి వీటిని కషాయముపెట్టి యందు కోష్ఠచూర్ణమునుకలిపి పుచ్చుకొనిన శ్వాసకాసలు హరించును.

వాకుడు, అడ్డసరము, తిప్పతీగె వీటినికషాయముపెట్టి యందు తేనెకలిపిపుచ్చుకొనిన కాసజ్వరములు నశించు.

రెండువిధములవాకుడు, శొంఠి, ధనియాలు, దేవదారుపట్ట వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన సర్వజ్వరములు హరించు.

వాకుడుగింజలముద్ద పట్టించుటచే మొండివ్రణములుమానును.

# డైరి

## ఫిబ్రవరి

17:—మంగళగిరి. ముప్పలనేని పుష్కరాంబ, గాంధి జనార్దనమ్మ, తెలగా నాగరత్నమ్మగార్ల అరెస్టు. విడుదల.

18:—తెల్లచేరి. నంబియారుఅమ్మ, మధురఅమ్మగార్లకు చెరి 6 నెలలు కఠినశిక్ష, 50 రూప్యములజరిమానా, లేదా మరి 1 నెలశిక్ష.

:—గుడివాడ. శ్రీమతులు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, త్రిపురనేని కౌసల్యాదేవి, అరికెపూడి కృపామణియమ్మగార్ల పికెటింగు. పోలీసులు రంగునీళ్లుపోయుట, దూరముగ తీసికొనిపోయి వదలుట.

19:—బంకూరా. శ్రీమతి వనీబాలాగుహ, సుశీలదేవిగార్లకు 3 నెలల కఠినశిక్ష.

:—బొంబాయి. ఊర్మిళా మెహతాగారియిల్లుసోదా.

:—గయబంధ. ప్లీడరు వేణీమాధవదాసుగారిభార్య దక్ష్యబాలాదేవిగారికిని, మరి 4 గురు స్త్రీలకును 144 మీరినందుకు 6 నెలలు కఠినశిక్ష, రు. 50 జరిమానా.

:—లాహోరు. జానకి జుట్షికుమారి యం. ఏ. గారిపై నోటీసు. లాహోరుదాటి పోగూడదు, అక్రమ సంఘములో చేరరాదు.

:—పాట్నా. క్రిమినల్ లా అమెండుమెంట్ ఆక్టుక్రింద 4 నెలలు విడి ఖైదు, జరిమానాకుబదులు 1 వారము విడిఖైదు ధన్వంతరీదేవిగారిపై విధింపబడియుండెను. ఈమెకు 7 నెలల పిల్లయుండినను, ఆపిల్లను తల్లి చెరసాలకుగొంపో నిరాకరించుటవలన ప్రభుత్వమువారు ఈమెపై విధింపబడినశిక్షను రద్దుచేసిరి. విడుదలయైనతరువాత మరల విప్లవోద్యమమునందు ఆమెపాల్గొనినచో దాక్షిణ్యముచూపబడదని ప్రభుత్వమువారు ఆమెను మందలించిరి.

20:—లాహోరు. శ్రీమతి ప్రతిమాదేవి 108 క్రి. ప్రొ. కో. క్రింద అరెస్టు. 3000 జామీను, లేదా 1 ఏడు శిక్ష. ఆమె శిక్షననుభవించుటకు అంగీకరించెను.

:—మున్షిగంజ్. బెజ్ గోస్ యూనియన్ బోర్డును పిక్కెటుచేసినందులకు శ్రీమతులు చారుబలకుందు, బగలనుందరిశీలగార్లకు కోర్టులేచువరకు శిక్ష.

21:—కలకత్తా. బెతూన్ బాలికాపాఠశాలనుండి 40 మంది బాలికలను నిబంధనలకు వ్యతిరేకముగా నడిచినందుకు వెడలగొట్టిరి.

:—బాపట్ల. శ్రీమతులు పోలూరి అన్నపూర్ణమ్మ, తన్నీరు సీతారామమ్మ, బొడ్డుపల్లి రామశేషమ్మ, గార్లు కరపత్రములుపంచుచుండగా పోలీసువారు వారిని స్టేషనుకు తీసికొనివెల్లి రాత్రి 8-30 గంటలకు తిరిగి వదలివేసిరి.

22:—మలబారుజిల్లా తెల్లిచ్చేరిలో ప్రభుసతి మంగళసూత్రమును తెంపించిన మేజస్ట్రేటు క్షమాపణచెప్పెను. అందుపై ప్రభుత్వమువా రొకప్రకటనగావించిరి.

:—బొంబాయి. ఊర్మిళా మెహతాగారికి 6 నెలలు కఠినఖైదు, రూ. 300 జరిమానా.

:—లాహోరు. డి. ఏ. వి. కళాశాలలో ఆచార్యుడైన బహదర్ మల్ యమ్. ఏ. గారికోడలు, 20-వ నియంత్రి శాంతాదేవియరెస్టు.

23:—కల్లికోట. పురపాలకసంఘసభ్యురాలు ఎ. వి. కుట్టిమాళ్ళమ్మాళ్ గారికిని, మరి యిద్దరుస్త్రీలకును రెండేసిసంవత్సరముల కఠినశిక్షపడెను.

:—లాహోరు. శ్రీమతి సావిత్రిదేవిగారు క్రిమినలులా సవరణచట్టముక్రింద అరెస్టుచేయబడిరి.

:—బంకూరా. మహిళారాష్ట్రీయసంఘమునకు చెందిన శ్రీమతి శైలాబాలాదేవుగారికి 4 నెలల విడిశిక్షపడెను.

:—డక్కా. శ్రీమతి సరోజబాలాఘోషు, మరి 7 గురుస్త్రీలు మాల్యా-నగరం యూనియనుబోర్డును పికెటింగుచేసినందుకు అరెస్టు.

:—బాలురిఘట్. శ్రీమతి సురేంద్రబాలారాయిగారికి క్రి. ప్రొ. 143 క్రింద 6 నెలల కఠినశిక్ష, 188 సెక్షనుక్రింద మరి 6 నెలల కఠినశిక్షపడెను. ప్రజేశ్వరిదాసి, ప్రసన్నకుమారిదాసిగార్లకు చెరి 70 రూ. జరిమానా. చెల్లింపనిచో 6 వారముల శిక్షపడెను.

24:—20-వ తేదీని భట్టిప్రోలులో ఎరస్టుచేయబడిన మద్దుల రామాయమ్మగారికేసు నరసారావుపేటలో విచారింపబడెను. 6 నెలలు విడిశిక్షపడెను. రూ. 250 జరిమానా. బి. క్లాసు. మద్దుల వేంకటగిరిరావుగారి భార్య. వైశ్యకులస్థురాలు. ఎనిమిదవమాసము గర్భిణి.

:—నిల్ఫమారి. క. శ్రీ. మహేంద్రనాథఘోషుభార్య శ్రీమతి జ్ఞానసుందరి ఘోషుగారి (అరువదేండ్ల వృద్ధురాలు) ఎరస్టు.

25:—గుంటూరు. ఇప్పగుంట వేంకమాంబగారు మ్యునిసిపలు సంఘసభ్యురాలుగా ఎన్నుకొనబడిరి.

:—లాహోరు. డాక్టరు గోపీచందుగారిభార్యయు, 15-వ నియంతయునగు శ్రీమతి గోపీచందుసతికి 6 నెలలశిక్ష, 100 రూ. జరిమానా లేదా 1½ మాసములు అదనపుశిక్ష.

:—అహమ్మదాబాదు. మునిసిపల్ బాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయినియు, క. శె. సర్ రామన్ భాయ్‌గారి కుమార్తెయునగు శ్రీమతి వినోదినినీలకంఠగారు మేవకీచౌకువద్ద పికెటింగు. కంఠమున కృపాణములు వ్రేలాడుచుండెను. అరెస్టుచేయబడి 50 రూ. స్వంతపూచీమీద విడుదల. అహింసా వ్రతిమైనందున మానముకాపాడగల ఆత్మహత్యాసాధనముగా కృపాణముదెచ్చితినని ఆమెచెప్పెను.

:—కలకత్తా. విద్యార్థిమండలి అధ్యక్షురాలు శాంతినియోగి (ఎం. ఏ.) గారిఅరెస్టు.

:—ఏలూరు. ఎం. కాంతయ్యగారి సతీమణి బెంచిమేజిస్ట్రేటుగా నియమింపబడిరి. ఈపదవికి ఏలూరు నందు నియమింపబడినస్త్రీలలో నీమెయే ప్రథమురాలు.

26:—కలకత్తా. శ్రీమతి శాంతానియోగికన్య బి. ఏ, అని మాభట్టాచారికన్య బి. ఏ. గార్లు రిమాండులో నుండగా వారినగలను పోలీసువారుతీసుకొనిరని వారు మేజస్ట్రేటునకెరిగించిరి. "వారినగలను వెంటనే వారికిచ్చివేయవలెను. శిక్షింపబడిన ఇతరస్త్రీలనగలనుగూడ నిచ్చివేయవలెను" అనిమేజస్ట్రేటు ఉత్తరవుచేసెను.

:—అహమ్మదాబాదు. మ్యునిసిపలు గరల్సు హైస్కూలు ప్రిన్సిపాలు వినోదిని నీలకంఠకన్యగారికి శిక్ష, బి. క్లాసు.

27:—దక్షిణాఫ్రికాకుపోయిన రాయబారపు వర్గసభ్యురాలు శ్రీమతి సరోజనీదేవిగారు బొంబాయిలో ఓడదిగిరి.

:—నిల్ఫమరి. జ్ఞానసుందరిఘోషుగారికి 3 నెలలశిక్షపడెను.

:—రాజబారి. బెంగాలుశాసనసభసభ్యుడు. యస్. సి. సేన్ గారిసోదరి శ్రీమతి చారుప్రభా సేన్ గుప్తగారికి 16 నెలలు కఠినశిక్షపడెను.

:—బంకూరా. శ్రీమతులు పరితోషమహంత, మతిబాలాదత్త, సుషమారాణిపలిట్ గారికి మూడేసి నెలలశిక్ష.

28:—అహమ్మదాబాదు. గంగాబెన్ జవేరి, ఎనిమిదేండ్లపిల్లవాడు, మరిఇరువురుస్త్రీల అరెస్టు.

:—అమరావతి. శ్రీమతి పార్వతీబాయిపట్వర్ధన్ గారికి పి. కో. 117 సెక్షన్ క్రింద ఒకసంవత్సరము కఠినశిక్ష.

:—గుంటూరు. ఆంధ్రక్రిస్టియనుకాలేజీలో లెక్చరరు విశ్వనాథ సత్యనారాయణకవిగారి (ఎం.ఏ.) సతీమణి క్షయవ్యాధివలన మృతినందెను.

:—ఈనెల 17-వ తేదీని శాసనోల్లంఘనము గావించి ఏలూరు సబుజయిలులో నుంచబడిన ముగ్గురుస్త్రీలలో శ్రీమతి తగరపల్లి రామాయమ్మగారు తాను కడుపునొప్పిచే బాధపడుచున్నాననియు, ఇకముందు శాసనోల్లంఘనోద్యమమున పాల్గొనననియు, తన్ను విడుదలగావించవలెననియు కోరినందున విడుదల చేయబడిరి.

:—బెజవాడ. శ్రీమతి పొదర్తి సుందరమ్మగారికివిధించబడిన జుల్మానావసూలుచేయుటకు పోలీసువారు ఆమెయున్నయింటికివెళ్ళిచూడగా 2 చిరిచాపలు, 12 విసరికర్రలుమాత్రమెయున్నందున విలువగలిగిన ఆస్తిఏమియులేనందున వెళ్ళిపోయిరి.

29:—అహమ్మదాబాదు. సబర్మతిచెరసాలనుండి శిక్షాకాలపరిమితిముగియుటచే శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారి విడుదల.

:—బళ్లారి. మునిసిపలుసంఘమువారు స్థానిక లేడీస్‌సర్క్యులేటింగు లైబ్రేరీకి 150 రూ. విరాళమిచ్చిరి.

:—బోగ్రా. నితంబినీదేవి గారికి 4 నెలలఖైదు.

:—విష్ణుపూరు. సరోజబాలాబాగ్ల, సుశీలసుందరిఘటక్, మరికొందరుస్త్రీలకు 3 నెలలశిక్ష.

:—ఢక్కా. పణిక్వరకాంగ్రెసు ఎనిమిదవనియంత్రి శాంతిరంజనదాసుగారు పన్నుల నిరాకరణప్రచారము చేసినందుకు అరెస్టు.

:—నిల్ఫమహారి. మద్యశాలలపికెటింగు. లవంగలతాదేవి, సుమతీసాదర్ గార్లకు రు 60, రు 50 జరిమానా చెల్లింపనిచో ఆరేసివారములఖైదు.

:—బొంబాయి. పెరోలుమీదవదలిన లీలావతిమున్షి ప్రభృతులు తిరిగి అరెస్టుచేయబడిరి.

:—అహరారు. కుమారికళ్యాణిజట్టి బి.యె. గారిపై ఆర్డినెన్సు 25 ఏ ప్రకారము నేరముమోపబడెను. లీలావతిగారిని 108 సెక్షనుప్రకారము రు 5000 ధరావతుకోరిరి.

మార్చి

1:—కలకత్తా. కోమిల్లాజిల్లామేజిస్ట్రేటు స్టీవెన్సునుకాల్చి చంపినందుకు యావజ్జీవద్వీపాంతరవాసము విధింపబడిన బాలికాద్వయమునందొకతెయగు సునీతికన్య తండ్రికి పింఛనుతీసివేయబడెను.

:—బెజవాడ. కోగంటి లక్ష్మమ్మ, తుమ్మల సత్యవతమ్మ, రొక్కాల పున్నమ్మగార్లు పికెటింగుచేయుటకు జాతీయపతాకములు చేబూనిరాగా వీరిమీద రంగునీళ్ళుకొట్టి స్టేషనుకుతీసుకొనివెళ్ళి వదలిపెట్టిరి.

2:—బొంబాయి. హంసమెహతాగారి అరెస్టు.

:—మదారిపూరు. స్థానికప్రథమస్త్రీసత్యాగ్రహి శైవలినిదేవిగారికి ఏడాదిశిక్ష. ఆమెబిడ్డ 5 ఏండ్లది. బిడ్డకూడ జయిలుకుపోవుటకు అనుమతింపబడెను.

3:—హుగ్లీ. శ్రీమతి అన్నపూర్ణాసేన్, శ్రీమతి బరదామయివా హైవాయత్ గార్లకు క్రమముగా 1 సంవత్సరము, 3 మాసములు శిక్ష.

:—సిరాజ్ గంజ్. శ్రీమతి ప్రభారాణికి రు. 100 జరిమానా లేక 6 నెలలు కఠినశిక్ష.

:—అకోలా. శ్రీమతి గోఖ్లే టోకరు సతికి 6 నెలలుశిక్ష, 200 రూ. జరిమానా లేదా 2 మాసముల అధికశిక్ష.

:—వేలూరు. 144 క్రింద రిమాండునందున్న శ్రీమతులు కంది నాగరత్నమ్మ, కారంగుల వేంకటరత్నమ్మ గార్ల విడుదల.

4:—మదరాసు. శ్రీమతులు సరస్వతమ్మ, కొత్తపల్లి కోదామృతమ్మ గార్ల ఎరస్టు.

:—లాహోరు. శ్యామకుమారిజుట్షి, 22-వ నియంత్రి కౌసల్యాదేవిగార్ల ఎరస్టు.

:—శ్రీమతి ఎరవాడ చెఱసాలలో శ్రీమతి ధవలక్ష్మీగారు ప్రసవమైరి.

5:—మంగుళూరు. శ్రీమతులు పదకోని, సుందరీబాయి, సంజీవిబాయిగార్లకు మూడేసినెలల కఠినశిక్ష. సి. తరగతి.

6:—నెల్లూరుజిల్లా కోవూరు గ్రామమున శ్రీమతి భట్టారం సుందరమ్మ, కూరపాటి మంగళాంబగార్ల అరెస్టు.

:—బెజవాడ. కోగంటి లక్ష్మమ్మ, తుమ్మల సత్యవతమ్మ, ఎక్కల పున్నమ్మగార్లు పికెటింగుచేయుచుండగా పోలీసువారు శుక్రవారమురోజున ముగ్గురిని వరుసగా పామర్రు, తిరువూరు, జగ్గయ్యపేట గ్రామాదులలో వదలిపెట్టిరాగా వారుతిరిగి బెజవాడచేరిరి.

7:—బంకూరా. శ్రీమతి రాధారాణి ఘోషు గారిని మద్యశాల పికెటింగుకు ఎరస్టుచేసిరి.

:—పూనా. మంగన్ భాయి ఈశ్వరలాల్ గారి భార్య శాంతాబాయిగారికి నాలుగునెలలఖైదు, రు 50 జరిమానా.

:—ఢక్కా. శ్రీమతులు హిరణ్మయీదేవి, ప్రభావతిసేనుగుప్తాగార్లకు 4 నెలలశిక్ష.

8:—మధుర. శ్రీమతి పద్మాసనిఅమ్మాళ్, "12-వ డిక్టేటరు" భాగ్యలక్ష్మిఅమ్మాళ్, సీలకారిఅమ్మాళ్, మీనాక్షిఅమ్మాళ్ గార్ల అరెస్టు. పద్మాసనిఅమ్మాళుగారికి క్రి. లా. స. చట్టము 17 (2) ప్రకారమును 5-వ ఆర్డినెన్సుప్రకారమును మొత్తము 18 నెలలు కఠినశిక్షవిధించిరి. తక్కినముగ్గురికి 17 (1) ప్రకారమును, ఆర్డినెన్సుప్రకారమును 6 నెలలు కఠినశిక్షవిధించిరి.

:—లాహోరు. జానకికుమారిజుట్షిగారికి 4 నెలలఖైదు. రు. 25 జరిమానా.

:—విశాఖపట్టణము. శారదాచట్టము నతిక్రమించినందుకు పెండ్లికుమారుడగు కట్టమూరి విశ్వనాథముగారికి రు. 25; వరునితండ్రి సత్యనారాయణగారికి, వధుపుతండ్రి భోగవిల్లి అప్పన్నగారికి, పురోహితుడు చిక్కవిల్లి యజ్ఞనారాయణగారికి చెరి రు. 50 జరిమానా.

:—షోలాపూరు. 25-వ డిక్టేటరు శ్రీమతి రామాబాయి, శ్రీమతి రుక్మిణీబాయిగార్ల ఎరస్టు.

:—గుడివాడ. విదేశవస్త్రములదుకాణములవద్ద పికెటింగు. శ్రీమతులు ఘంటా మల్లికాంబ, తిపిరినేని కాశలమ్మగార్లనుకొనిపోయి పోలీసులు తుమ్మిడిగ్రామసమీపమునఒకరిని, ఉప్పరగూడెందగ్గరఒకరిని వదలివేయుట. ఇట్లే గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, అరికపూడి సుగుణమణిగార్లనుకూడ.

9:—బోగ్రా. మహేశచంద్రదాసుగుప్తగారిభార్య జ్యోతిమమ్మగారిపై రు. 100 జరిమానా. ఆమెఇపుడు జయిలులోనుండెను. ఆవిడఒంటిమీదనున్న స్వర్ణహారమునుతీసికొని అధికారులు వేలంవేసి రు. 75 రాబట్టుకొనిరి. ఇపు డావిడను వదలివేసిరి.

:—మున్షిగంజ్. శ్రీమతులు అబలబాలాదేవి, నిర్మలసుందరిదేవిగార్లకు ఒకవారముఖైదు. రు. 25 జరిమానా. యూనియనుబోర్డుపికెటింగుచేసినందుకు మాయావాణిదేవిగారు 117 సెక్షనుక్రింద అరెస్టు.

:—బొంబాయి. పెరోలుమీదవిడుదలచేయబడి రిపోర్టుచేయనందుకు శ్రీమతి కప్టైనుసతిగారికి ఒకసంవత్సరము ఖైదు.

:—మిడ్నపూరు. జిల్లానాయకురాలు చారుశీలాదేవిగారి అరెస్టు.

:—రేపల్లె. ప్రభాతభేరీసంఘసభ్యురాండ్రగు శ్రీమతులు పాతూరు రాఘవమ్మ (పాతూరు సుబ్బయ్యగారి భార్య), యలవర్తి ప్రసూనాంబ (సుబ్బయ్యగారితోబుట్టువు), వేజండ్ల దుర్గాంబ, తుమ్మల చంద్రమ్మ (తుమ్మల బసవయ్యగారి పినతల్లి), నగరసంకీర్తన చేసి పేటేరుగ్రామము వెళ్లుచుండగా పోలీసులు అరెస్టుచేసినామనిచెప్పి గొనిపోయి స్టేషనుకద్దనున్న సత్రములోనుంచి సాయంత్రము నల్లూరుగ్రామమునకు పంపివేసారు.

10:—పాంచపార్. శ్రీమతి మమతాదేవిగారిఅరెస్టు.

:—క్రముభారా. శ్రీమతి సుహాసినీదేవి మరి ఆర్గురుస్త్రీలు కోర్టులేచుననందుకు ఖైదు.

:—షోలాపూరు. 25-వ నియంత్రి రామాబాయిగారికి 20 నెలలు కఠినశిక్ష, రు. 50 జరిమానా చెల్లింపనిచో మరి 50 దినములఖైదు.

:—ఛద్రక్. క్షేత్రమణీదేవికి 3 నెలలశిక్ష, రు. 50 జరిమానా. ఈమెగాక ఇంకనలుగురుస్త్రీలకు 1½ నెలలు శిక్ష, రు. 30 జరిమానా. చెల్లింపనిచో 3 వారముల అదనపుశిక్ష.

11:—లాహోరు. జ్ఞానకుమారిజుట్షి ఎం.ఏ, శ్యామలకుమారిజుట్షి బి.ఏ. గార్లకు ఏడాది కఠినశిక్ష, రు. 50 జరిమానా. ఎ క్లాసు.

:—సిరాజ్‌గంజ్. కుమారప్రభారాణిదేవిగారికి శిక్ష.

:—బలూరుఘాట్. శ్రీమతి చెలారాణీచటోపాధ్యాయగారిఅరెస్టు.

:—ఢక్కా. శ్రీమతులు హేమలత, హరిగాబాలలఅరెస్టు.

:—బారిసాలు. 6-వ డిక్టేటరు శ్రీమతి మనోరమాబోసుగారికి శిక్ష.

:—కలకత్తా. శ్రీమతి లావణ్యప్రభాదత్తగారి జుల్మానాపనులుక్రై చరాస్తిజప్తు.

:—బొంబాయి. శ్రీమతి రాయిజీగారిసతిని భర్తతోకూడ ఎరస్టుచేసిరి.

:—పాలకొల్లు. సూరిభొట్ల అన్నపూర్ణమ్మ, హరి కనకమ్మ, మత్తిపాటి వెంకమ్మ, విష్ణుభొట్ల వేంకటలక్ష్మమ్మగార్ల ఎరస్టు.

12:—మదరాసు. పాండురంగంగారి భార్య శ్రీమతి సరస్వతి, శ్రీమతి రాజమ్మగార్ల ఎరస్టు. సాయంకాలము వదలివేసిరి.

:—మదరాసు. దండిదినోత్సవము. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి అరెస్టు.

:—బాలురుఘాటులో శ్రీమతి బాలరాణి ఛటోపాధ్యాయగారికి 188 సెక్షనుక్రింద 6 నెలలు, 143 క్రింద మరి 6 నెలలు కఠినశిక్ష.

:—ఢక్కా. సురబాలదేవిగారి మరి 5 గురుస్త్రీల అరెస్టు.

:—తెనాలి. దండిప్రయాణదినము. శ్రీమతులు గోళ్ళమూడి రత్నమ్మ, వావిలశెట్టి పార్వతమ్మ, కె. దుర్గాంబ, పట్టిసపుంశ హనుమాయమ్మ, వావిలశెట్టి అన్నపూర్ణమ్మగార్ల ఎరస్టు, విడుదల.

13:—పూరి. సువామణీదేవిగారికి బొరహాండులో సుపన్యసించినందుకు 1½ నెలల శిక్ష.

:—కుస్తియం. శ్రీమతులు మృణాళినిసన్యాలు, నళినీబలరాయిగార్లు కోకపాపోలీసుస్టేషను పైని జాతీయపతాకమునెత్తినందుకు అరెస్టు.

:—బెజవాడ. పాలడుగు వరలక్ష్మమ్మ (గురజాడ), ఎక్కలి పున్నమ్మ, కోగంటి లక్ష్మమ్మ (పదిడి ముక్కల) వీణాకముబిడ్డతో జాతీయగీతములపాడుచు వీథులందు తిరుగుచుండగా పోలీసులువారిని బస్సులలో నెక్కించి పంపివైచిరి.

:—పెనుమాకలో ఆంధ్రరాష్ట్రనియంత్రి శ్రీమతి యస్. సుభద్రమ్మగారి యరెస్టు.

:—లాహోరు. 20-వ నియంత్రి శాంతాదేవిగారి జరిమానా రు 50 వసూలుకోసము ఆవిడ ఇంట్లో కుర్చీలు, మేజా, నిలువుటద్దమును తీసికొనిపోయిరి.

14:—మదరాసు. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారికి 6 నెలలుకఠినశిక్ష, 100 రు జరిమానా, లేక మరి 1½ నెలలశిక్ష.

:—మదరాసు. శ్రీమతి గోమతిఅమ్మాళ్ గారిఅరెస్టు విడుదల.

:—కృష్ణనగరు. స్థానికకాంగ్రెసు విడవనియంత్రి శ్రీమతి మృణాళినిదేవిగారిని శిక్షాకాలపరిమితి ముగియక పూర్వమే వదలివైచిరి.

:—బాలర్‌ఘాట్. డా. సుశీలరంజనఘటర్జిగారిభార్య బలరాణిఘటర్జిగారికి 188 సెక్షను క్రింద ఒక సంవత్సరముశైదు.

:—బారిసాలు. డా. ఆనందమోహనరాయిగారిని అతని 11 యేండ్లకుమార్తె శెఫాలికారాయిగారిని పోలీసు సూపరింటెండెంటుపిలిపించి తనకుమార్తె రాజకీయములో చేరకుండా రక్షించుకోవలసినదిగా రాయిగారికి హితవుచెప్పెను. ఆబాలిక సరస్వతిబాలికాపాఠశాలలో చదువుకొనుచున్నది.

:—కలకత్తా. నవకాళీ న్యాయవాదిభార్య కమలాకుమారిఘోషు ఎరెస్టు.

:—లాహోరు. ద్రౌపదీదేవి, కౌశల్యాదేవి, రికాదేవిగార్లకు ఆరేసినెలలుకఠినశిక్ష, రు. 25 జరిమానా. చెల్లించనిచో మరి 4 నెలలశైదు.

:—బంకూరా. శ్రీమతి సరళబాలానందగారి అరెస్టు. మహిళాసంఘాధ్యక్షురాలగు శ్రీమతి ప్రమదాసుందరిగారికి శిక్ష,

:—కటకము. ఉత్కలనాయకుడగు గోపబంధుచౌదరిగారి కుమార్తె శ్రీమతి అన్నపూర్ణాదేవిగారిఅరెస్టు.

—ఢిల్లీ భారతశాసనసభలో ప్రశ్నోత్తరముల సమయమున హోము మెంబరు సర్ జేమ్సుక్రేరారుగారు రామేశ్వరప్రసాదసింగుగారి ప్రశ్నకుబదులుగ ఇప్పటికి బాల్యవివాహనిషేధచట్టముప్రకారము 34 శిక్షలు జరిగినవని చెప్పిరి.

:—బొంబాయి శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారికి తిరిగి 6 నెలల కఠినశిక్ష, సి, క్లాసు.

:—రేపల్లెలో శ్రీమతులు మలిపెద్ది శేషమ్మ, యలవర్తి ప్రసూనాంబ, తుమ్మల చంద్రమ్మ, కోసేరు మంగమ్మ, కొల్లి భూషమ్మ, వేజండ్ల దుర్గాంబ, నాదెళ్ల సీతారామమ్మగార్ల ఎరెస్టు విడుదల.

:—బొంబాయి: రాష్ట్రీయ మహిళాసంఘమునకు చెందిన గోషపుకెప్టన్ సతిగారిని పెరోలుమీద వదలిరి.

16:—మదరాసు, శ్రీమతులు రాజంబాల్, సరస్వతీ పాండురంగంగార్ల ఎరెస్టు.

:—నవాబుగంజ్, శ్రీమతులు ఉషబాలాగుహా, సునీరిబాలాబోనుగార్లకు చెరి 100 రు, జరిమానా,

17:—రేపల్లె. వాసిరెడ్డి పార్వతమ్మ, వట్టిగుండ్ల హనుమాయమ్మ, కన్నెగంటి దుర్గాంబ, గోళ్లమూడి రత్నమ్మ, యలవర్తి ప్రసూనాంబ, తుమ్మల చంద్రమ్మ, కోసేరు మంగమ్మగార్ల ఎరెస్టు.

:—కస్తూరిబాయిగాంధిగారిని సి, తరగతినుండి ఎ, తరగతికిమార్చిరి.

18:—అహమ్మదాబాదు. ముగ్గురు స్త్రీలు విదేశవస్త్ర దుకాణదారునియింటివద్ద అభోజనులుగ కూర్చుండిరి. అతడు విదేశవస్త్రముల వ్యాపారము మానెదనని వాగ్దానముచేయువఱకు అట్లే యుండుటకు నిశ్చయించిరి.

19:—ఏలూరు. ముడింబి వేంకటమ్మ, జవ్వాజి రాజరత్నమ్మ, మద్దుల దమయంతిగార్ల ఎరస్టు.

:—బోగ్రా. శశిబాలదేవి, సావిత్రీదేవి, తారాదేవిగార్ల శిక్షాకాలము పూర్తిగాకమునుపే వదలిపెట్టిరి.

:—కలకత్తా. క్లైయివువీథిలో 'ఝుంటాప్రకాశ' అను మాసపత్రికకార్యాలయము పోలీసులు సోదాచూచి స్త్రీ దెమ్సహత్యకేసులో శిక్షితులు శాంతిసునీతి కన్యలచిత్రములను ముద్రించుదిమ్మెలను గొనిపోయిరి.

# పత్రికాపరిచయము

## ఆంధ్రజ్యోతి:—

మాసపత్రిక. ప్రతిమాసారంభమున వెలువడును. బర్మాఆంధ్రుల మత నైతిక సాంఘిక ఆర్థిక సారస్వతాది అభివృద్ధికి దోహదముచేయు నుద్దేశముతో ప్రారంభింపబడినది. స్వదేశమునందలి ఆంధ్రులే ఇప్పుడు ఆంధ్రమును విస్మరించియున్నారు. అట్టిచో బర్మా మొదలగు ఇతరతావుల వలసవెలకొనినవారి సంగతి చెప్పనక్కఱలేదు. ఈసమయమున ఈపత్రికప్రచారమునకు ఆవసరమెంతేనిగలదు. సంపాదకులు దీనిని గుర్తించిరనుటకు బర్మాఆంధ్రుల జాతీయవికాసము, వ్యక్తిత్వమును పెంపొందించుటకు బర్మాయందుగల ఆంధ్రప్రతిష్ఠాపనల, ఆంధ్రసంస్థల, ఆంధ్రప్రముఖుల, వర్తకుల, కంట్రాక్టరుల, కార్మికాధిపతులయొక్క ఛాయా చిత్రములను సంగ్రహచరిత్రములతో ప్రకటింపదలపెట్టినది ఒకనిదర్శనము. ఈపత్రికాసంపాదకులగు కోలా ధర్మారావుగారి ఆంధ్రాభిమానము అత్యంతము స్తుతింపదగియున్నది. మార్చిమాసమున వెలువడిన ఈపత్రిక యొక్క ప్రథమసంచిక ఆనందముతో అందుకొన్నారము. బర్మాఆంధ్రప్రముఖులగు గుడాల వేంకటరెడ్డి నాయుడు, దొమ్మేటి వేంకటస్వామి మొదలగువారి చిత్రపటములు, సంగ్రహచరిత్రలు ఈసంచిక విలువను హెచ్చించినవి. శ్రీ పురిపండా అప్పలస్వామిగారి 'ఆంధ్రుడా' అనుగేయము ఒడలు పులకరింపజేయునదిగా నున్నది. ఆంధ్రులగువారి అందరిచేతను ఈపత్రిక ఆదరింపబడదగియున్నది. క్రౌనుసైజు, గ్లేజుకాగితములు. సాలుచందా మూడురూపాయలు. చిరునామా; ఆంధ్రజ్యోతికార్యాలయము, 20 వాషర్‌మాన్‌స్ట్రీటు; మౌల్మేన్,(బర్మా.)

# వస్తువిమర్శనము

## అగరువత్తులు:—

బెంగుళూరునందలి ది స్టార్ ట్రేడింగు అసోసియేషనువారుపంపిన సాంబ్రాణికడ్డీలు (ఊదువత్తులు) కృతజ్ఞతాపూర్వకముగ నందుకొన్నారము. ఈఅగరువత్తులను వెలిగించిచూచితిమి. మంచివాసనఇచ్చినవి. నిలచికాలినవి. ఈఅసోసియేషనువారుపంపిన జవ్వాది సౌగంధ్యమును కొనియాడదగియున్నది. వీరి సుగంధ ద్రవ్యములు ప్రజలఆదరణకుపాత్రము కాదగియున్నవని మేము నిస్సందేహముగ చెప్పగలము.

## శ్రీ వేణుగోపాలభజనసమాజమువారి కేలండరు:—

పశ్చిమగోదావరిజిల్లా మారుటేరునందుపర్లిలుమన్న శ్రీవేణుగోపాలభజనసమాజమువారి కేలండరు ఆనంద ముతో అందుకొంటిమి. ఆంగీరసవత్సరముతో ప్రారంభము చేయబడినది. అనగా ఏప్రియలు 6-వ తేదీతో ఈకేలండరు మొదలు. తెలుగువారిపంచాంగసాంప్రదాయమును, ఇంగ్లీషువారి తేదీలసాంప్రదాయమును ఇందు కూడినవి. చాల ఉపయోగకరమైనది. కాలము గడియలలోగాక గంటలలో ఈయబడినది. 1932 ఏప్రియలు 6 మొదలు 1933 మార్చి 27 వఱకుగల ఆంగీరసవత్సరము రోజువారీసూచనలుగల ఈకేలండరువలని తగిన లాభమును ప్రజలు పొందుదురుగాక!

# గ్రంథపరిచయము

**జగన్మాత:—**

దేశభక్తశిఖామణులు, యోగిశేఖరులు అయిన శ్రీ అరవిందఘోషుగారిచే రచియింపబడినది. తెనుగులోనికి స్వామిశుద్ధానందభారతివారు, చింతా దీక్షితులుగార్లచేతను అనువదింపబడినది. రాజమహేంద్రవరమునందలి రాజన్ ముద్రశాలలో ముద్రితము. ముద్రణము చాల అందముగను ఆకర్షణీయముగనుఉన్నది. ఆంధ్రభాషాసేవకులు, యువకులుఅగు దువ్వూరి రామకృష్ణరావు బి. యె. గారు ఆంధ్రమాతను గ్రంథప్రచురణరూపమున సేవింప వారు రాజమహేంద్రవరమున వీరభద్రపురమునందు భారతశక్తినిలయమును స్థాపించినారు. సారస్వతనికేతనమగు రాజమహేంద్రవరమునకు పేరు తెచ్చుసంస్థలలో నొకటిగా భారతశక్తినిలయము నివ్వటిల్లును గాకయని కోరెదము. "జగన్మాతను సత్యాలయములో సహస్రారసింహాసనమున కొలువుదీర్చించి, అధ్యాత్మదీపమును అణకువతో వెలిగించి, శుద్ధమగు ఆత్మగంగయందభిషేకించి, భక్తిశ్రద్ధాభరణములతో శృంగారించి, అహంకారమును బలియిచ్చి, సంపూర్ణాత్మనివేదన మొనరించి, శరణుజేసు శుద్ధప్రేమానందులను, జగన్మాత తనశిశువులుగా గ్రహించి, చేరబెట్టుకొని, కాపాడి వారికి దివ్యజీవనానందమును ఒసగును. ఈశుద్ధశక్తిపూజకు ఈగ్రంథము సరియైనపద్ధతి చూపుచున్నది. ఆంధ్రులీయోగశాస్త్రము నభ్యసించి జగన్మాతకృపకు పాత్రులగుదురుగాక!". మాతృక యోగిపుంగవవిరచితము. అనువాదమున చింతా దీక్షితులుగారి చేయిగలదు. విషయము జగన్మాతనుగూర్చి, ఆంధ్రాపేపరుమిల్సువారి కాగితములపై గ్రంథము ముద్రింపబడినది. ఇన్నిటప్రశస్తికెక్కిన ఈగ్రంథము వెల. 0—6—0 మాత్రమే. ప్రతివారును తీసిచదువదగినది.

**భగ్నప్రేమ:—**

శ్రీనరహరిసెట్టి శేషగిరిరావుగారు రచియించినది. శీలము, విద్య, కులము, చెల్వము, కలిమిగల మేనత్త కంపుబాలిక ఆ మెరకల్లి 'వృద్ధాధికోన్మాదసర్వాశావేష్టితఘోరవాతమున' తానుపొందజాలకపోగా ఒకయువకుడు అనుకొనుమాటలు ఇందు గణబద్ధమొనర్చబడినవి. ముద్రణము సుందరముగను, ఆకృతి ఆకర్షణీయముగనుఉన్నది. వలయువారు గ్రంథకర్తపేర తూర్పువీధి, ఏలూరు అనివ్రాయుడి.

**కవిత:—**

గ్రంథకర్త శ్రీజోను రామచంద్రరావుగారు. చిరునామా: ప్రెసిడెంటు శ్రీరామసేవాసంఘము, పేట, కర్నూలు. అడిదమునూరకవిగారు ప్రశ్నోత్తరపూర్వకముగ పద్యమున ఆత్మచరిత్ర చెప్పుకొనినట్లు వీరును తమగృహనామాదులను ఒకపద్యమునవ్రాసి ఈపుస్తకము అట్టపై ముద్రించిరి. లోన 30 పద్యములు గలవు. కవిత్వమునుగూర్చి వారి అభిప్రాయమును తెలిపిరి. మంచిపోకడలుగలవు. లఘుటీకయు చేర్చబడినది. ఈగ్రంథకర్తగారికి భావియభివృద్ధిగలుగునట్లు ఆంధ్రమాత అనుగ్రహించునుగాక. రాయలసీమ వీరికవితచే రాణదేరునుగాక. వెల రు. 0—1—0.

**రోగనిదానవిధానము:—**

మొదటిభాగము. పాశ్చాత్యవైద్యపద్ధతులను (Clinical Methods) పట్టివ్రాయబడినది. గ్రంథకర్త డాక్టరు: ఎ. సుబ్బారావుగారు L. M. P. ఆంధ్రాభ్యుదయమునకు తోడ్పడునట్టియు, ఆంధ్రావలిని 'మోదము నొందించునట్టియు' మతి, చారిత్రిక, ప్రకృతి శాస్త్రబోధకములగు గ్రంథముల ప్రచురించు సంకల్పముతో ప్రారంభింపబడిన ఆంధ్రావలిగ్రంథమాలికలో నిది తృతీయకుసుమము. ఇది ఆయుర్వేదవైద్యవిద్యార్థులకును, ప్రాక్టీసుచేయ నుద్దేశించు కంపౌండర్లకును మిక్కిలి ఉపయోగించును. ఈగ్రంథమువెల 0—8—0. క్రౌను

సైజు, గ్లేజుకాగితములు. 54 పుటలు. మిగతాభాగములనుకూడ ప్రచురించి గ్రంథమాలికవారు భాషాపోషక మొనర్తురుగాక! చిరునామా: ఆంధ్రావళిగ్రంథమాలిక, యలమంచిలి.

**విషములు: తచ్చికిత్సలు:—**

గ్రంథకర్త డాక్టరు. రాఘవరంగారావు యం. బి. బి. యస్. విజ్ఞానప్రచారిణీగ్రంథమాలలో 9-వ గ్రంథము. అల్లోపతిక్ విషములు, స్థావరవిషములు, జంగమవిషములు, కృత్రిమవిషములు మొదలగువానిని గూర్చియు, వానిచికిత్సలనుగూర్చియు వ్రాయబడిన ఉత్తమగ్రంథము. ఇందలి ఆయుర్వేద అనుబంధములు డాక్టర్ పింగలి లింబాద్రిరెడ్డిగారిచే వ్రాయబడినవి. శాస్త్రవిషయకగ్రంథముగుట దీనిని ఆంధ్రులు తప్పక ప్రచారములోనికి గొనిరావలసియున్నది. క్రౌనుసైజు, దళసరికాగితములు, 130 పుటలు. వెల 1—8—0 చిరునామా: వెములకొండ, జగత్యాల, నైజాము.

**శ్రీహరనాథలీలః—**

ప్రథమభాగము. హరనాథునినామమిప్పుడు గృహనామము. ఆతఁడిప్పుడు ఆంధ్రగృహమాధవుడు అయియున్నాడు. ఇందలిభక్తుల అనుభవములను చదివి పులకితగాత్రులమైతిమి. ఈసత్యచరిత్రలు శ్రీహరనాథ ప్రభుని మహాత్మ్యమును ప్రకటించుచున్నవి. ఇట్టి ఉత్తమగ్రంథములను ప్రచురించుచు ఆంధ్రమహాప్రజాసంఘమున ఆస్తిక్యభావమును పెంపొందించుచున్న శ్రీపి.ఆర్. దాసుగారిని మనఃపూర్వకముగ కొనియాడుచున్నాము. గ్రంథమున హరనాథదంపతుల ఛాయాచిత్రముగలదు. క్రౌనుసైజు, గ్లేజుకాగితములు, 74 పుటలు. వెల రు0-4-0. చిరునామా: శ్రీహరనాథతత్వప్రచారిణీసభ, ఆంధ్రబ్రాంచి, సూర్యారావుపేట, కాకినాడ.

**షోడశోపచారపూజాకృతులు:—**

శ్రీమత్పుష్పగిరిపీఠమునందుండెడు పరదేవత శ్రీమద్రాజరాజేశ్వరీ షోడశోపచారపూజాకృతులు. పోలేపెద్ది వేంకటశివయ్యశాస్త్రిగారిచే 1897 రచింపబడి ముద్రింపబడినవి. ఇపుడు రెండవముద్రణము. ఆస్తికులు పఠింపదగినగ్రంథము. గ్లేజుకాగితములు. డెమ్మీసైజు. 44 పుటలు. వెల 0-4-0, పోస్టేజిక్రింద 0-0-6 లు పంపుస్త్రీలకందరకును ఈగ్రంథము ఉచితముగానొసగబడును. చిరునామా: పోలేపెద్ది నాగభూషణరావుగారు, రాజాపేట, చిలకలూరుపేటపోస్టు, నరసారావుపేటతాలూకా, గుంటూరుజిల్లా.

**విజయవిజయము:—**

పంచసరూపకము. కృతికర్త పప్పు సూర్యనారాయణ. పరిష్కర్త కందికుప్ప కొండలరావుపంతులు బి.యె.యల్.టి. సరస్వతీగ్రంథమండలి నాటకానుబంధము 10. ప్రకాశకులు: అద్దేపల్లి లక్ష్మణస్వామి, సరస్వతీగ్రంథమండలి, రాజమహేంద్రవరము. గ్లేజుకాగితములు. 109 పుటలు. డెమ్మీసైజు. సుందరముద్రణము, వెల రు 1-0-0. మాలికాఫూరు ఓరుగల్లుముట్టడిసాగించునప్పటివృత్తాంతము. పద్మావతియను స్త్రీపాత్రచర్యలు అత్యద్భుతము. నాటకమంతయు దేశాభిమానముతో నిండారియున్నది. సప్తమరంగము తుదిభాగము చమత్కారముగనున్నది. దుష్టబుద్ధియగు రణవర్మచేత లతిదారుణము. ఏకాదశీరంగము నాటకమంతకును రసకందాయము.

**శ్రీగురుకులసుందరచరిత్ర:—**

భక్తాగ్రగణ్యునిచరిత్ర. భక్తజనోపయోగముగా శ్రీమాన్ బాలకవి చిలువూరు గురులింగశాస్త్రిగారిచే వ్రాయబడినది. శ్రీమదాదిశైవపత్రికయందు పత్రికాధిపతులచే ప్రకటింపబడియె, డెమ్మీసైజున 36 పుటలు. వెల 0-4-0, మహాభక్తవిజయమున క్లుప్తముగానున్నచరిత్రను తమిళభాషయందలి 'పెరియపురాణము' సాయమున పెంచి ఇది వ్రాయబడినది.

విదుల:—

భారతముకీర్తింపదగిన వీరమాతలలో విదుల చిరస్మరణీయ. సంస్కృతభారతమున ఈవిదులచరిత్ర విపులముగ ఉత్తేజకరముగ విస్తరింపఁబడియున్నది. తిక్కనసోమయాజి యేలనో దీనిని తెనిగింపకపోయె. శ్రీ తాడూరి వేంకటలక్ష్మీనరసింహారావుగారివంటి భారతవిమర్శకులుకొందరు ఈవిదులోపాఖ్యానమును విడనాడుట తిక్కనగావించిన మహాపరాధములలో నొకటిగా ఘోషించుచున్నారు. రాజమహేంద్రవరస్థ ప్రభుత్వకళాశాలా సంస్కృతాంధ్రపండితులుగానుండి వినుతికెక్కిన కీర్తిశేషులైన శ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు తెనిగించినభారతమున ఉద్యోగపర్వమునందు స్త్రీప్రశంసాత్మకమగు ఈవిదులోపాఖ్యానమున్నది. యుద్ధమున నోటువడివచ్చిన ఏకమాత్రపుత్రునియుద్బోధించి తిరిగి యుద్ధభూమికంపి, అతనిని విజేతగనొనర్చి, తాను వీరమాతనైతినని సంతోషించిన ఈవిదులచరిత్ర మాతృత్వమువహించుస్త్రీలెల్లరు చదువదగినది. దండనీతికిని రాజనీతికిని పాత్రమై యీయుపాఖ్యానము ఉత్తమమగుచున్నది. స్త్రీల కీకథప్రత్యేకము పఠనార్హము. అట్టికథ శ్రీవ్యాసమూర్తిశాస్త్రులువారి శైలిరచనమునపడి మెఱుగు దేలినది. శైలి సులభార్థబోధకము. పద్యములు ప్రాయికముగా గీతములగుటచే కథయు సులభగ్రాహ్యమగుచున్నది. గ్లేజుకాగితములమీద డెమ్మీసైజున ముద్రింపబడినది. వెల 0-4-0. వలయువారు ఆకుండి వేంకటశాస్త్రిగారు, వ్యాసనికేతనము, ఆర్యాపురం, రాజమహేంద్రి అని వ్రాయునది.

హిందువుల పండుగలు:—

శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు బి.ఏ. బి.యల్. వ్రాసినది. ఆంధ్రాయూనివర్సిటీ వైస్‌ఛాన్సలరుగారగు శ్రీ డాక్టర్ సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు ఈగ్రంథమునకు పీఠిక వ్రాసి దానివిలువను హెచ్చించిరి. వారు వ్రాసిన ఈక్రిందివాక్యములు సత్యసిద్ధములని మేము చెప్పగలము. "పండుగలు ఆధ్యాత్మికవృత్తికి అవసరములా; పరలోకసుఖప్రదములా యన్నచర్చ అనవసరము. అవ్వి ముఖ్యముగ సాంసారికసాంఘికజీవితభారమును యించుకతొలగించి, సంతోషమును చేకూర్ప నేర్పడిన శుభక్రతువులు. ప్రతాపరెడ్డిగారు సులభశైలిని, పురాణేతిహాసపురస్కారముగ రచించిన ఈగ్రంథము హైందవమతావలంబులగు ఆంధ్రుల కెల్లరకును యందు ముఖ్యముగ స్త్రీలకు మిక్కిలి యుపయోగకరమని నాదృఢనమ్మకము." నిజాము రాష్ట్రమునందలి ఆంధ్రప్రముఖులలో ప్రముఖులై గ్రంథములు వ్రాయించియు స్వయముగ వ్రాసియు ఆంధ్రమాతను సేవించుచున్న రెడ్డిగారి సిద్ధహస్తమునుండి ముక్తమైన ఈప్రశస్తగ్రంథమునుగూర్చి విశేషముగ ప్రస్తరింపవలసినపనిలేదు. చేర్పబడినచిత్రములు గ్రంథప్రయోజనమును పెంపొందించినవి. ప్రతిఆంధ్రుడు తన సొంతగ్రంథసముదాయమున ఈగ్రంథప్రతి నొకదానిని ఉంచుకొనవలయునని మేము హెచ్చరింతుము. రాయల్ సైజున గ్లేజుకాగితములమీదముద్రితము. 320 పుటలు. వెల రు. 1-12-0. చిరునామా: గోలుకొండపత్రికాకార్యాలయము, త్రూపుబజారు, హైదరాబాదు, నైజాముఇలాకా.

నాలుగుభాషలనిఘంటువు:—

దాసరి లక్ష్మణస్వామిగారిచే సమకూర్పబడినది. ఇందు తెలుగు, హిందుస్థాని, ఇంగ్లీషు, అరవముపదములు చేర్పఁబడినవి. ఆయాభాషలు ప్రచారమునగలతావులయందు వ్యవహారముసలుపవోవు ఆంధ్రులకీపుస్తకము ఉపయోగకారిగనుండగలదు. సుమారు అయిదువేల తెలుగుమాటలు అకారాదిగా వ్రాయఁబడి వాని కెదురుగా హిందుస్థాని, ఇంగ్లీషు, అరవముపదములు చేర్చబడియుండుట నిందు ఏపదము కావలసినను సులభముగ అక్రమమున గ్రహింపవచ్చును. జేబునందిముడు చిన్నసైజున 224 పుటలు. వెల రు. 0-8-0. గ్రంథకర్తపేర పిఠాపురము వ్రాసిన గ్రంథములు బడయవగును.

**రుక్మిణి:—**

ప్రథమకూర్పుస్థితినిదాటిన తెనుగుగ్రంథములు మిక్కిలి అరుదుగానున్నవి. అట్టి అరుదైనగ్రంథములలో నీరుక్మిణి యొకటియగుటయే అదిపొందిన జనాదరణకు నిదర్శనము. ఇది యీగ్రంథమునకు మూడవకూర్పు. కథ రాజపుత్రస్థానమునకు సంబంధించినది. చరిత్రాత్మకము. ఎలిఫిన్‌స్టన్, పర్కూరు మొదలగు చరిత్రకారుల పరిశోధనాఫలితములు ఇందు యథోచితముగ ననుసంధింపఁబడినవి. ఔరంగజేబుకాలమునాటి దేశపరిస్థితులు, దారాయొక్క మంచితనము, హర్షరుక్మిణుల ప్రణయజీవితము ధారావాహికముగ సులభశైలిలో వర్ణింపఁబడినవి. స్త్రీలపత్రికాధిపతులమగు మాకు రుక్మిణిశౌర్యము ప్రకటించుఘట్టము, ఆమె దారాతో సంభాషించినఘట్టము బాగుగవచ్చినవని ప్రత్యేకించిచెప్పవలసినపనిలేదు. లయోలాకాలేజీ ఆంధ్రోపాధ్యాయులు కె. వి. రాధాకృష్ణశాస్త్రిగారాంగ్లమునను, విద్వాన్ మంకాల శ్రీపతిగారు ఆంధ్రమునను తొలిపలుకులువ్రాసి గ్రంథాంశములను ప్రస్ఫుటము చేసిరి. క్రౌనుసైజున గ్లేజుకాగితములపై 52 పుటలు. వెల 0-4-0. ప్రకాశకులు: టి. వి. చెల్లప్పశాస్త్రి అండు సన్సు, 1-1 కంబదాసువీధి, మద్రాసు.

**భక్తజనమనోరంజనము:—**

భగవత్కీర్తనలు. నాటకసామాజికులకు, సంఘసంస్కారులకు, తదితరులకు ననుకూలముగనుండునటుల కీర్తనలువ్రాయుచు, వానిని అప్పుడప్పుడు 'ధర్మసాధని'యందు ప్రకటించుచు, వానిని 1919 లో ఒకగ్రంథముగచేర్చి శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు ముద్రించిరి. ఈకీర్తనలకు శ్రీపీఠికాపురసంస్థానవైణికశిఖామణులు బ్రహ్మశ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు రాగతాళాదులనిర్ణయించిరి. చిన్నసైజు. 32 పుటలు. వెల రు. 0-4-0. చిరునామా: దాసరి లక్ష్మణస్వామి, పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

**వేశ్యాసహవాసఫలితము:—**

పద్యకావ్యము. లుబ్ధగావస్థ అని దీనికి నామాంతరము. ఇది బెంగుళూరునందు నిజముగాజరిగినకథ. నిగమశర్మ, గుణనిధి, విరంకుశుడు మొదలగువారి చరిత్రలలో ఇందలి లుబ్ధకకుమారునిచరిత్ర సరిపోవుచున్నది. లుబ్ధవర్ణనము, వేశ్యామాతృవర్ణనము హాస్యజనకములు. నీతి, శృంగారపద్యములుకలవు. రచయిత దాసరి లక్ష్మణస్వామిగారు. క్రౌనుసైజు. 34 పుటలు. 0—4—0. వలయువారు గ్రంథకర్తపేర పిఠాపురము వ్రాయునది.

**జస్టుచికిత్స:—**

కర్త కొండపర్తి వీరభద్రాచార్యులు. మానవుని ప్రకృతివైపునకు మరలించుటకు ప్రచారముసాగించిన ఆధునికమహాశయులలో అడోల్ఫ్‌జస్టుగారొకరు. వారీవిషయమై యొకగ్రంథమును రచించిరి. ఆగ్రంథము యొక్కసారమును శ్రీఆచార్యులవారు తెలుగువారికిట్లందించినారు. ఈగ్రంథమున అడోల్ఫ్‌జస్టుగారి జీవితము సంక్షిప్తముగా శ్రీమతి జ్ఞానాంబగారిచే వ్రాయబడి చేర్చబడినది. బ్రహ్మమునకు శంకరరామానుజులెట్లో ప్రకృత్యభిగమనమునకు కూనే, జస్టులు అట్లు. అందరికరిదగు నీగ్రంథము ఆంధ్రభూమియందు విశేషప్రచారమునంది ఆంధ్రులఆరోగ్యానందములకు తోడ్పడునుగాక యని కోరెదము. క్రౌనుసైజున 72 పుటలు. వెల. 0—10—0. ప్రకాశకులు: ప్రకృతికార్యాలయము, బెజవాడ.

**దీనపోషకశతకము:—**

దాసరి లక్ష్మణస్వామిగారిచే రచియింపబడినది. చంపకమాలలు, ఉత్పలమాలలు. 'దీనపోషకా' యని మకుటము. ఇది వారి ప్రథమప్రయత్నమైనను కవిత్వము గతుకులులేక సాఫీగా సాగిపోవుచున్నది. భక్తిజ్ఞానములకు తావలమై సర్వజనపఠనీయమై యున్నది. క్రౌనుసైజు 22 పుటలు. వెల. 0—1—0. చిరునామా: దాసరి లక్ష్మణస్వామి, పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.




**శ్రీ మద్దూరి కోదండరామదీక్షితులుగారి సంఘసంస్కారము:—**

విశాఖపట్టణమునందలి పురపాలకోన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీ మద్దూరి కోదండరామదీక్షితులుగారి విద్యాసేవ ఆంధ్రులకు పరిచితమైనదే. ఆంధ్రవిశ్వవిద్యాలయములోని ప్రధానోపాధ్యాయులస్థానమునకు వారీసమ తిరిగి ఎన్నుకొనబడి రనుటచే వారిపలుకుబడిని, ప్రయోజకత్వమును ఊహింపవచ్చును. అయితే మేమీకారణమున వారినామ మిచట పేర్కొనలేదు. వారిని మాకు అభినందనీయులుగ చేసినది వారి సంఘసంస్కారపరత. 26-2-32-వ తేదీని వారు వారిద్వితీయపుత్రిక చి. సౌ. సూర్యకమలను బెజవాడవాస్తవ్యులును, న్యాయవాదులును అగు శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణగారి కిచ్చి రజస్వలానంతరవివాహముజరిపిరి. నాయకులమనుకొనువారే ఆచారమునకు దాసులై శారదాచట్టము నతిక్రమించి బాల్యవివాహములను గావించుచుండగా శ్రీ దీక్షితులుగారు పూర్వాచారమును విడనాడి సంఘసంస్కారమునందు అభిమానముంచి శారదాచట్టమును గౌరవించి తమకుమార్తెకు ప్రౌఢావివాహమొనర్చిరి. ఇందుకు వారికి మా మనఃపూర్వకమగు అభినందనములు. ఇట్టివిద్యాధికులు ఇంకను మఱికొందరు ఇట్లుచేసిచూపుచో ఇతరులు ఈవిషయమున ధైర్యమును అవలంబింపగలరు; శారదాచట్టము ననుసరింపగలరు.

**దంపతుల ఏకకాలమరణము:—**

బొబ్బిలిసంస్థానాస్థానసిద్ధాంతులును, జ్యోతిశ్శాస్త్రవేత్తలునుఅగు శ్రీ కొటికెలపూడి నృసింహసిద్ధాంతిగారు 29-2-32 మధ్యాహ్నము పండ్రెండుగంటలకు బొబ్బిలిలో పరమపదించిరి. మఱిరెండుమూడుగంటలకు వారి సతీమణియు మరణించెను. దంపతులిరువురును మరణించుటకు పూర్వము వారముపదిదినములుగ అస్వస్థులై యుండిరి. ఇరువురును కొద్దిగంటల వ్యత్యాసములో మరణించిరి. ఇది వారిపుణ్యము. ఈపూజ్యదంపతులవలెనే ఆరు ఏడువత్సరములకు పూర్వము తూర్పుగోదావరిమండలమున పులుగుర్తలో శ్రీ పిడపర్తి పెదపూర్ణయ్య సిద్ధాంతిగారును, వారి భార్యయు కొలదికాలవ్యత్యాసములో మరణించిరి. ఇట్టి ఏకకాలమరణములు ఎంతయో పుణ్యముచేసిన దంపతులకుగాని లభింపవు.

**శ్రీ పెన్మెచ్చ పెద్దిరాజుగారి ఆంధ్రభాషాభిమానము:—**

పశ్చిమగోదావరిజిల్లాబోర్డు ప్రెసిడెంటుగారగు శ్రీయుత పెన్మెచ్చ పెద్దిరాజుగారి ఆంధ్రభాషాభిమానమును రూపించిచెప్పగల అవకాశము లభించినందుకు మేము మిక్కిలి ఆనందించుచున్నారము. ఈనడుమ తణుకు బోర్డుఉన్నతపాఠశాల లేబరేటరీభవనమును వారు తెఱచిరి. ఇట్టిభవనముల ముఖములపై ఆంగ్లమున తెఱచినదినము, తెఱచినవారినామము చెక్కించుట ఇపుడు ఆచారమైయున్నది. కాని ఆంధ్రభాషాభిమానులగు శ్రీపెద్దిరాజుగారు మనదాస్యమునకొక చిహ్నమగు ఆ ఆంగ్లభాషాప్రకటనమును విడనాడి ముఖస్థానమున ఈ క్రింది తెనుగుశాసనమును ఉటంకింపజేసిరి:

### గీతమాల

చంద్రకులజుండు పాండవక్షత్రియుండు
శ్రీధనంజయగోత్రుండు శ్రీయుతుండు
విబుధగేయుండు పెనుమెచ్చ పెద్దిరాజు
భువనశరగజచంద్రులై పొలుపుమిగుల

శాలివాహనశకమున స్వాతిపౌష
కాష్టమీసౌరి శుభలగ్నమందు తణుకు
పాఠశాలకుభవనంబు పాదుకొలిపె
భవ్యతరమైన తనకీర్తి పరిఢవిల్ల.

శాసనకర్త:
పె. సత్యనారాయణరాజు.

శిల్పి:
బి. సత్యనారాయణ.

ఇట్లు శాసనము వేయుట జాతీయసాంప్రదాయము. అదియు తెలుగున వెలయించి శ్రీరాజావారు తమ భాషాభిమానమును ప్రకటించిరి. ఊళ్ల పేళ్ల నుగూడ ఆంగ్లసాంప్రదాయమున వ్రాయుట మహాదోషముగ చాటు ఆంధ్రమహాశయులు శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారు దీనినెంతగ అభినందింతురో! తాము ప్రెసిడెంటుఅయినది మొదలు నిడదవోలు, అనంతపల్లి ఎఱ్ఱకాల్వ, మత్స్యపురి, ఉప్పుటేరు, దువ్వవయ్యేరు, గణపవరము ముఠికికాల్వలకు వంతెనలు నిర్మించియు; కొవ్వూరుహైస్కూలునకు భవనమును, తణుకుహైస్కూలుకు లేబరేటరీనికట్టించియు జల్లాను బంగారముచేసినదానికితోడు తమ ఆంధ్రభాషాభిమానమును ఆమండలమున ఇట్లు శిలోట్టంకితముచేసినందుకు శ్రీరాజాగారిని కొనియాడుచున్నాము.

**శ్రీ బుగ్గ దేవాలయము: ఒక ఆంధ్ర స్త్రీ సాహాయ్యము:—**

చిత్తూరుజిల్లాలోని నగరిరైలుస్టేషనుకు సుమారెదుమైళ్లదూరమున ప్రవహించుచుండు కుశస్థలినదీతీరమందలి శ్రీబుగ్గదేవాలయమున శ్రీకాశీవిశ్వేశ్వరకాలభైరవస్వాముల వారికోవెలలో 5-3-32 తేదీని మహాశివరాత్రినాడు చెన్నపురమందలి సుప్రసిద్ధన్యాయవాదులగు శ్రీయుతులు వికలదేవుని రాధాకృష్ణయ్య బి. ఏ; బి. యల్ గారిసతీతిలకమగు శ్రీమతి వి. లక్ష్మమ్మగారు శ్రీకాశీవిశ్వేశ్వరునకు మహారుద్రాభిషేకము గావింపజేసి తమ స్వంతఖర్చులతో తయారుగావింపబడిన గొప్పరజతనాగాభరణమును శ్రీస్వామివారికి సమర్పించిరి. రజతనాగాభరణధారియైన శ్రీకాశీవిశ్వేశ్వరు డానాడు వచ్చిన వేలకొలది యాత్రికులకు దివ్యదర్శనమిచ్చెను. యాత్రికులందరును శ్రీమతి వి. లక్ష్మమ్మగారిభక్తి

శ్రద్ధలకు, వితరణకు మెచ్చుకొనిరి. దేవాలయకైంకర్యము ఆంధ్రస్త్రీలకు క్రొత్తగాదు. ఆంధ్రహృదయారాధనాధుడగు శ్రీరామచంద్రుని దేవాలయమును భద్రాచలములో తొలుత నిర్మించినది పోకల దమ్మక్కయను తెనుగు తెఱవ. ఆ తెనుగు తెఱవఅంశ నేటి తెనుగు తెఱవల యందును విలుప్తముకాలేదనుటకు శ్రీమతి వి. లక్ష్మమ్మగారి ఈచేత ఒకగొప్పనిదర్శనము.

**ఆంధ్రులకివి శుభవార్తలు:—**

రాజమహేంద్రవరము కళాశాలకు గండముతప్పినది. దానిని ఎత్తివేయకుండుటకు నిశ్చయించినట్లుగా మంత్రి శాసనసభలో అభయమిచ్చెను. అనంతపురమండలమును ముక్కలుచేయుటకూడ విరమించి ప్రభుత్వమువారు కొంత దూరదృష్టిని చూపగలిగిరి. ఈశుభవార్తనువిని అనంతపురమండలవాసియగు కవి ఇట్లుపలుకుచున్నాడు.

సీ. ఉండునో యూడునో మండలాఖ్యయటంచు
గుండెవ్రయ్యలు గాఁగఁగుందినారు;
వేలతరంబడి విలువయౌ పేడల
కిదిగతియంచు ఘోషించినారు;
జారచోరాది ముష్కరమానుపాళికి
నావాసమూదుమం చడలినారు;
ఎవరిఁజోత్తుము మాకునెవరుదిక్కని, వేఁడి
పెనవుఁ జేలాలుగాఁ బెటిలినారు;
ప్రాగ్దిశాదేశతటిని బ్రాభవనిదేశ
మభయదానరూపంబున నదిగొ వెడలె
నెడఁదపయిఁ జేయిపాలయ హాయినిమనుండు
శ్రీయనంత పురీగృహ శ్రేణులార!

—శ్రీ సీరిపి ఆంజనేయులు గారు.

**"మేమును ఓటు చేయుదుము":—**

లోధియనుకమిటీసభ్యులు బొంబాయిరాష్ట్రమునందలి విచారణావసరమున ఒక పల్లెకుబోయిరి. వారినిచూచి ఆయూరి మాలకాంతలు బ్రహ్మానందము పొందిరి. సభ్యులలో పురుషులగువారికి నమస్కరించియు, స్త్రీలకు సాష్టాంగపడి మ్రొక్కియు ఆమాలెతలు తమ ఆనందమును ప్రదర్శించిరి. 'మీరు ఓటరులా? ఓటుచేయుటకు ఇష్టపడుదురా?' యని ఆ స్త్రీలను ప్రశ్నింపగా "మాకు ప్రస్తుతము ఓటులేదు. ఈయబడుచో మేమును ఓటుచేయుదుము" అని చెప్పిరి. దేశపరిపాలనమున పాల్గొనకాంక్షపడుటలో తప్పుఏమి? ఇట్టి ప్రజాశక్తిని ఉపయోగించుకొనని రాజ్యాంగసంస్కరణములు నిస్సారములు.

**ఇది మాధ్యమునకు అవధి:—**

కలకత్తాలో నొకభాగమగు రామకృష్ణపురమునందలి ఒకసంపన్నగృహస్థునకు తొమ్మిదిఏండ్లబాలిక. ఆమెవితంతువులగునని జోస్యముచెప్పబడెను. ఈకష్టమునుండి ఆ బాలికనుతప్పించుటకు ఆమెతండ్రి ఆమెను ఒకమేకపోతునకిచ్చి వివాహముచేసెను. ఈపెళ్లికిని పురోహితుడున్నాడు, బంధువులు వచ్చినారు, బాజాలువచ్చినవి, సంతర్పణలు సాగినవి. మేకపోతుతో ఈపెండ్లియైనతరువాత ఆమెను తిరిగి నరునకిచ్చి పెండ్లిచేయుదురట. పశువులకు, పక్షులకు, కత్తులకు, కటార్లకు, చెట్లులకు, పుట్టలకు స్త్రీలు పెండ్లిచేయబడుట కథలలోమాత్రము విన్నాము. ఇప్పు డీరీతిని మనకు ఆవిషయమున సత్యచరిత్రమే దొరికినది.

స్త్రీ అధ్యక్షించినది:—

ఫిబ్రవరి తుదివారమున మధ్యమాగాణముల శాసనసభలో ఆదాయవ్యయపట్టికపై చర్చజరిగెను. అప్పుడు ఆసభకు శ్రీమతి రామాబాయి తంబినతి అధ్యక్షురాలుగ నుండినది. భారత స్త్రీల ఆధునికమైనఅభివృద్ధికి ఇది యొకనిదర్శనముగా చూపవచ్చును. స్త్రీలను శాసనసభ అధ్యక్షపీఠమునకు ఎక్కించుటలో మదరాసుశాసనసభ దారితీసినది. ఆరాష్ట్రపు వెనుకటి శాసనసభలో శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి ఉపాధ్యక్షురాలై యుండినది. మదరాసున చేయబడిన ఈశుభారంభము మధ్యమాగాణములందును గ్రహింపబడి ఆచరణలో పెట్టబడినందుకు మేము మిక్కిలి సంతోషించుచున్నాము.

ఈపాట్లు ఓట్లకొఱకు:—

మార్చి రెండవవారమున ఫ్రెంచిసినేటుసభ ప్యారిసుమహాపట్టణమున కూడినది. ఇంతకుమున్ను ఫ్రెంచిసినేటువారు స్త్రీలకు ఓట్లుండరాదని తీర్మానించిరి. కావున ఈసమావేశమున కొందరు స్త్రీలు ప్రవేశించి ప్రేక్షకుల స్థానమునుండి 'స్త్రీలకు ఓట్లు, స్త్రీలకు ఓట్లు' అని బొబ్బరించుచు సినేటరుల శిరములపై నీలి, తెల్లకరపత్రముల కురియించిరి. ఇట్లు గలాభాయగుటతోటనే ప్రెసిడెంటు ఆర్డరుకొఱకు గంటవాయించెను. శాంతికర్తలు వచ్చి పోయిచూతురుగదా స్త్రీలఓట్లకొఱకు ప్రచారముచేయు ఒకస్త్రీ ఒకకుర్చీకి ఇనుపగొలుసులతో కట్టివైచుకొని, ఆగొలుసులను తాళము వైచుకొనియుండెను. ఆమెను విడిపించుట బహుదుస్తరమయ్యెను. ఆస్త్రీ ఈపాట్లన్నియు తనసోదరీమణులకు ఓట్లు సంపాదించుటకు పడినది. సినేటరుల హృదయము ఇప్పుడైన కరుగునో?

అనుకరింపదగిన విషయము:—

సిలోనులో డెయిలీన్యూసుపత్రిక ప్రచురించిన ఈవార్తకు మాతోబాటు పలువురు ఆనందింతురని యెంతుము. సిలోనుగవర్నమెంటు రైల్వేల జనరలుమేనేజరు సిలోను ధూమపాననిషేధకసంఘకార్యదర్శికి వ్రాసినలేఖలో ముఖ్యమగు రైళ్ళలో ప్రతితరగతికిని చుట్ట త్రాగనివారికొఱకు ఒకబండిని ప్రత్యేకించుటకు ఏర్పాట్లుచేయుచున్నట్లు తెలిపిరి. చుట్టలు త్రాగువారు రైలుస్టేషనులను, ప్లాటుఫారములను, రైలుబండ్లను తమ ఉమ్ములతో పాడుచేసి వానిని రోగవ్యాపకమందిరములుగ చేయుచుండుట హిందూదేశమునందలి రైలు ప్రయాణికులకు అనుభవపునరుక్తమే. ఈచుట్టలుకాల్చువారు చుట్టనుసిని దులిపియు, పొగ వదలియు సాధారణముగ క్రిక్కిరిసియుండు బండ్లలోని ఊదర హెచ్చించి ప్రయాణంపుచీదరను రెట్టించుచున్నారు. వీరివలని బాధ చుట్టలుముట్టని పురుషప్రయాణికులకును స్త్రీలకును చెప్పదరముకానియంత. అమెరికా మొదలగుదేశములందు చుట్టలుకాల్చువారికి ప్రత్యేకమగు బండ్లుఉండును. సిలోనుదేశమునందు చుట్టలుకాల్చనివారికి ప్రత్యేకమగు బండ్లు ఏర్పఱుప ప్రయత్నములు సాగుచున్నవి. ఈవిషయమై మనదేశమున రైల్వేల

యందును ఏర్పాట్లుచేయబడవలసియున్నది. తోడిప్రయాణికుని ఇష్టములేనిదే ఎవరును చుట్ట కాల్చరాదనురూలు ప్రస్తుతమున్నను అది అంతప్రయోజనకారిగలేదు. కావున సిలోనులో తల పెట్టబడినపద్ధతి మనరైల్వేకంపెనీలుకూడ అనుసరింపదగును.

సహగమనమునకై స్వచ్ఛంద మరణము:—

మగడు గడ్డురోగముననున్నాడు. రోగగ్రస్తుడగు ఆపనత్కుమారరేని సేవించుటలో ఆతనిభార్య కంటికి కునుకు, ఒంటికి నీళ్లు, పంటికి మెతుకు కోరలేదు. 'మగడులేనినాడు నేనును లేనట్లే' అనిఆమె పొరుగువారితో పలుసారులుచెప్పుచువచ్చెను. ఒకనాడు ఆతనిని ప్రాణ వాయువులు వదలిపోయెను. తోడనే ఆతనిపాదపంకేరుహములచెంత ఆమె సాగిలిపడెను. చేతులు జోడింపబడియుండెను. పెదవులు భగవన్నామసంకీర్తనమునకలిసికొనుచు, విడి పోవుచునుండెను. రెండుగంటలకాలముజరిగినపిమ్మట పొరుగువారువచ్చిచూచిరి. ఆమె విగతప్రాణ. వైద్యపరీక్షచేయించిరి. ఎట్టిరుగ్మతలేదు. విషప్రయోగసంశయముకూడలేదు. బలవన్మరణమనుటకును వీలుచాలదు. "ఆమెస్వచ్ఛందముగ బ్రతుకుట మానివైచినది" అని డాక్టరుచెప్పెను. స్వచ్ఛందమరణవరముగల భీష్మాచార్యులు నేడిట్లు ఈస్త్రీరూపమున తనజన్మదేశమున తిరిగియవతరించి తన యసామాన్యసామర్థ్యమును మఱియొకసారి చూపెనా? బొంకూరాపట్టణమునందలిజనులెల్లరు ఈపూజ్యదంపతులు ఏకచితిపై భస్మమగుటచూచి కన్నులకలిమిగలవారైరి. ఆదంపతులను దహనముచేసినతావు ఇపు డొకయాత్రాస్థలము. ఆశ్మశానమున ఇపు డొకదేవాలయము వెలయనున్నది. పరసువేదిస్పర్శచే ఇనుము బంగార మగుచున్నది. పూజ్యులనుపొంది శ్మశానము దేవాలయమగుచున్నది.

---

## మార్చిమాసపు చిత్ర ప్రశ్నలకు సమాధానము

౧

సమాధానము

కన్యక, కరక, వలువ, కునుకు, మునుము, కచ్చిక, సరస, విరివి.

సరియైనసమాధానమిచ్చినవారు

1. చీమలకొండ శంకరశాస్త్రి, 2. పూళ్ళ లక్ష్మీనృసింహము, 3. దూర్వాసుల సత్యనారా యణ, 4. తి. వ. నారాయణస్వామి, 5. కనకదండి గోపాలకృష్ణశాస్త్రి.

౨

సమాధానము

హితుడు, మాధురి, చర్మము, లలన, తత్వము, నగము, యమున=హిమాచల తనయ.

సరియైనసమాధానమిచ్చినవారు

1. పూళ్ల లక్ష్మీనృసింహము. 2. చీమలకొండ శంకరశాస్త్రి, 3. కనకదండి గోపాలకృష్ణశాస్త్రి.

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. దసరా ప్రత్యేకసంచికగవెలువడు అక్టోబరుసంచిక మాత్రము రు. 0-8-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభముచేయవచ్చును. విడికాపీలువలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికిపూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనచార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తో సికేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును: ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంపకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అంచుకొనుచు ఈవలకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుతీయబడును,

## సంచికలుచేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేర లేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చాందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారిచందానెంబరును ముద్రించుటమూలముగా గృహలక్ష్మియందు ఆయామాసములయందు సూచింపబడును. ఇదిపఱకువలె ప్రత్యేకముకార్డు వ్రాయజాలము. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము. ఆ వీ. పీ. ని తిరుగగొట్టినచో మాకు అనవసర వ్యయము కల్గించినవారగుదురు.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగ చేర్చుకొనమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు. ఇది ముఖ్యముగా గమనింపవలసియున్నది.

# శ్రీ బుగ్గదేవాలయము

తపస్స్వాధ్యాయనిరతుడును జటామండలమండితుండును శాపానుగ్రహశక్తుండును రహూగణమహర్షి కుమారుడైన గౌతముడు చిత్తూరుమండలమునకు చేరిన నగరిరైల్వేస్టేషన్‌కు రెండున్నరక్రోశమాత్రదూరమున ప్రశస్థమగు కుశస్థలీనదీతీరమున కనతిదూరమం దాశ్రమమును గల్పించుకొని యందు తపమాచరించుచుండెను. కావుననే దీనికి గౌతమాశ్రమమను పేరుకలిగెను. ఇయ్యాశ్రమము నానావిధసుందరతరతరులతానికుంజ నిబిడితమై చూపఱకు అద్భుతము గొల్పుచుండును. అందెందుచూచినను శుకపికశారికాకులముల కలకలములు ప్రేక్షకుల వీనులకువిందు గొల్పుచుండును. ఇట్టి సకలమునిజనాశ్రయమగు గౌతమాశ్రయమందొకానొకప్పుడు పునీతుడగు గౌతమమహర్షిచే నాహూతమై గాంగజలము అంతర్వాహినిగానే తెంచి యీక్షేత్రమందు పంచఘట్టములందైదుపాయలుగా నెల్లప్పుడు వెల్వికరిసి ప్రవహించుటచేతనే యీస్థలము దక్షిణకాశియని పేర్కొనబడుచున్నది. శ్రీకాశియందుండు దేవతలెల్ల నిచ్చట కన్నులకు పొడగట్టుచుందురు. ముఖ్యముగ శ్రీఅన్నపూర్ణవిశాలక్షీ సమేత శ్రీవిశ్వేశ్వరస్వామియు శ్రీకాలభైరవేశ్వరుడును శ్రీప్రయాగమాధవస్వామియు ఇందువిలసిల్లుచున్నారు. పుణ్యములకు పట్టుగొమ్మయని పేరుగాంచిన యీదివ్యక్షేత్రమున పుట్టుగొడ్రాలైన నొకపరి సంకల్పపూర్వకముగా నీగంగయందు స్నానంబాచరించి శ్రీకాలభైరవు నర్చించి యభీష్టసిద్ధి నొందుచున్నది. గయాక్షేత్రమునందువలె నిచటను తీర్థశ్రాద్ధములను అస్థినిక్షేపణములు దేవతలచేజరుపబడి వాంఛితార్థసిద్ధిబడసినట్లు పురాణరాజమగు శ్రీమహాభాగవత పంచమస్కంధ ఏకోనవింశా



శ్రీ బుగ్గదేవాలయము : ఒకదృశ్యము

ధ్యాయమునందు కాళముఖపర్వతవర్ణనాఘట్టమున సుప్రసిద్ధముగ ప్రతిపాదింపబడియున్నది. కాశికి చన వీలు లేనివారనేకులు అపరకాశియగు నీబుగ్గతీర్థమందు స్వర్గీయులగు వారిఅస్థులను తెచ్చి పునీతపరచుటయు తీర్థశ్రాద్ధములపెట్టుటయు సంతానహీనులు తన్నిమిత్తమై శ్రీబుగ్గతీర్థమందు స్నానంబాచరించి శ్రీభైరవేశ్వరుని దర్శించి కామితార్థసిద్ధినొందుటయు శిలారూపభైరవమూర్తులను కైంకర్యరూపమున నాలయమునకు సమర్పించి యున్నవియు సమర్పించుచుండుటయు విశేషముగ పుణ్యదినములందు సామాన్యముగ సర్వదినములందును కన్నారగనవచ్చును. శ్రీబుగ్గతీర్థము నైర్మల్యసౌగంధ్యములకు పుట్టిల్లయి డెందమున కానందసంధాయకమై సకలరోగాపహారకమై సుప్రసిద్ధగాంగజలమై చూడ సుందరమై యుల్లోలకల్లోలముగ నిరంతరము నైదుఘట్ట



శ్రీబుగ్గదేవాలయము : మఱియొక దృశ్యము

ములలో నాల్గుఅడుగుల యెత్తునుండి వడిగాపడి ప్రేక్షకులచిత్తము నపహరించుచున్నదనుట సత్యేతరము కాదు. దక్షిణకాశియగు నీదివ్యక్షేత్రము సాధువులకు పెట్టనికోట. భక్తజనులకు పట్టుగొమ్మ. యాత్రికులకు ముంగొంగుపసిడి. వేయేల? హరిహరాదులకాలవాలమై సకలసజ్జనులకు ఇహపరసుఖదాయకమై వెలయుచున్నది. గౌ. ది. బ. బొల్లిని మునుస్వామినాయుడుగారు ప్రధానమంత్రి, శాసనసభ. గౌ. ది. బ. యస్. కుమారస్వామిరెడ్డిగారు విద్యాశాఖమంత్రి, శాసనసభ. గౌ. బి. రామచంద్రారెడ్డిగారు శాసనసభాధ్యక్షులు, చెన్నపురి. శ్రీయుత వారణాశి రఘునాథరెడ్డిగారు, చిత్తూరుజిల్లాబోర్డు అధ్యక్షులు. శ్రీయుత ఆర్. బి. రామకృష్ణరాజుగారు, చిత్తూరుజిల్లాబోర్డు ఉపాధ్యక్షులును, శ్రీకార్వేటినగరసంస్థానదేవాలయముల గౌరవ విచారణకర్తలు చిత్తూరు, చెన్నపురి సుప్రసిద్ధన్యాయవాదులలోనొకరగు శ్రీయుత వి. రాధాకృష్ణయ్యగారి

సతీతిలకము శ్రీమతి వి. లక్ష్మమ్మగారు, శ్రీయుత డి. మునిరత్నంనాయుడుగారు, తిరుత్తణితాలూకాబోర్డు అధ్యక్షులు, నీలయపాళెం సాంబయ్యపంతులుగారు జిల్లాదేవాలయముల ఇనస్పెక్టరు చిత్తూరు, మున్నగు ప్రముఖు లనేకులు శ్రీబుగ్గతీర్థమందు స్నానంబాచరించి శ్రీస్వామివారినిదర్శించి వందలకొలదిగ శ్రీబుగ్గదేవాలయపునరుద్ధరణమునకు ద్రవ్యసహాయ్యమొనర్చినది గాక శ్రీబుగ్గదేవాలయ జీర్ణోద్ధారణకమిటీవారికి చేదోడు వాదోడుగ నుందుమనియు వాగ్దానము చేసియుండిరి. శ్రీయుత రా. బ. కె. సీతారామరెడ్డిగారు హిందూదేవాలయములకు కమీషనరు చెన్నపురి, బ్రహ్మశ్రీ జిల్లాల వెంకటసుబ్బయ్యగారు ప్రధానోపాధ్యాయులు పచ్చయప్పన్ హైస్కూలు చెన్నపురి, గుంటూరుమండలములోని కోసరాజు రాఘవయ్యచౌదరిగారు, తిరుత్తణిబోర్డు హైస్కూలు, ఆంధ్రప్రధాన పండితులును ఆంధ్రపత్రిక స్వకీయవిలేఖరియునగు శ్రీయుత బూదూరు రామానుజులురెడ్డిగారు మున్నగు ప్రముఖులనేకులు విజయముచేసి దక్షిణకాశియనియు కాశిలోనుండు విశిష్యములన్నియు నున్నవనియు పురాతనక్షేత్రమనియు యిచ్చటి ప్రభువుల ద్రవ్యసహాయ్యముచే నిండింకను యాత్రికజనసౌకర్యములు ఏర్పరుపబడవలయుననియు తమ అభిప్రాయముల ప్రకటించియున్నారు. భారతదేశీయులకును అందు ముఖ్యముగ మన ఆంధ్రదేశీయులకును నిట్టిదివ్యస్థలము లభియించినందులకు చాలసంతసిలుచు పలువురు తమ బంధుమిత్రాదుల నిటకరుగ చేరంబురికొల్పి శ్రీస్వామివారి దర్శనభాగ్యమునందజేసి కృతకృత్యులయ్యెదరుగాక యని యాసించువారము. ఈ పుణ్యక్షేత్ర పునరుద్ధరణమునకై నిరంతరదీక్షాపరతంత్రులై కృషియొనర్చుచుండు శ్రీబుగ్గదేవాలయజీర్ణోద్ధారణకమిటీవారి కెల్లరు ద్రవ్యసహాయ్యమొనర్చి దేవాలయమునందలి జీర్ణభాగములనుపూర్తిచేయించి శ్రీవిశ్వేశ్వరస్వామ్యనుగ్రహపాత్రులయ్యెదరుగాక యని వేవిధంబుల ప్రార్థించుచున్నారము.



రజతనాగాభరణము

[శ్రీబుగ్గదేవాలయమున కీరజతనాగాభరణమును 5-3-32 తేదీని మహాశివరాత్రినాడు చెన్నపురమునందలి సుప్రసిద్ధన్యాయవాదులగు శ్రీయుతులు విఠలదేవుని రాధాకృష్ణయ్య బి.ఏ;బి.యల్ గారి సతీతిలకమగు శ్రీమతి లక్ష్మమ్మగారు ఒసంగిరి. పైన శ్రీమతిగారి చిత్రమునుగలదు.]

ఇట్లు

విన్నవించు విధేయులు

యన్. సుబ్రహ్మణ్యశర్మ

యన్. మునివెంకటలక్ష్మమ్మఅనే కాంతమ్మ.

శ్రీబుగ్గదేవాలయ జీర్ణోద్ధారణకమిటీ మెంబర్లు.